**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం . 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)
24-30 జూలై, '87
శ్రీ ప్రభవ నామ సం. శ్రావణ బ. చతుర్దశి
సంపుటము 79 : సంచిక 47
ముఖ్య సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు :
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75 |
| పోస్టులో 6నెలల చందా | రు. 80.60 |
| పోస్టులో 12నెలల చందా | రు. 161.20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి : పూర్ణిమ
(ఫోటో : కాజాస్)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :



## గమనిక

డా. జయదుబాసీ అమెరికా సంయుక్త రాష్ట్రాల పర్యటనలో ఉన్నందు వల్ల ఈ వారం న్యూఢిల్లీ లేఖ ప్రచురించలేకపోతున్నాము. –సం.




### వేయి పడగలు

వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంటోంది. "వేయి పడగలు" వారం వారం మమ్ములను తన్మయులను చేస్తున్నది.

–నాగంట్ల వెంకటేశ్వరరావు, రమేష్, డోర్నకల్

★ ★ ★

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి 'వేయి పడగలు' నవల సీరియల్‌గా అందిస్తున్నందుకు కృతజ్ఞతలు తెలియ చేస్తున్నాను.

–మంచింశెట్టి శ్రీనివాసు, పురుషోత్తపల్లి

### సీరియల్స్

"ప్రేమసాగర మథనం" సీరియల్ రసవత్తరంగా ఊహించని సంఘటనలతో పాఠకుల్ని ఆలోచింప చేసేలావుంది. సందీప్ పాత్ర ముందు ముందు ఏవిధంగా రూపొందుతుందో అని ఎదురు చూస్తున్నాము.

–హేమసుందర్‌రావు, నాగినీప్రియ, డోర్నకల్

★ ★ ★

"ప్రేమసాగర మథనం" సీరియల్ చదువుతున్నంత సేపు సంఘటనలు కళ్ళకు కట్టినట్లుగా సినిమా చూస్తున్న అనుభూతి కలుగుతున్నది.

–ఇమ్మనేని వెంకటేశ్వరరావు, ఆకుల అల్లూరు

★ ★ ★

ప్రేమసాగర మథనం, ప్రత్యూష పవనాలు సీరియల్స్ చదువుతుంటే ఎంతో ఆనందానుభూతి కలుగుతున్నది. –ఎస్. వసుంధర, ధేనువకొండ

★ ★ ★

"ప్రత్యూష పవనాలు" సీరియల్ చాలా బాగున్నది. ముందు ముందు ఇంకా బాగా సాగాలని కోరుతూ, రచయిత్రిగార్కి నా హృదయపూర్వక అభినందనలు తెలుపు చున్నాను. –కొండపి లలిత, ఒంగోలు

★ ★ ★

"తీపి గురుతు" సీరియల్ మంచి రసవత్తరంగా వుంది. ముఖ్యంగా (జూన్ 26–2 జులై) సంచికలో ఏ బాధలు వచ్చినా పేదవాళ్ళకే ఎదురవుతాయి అన్నట్లుగా వరదలలో సమస్తం పోయి దుఃఖించుతున్న వారికి చేసే సహాయంలో కూడా లంచగొండితనానికి పాల్పడి, పైగా అంత వరదలలో సంగమయ్య గేదె చనిపోయినట్లు ఫోటో దిగితేనే సొమ్ము మాఫీ చేసే వాళ్ళం అన్న ప్రభుత్వపు రూల్సుకి నవ్వాలో, ఏడవాలో అర్థం కాలేదు. ఇంత మంచి సీరియల్ మాకు అందిస్తున్నందుకు రచయిత శ్రీ ఆదూరి వెంకట సీతారామమూర్తి గార్కి అభినందనలు. "వేయి పడగలు" సీరియల్ పత్రికకే హైలైట్. మిగతా రెండు సీరియల్స్ చాలా బాగున్నాయి.

–మేచినేని అనూరాధ, అశ్వారావుపేట

### కథలు

"ఊబి" కథలో 'ధర్మానుసుపత్రి' గురించి చక్కగా వివరించేరు. "ఆశలు – కలలు" కథ అందరికి 'కల' గానే ఉంచి వేసేరు. రచయితలకు అభినందనలు.

–డి. మనోహర్, మాధురి, రాయగడ

★ ★ ★

"ఊబి, జబ్బుమనుషులు" కథలు వాస్తవానికి దగ్గరగా ఉండి మనుషుల స్వార్థపరతను, సంకుచితత్వాన్ని ప్రతిబింబిస్తున్నాయి. ఈ కథలు చదివి కొందరైనా మారితే బాగుంటుంది.

–జి. క్రిష్ణమూర్తి, ధర్మవరము

( 72 వ పేజీ చూడండి)

# ఉక్కుతో దీటైన శక్తినిచ్చే
# విష్ణు సిమెంట్‌తో ఇప్పుడు...

## బహుమతులు గెలుపొందే సదవకాశం



వివరాలకు మీ దగ్గరలోని
విష్ణు సిమెంట్ డీలరును సంప్రదించండి.






**శ్రీ విష్ణు సిమెంట్ లిమిటెడ్**

గుల్‌మొహర్ ఎవెన్యూ, రాజ్‌భవన్ రోడ్, హైదరాబాద్-500 482.



# ప్రేమసాగరమథనం

డాక్టర్ కొత్త రవీంద్రబాబు



సీరియల్

(గత సంచిక తరువాయి)

కింగ్‌కాంగ్ మాటలు విని ఆలోచనలో పడ్డాడు రాఘవరావు.

"ఇల్లు, క్లబ్బు వున్న స్థలం విలాసినివే! ఇరవై సంవత్సరాల నాడు ఆ స్థలం ఖరీదు ఎక్కువ లేకపోయినా యీ రోజు కార్పొరేషన్ అయిన విజయవాడలో కొన్ని కోట్ల రూపాయల విలువ చేస్తుంది.

ఇవాళ కొన్ని కోట్ల రూపాయలు పోయినంత మాత్రాన యీ రాఘవరావుకు పెద్దగా వచ్చే పర్వా ఏముండదు!

కాని "అదుగో ఆ రాఘవరావు అల్లుడు కూతురు చేత తండ్రి మీద దావా వేయించాడు!" అని నలుగురు అనుకుంటే ఎంత పరువు నష్టం!

వున్నది వున్నట్టు పడి వుండక పెద్దమ్మాయి ఎవరో వుత్తరాది వాడితో కలసి వుడాయించిందట! ఈ ప్రాంతపు వాడయితే రాఘవరావు మీద కత్తి కట్టటం కోరి ప్రాణం మీదకు తెచ్చుకోవడం అని తెలుస్తుంది. దూరదేశపు వాడికి ఆ విషయం తెలియక పోవచ్చు.

శాంత తమ్ముడు నారాయణరావు వుత్తర దేశం పారిపోయాడని విన్నాను! ఎంత వెతికినా అతని అచూకీ తెలుసుకోలేకపోయాను!

ఒకవేళ వాడే వచ్చి మేనగోడలును తీసుకు వెళ్ళలేదు గదా?!"

ఉలిక్కి పడ్డాడు రాఘవరావు. "వాడికెన్నేళ్ళుంటాయి?" అని అడిగాడు కింగ్‌కాంగ్‌ని.

"ఎవరికి బాస్?"

"అదే! వాడే! పెద్దమ్మాయిని కూడా తీసుకు వెళ్ళినవాడు!"

"ఆయనకు ఇరవై ఇరవై రెండేళ్ళుంటాయండి సార్!"

"ఉహు!" అంటూ ఆలోచనలో పడిపోయాడు రాఘవరావు.

నారాయణరావుకు యిప్పుడు నలభై ఏళ్ళ పైనే వయసుంటుంది. అయితే ఆ వచ్చిన తను నారాయణరావు కొడుకేమో?

ఏమిటి వెర్రి ఆలోచన! ఎక్కడో ఉత్తరదేశాన పుట్టి పెరిగిన యువకుడు ఎప్పుడో చచ్చిన మేనత్త కూతురు కోసం ఇంత దూరం వస్తాడా?

నారాయణరావు విజయవాడ కాదు గదా ఆంధ్రప్రదేశంలోనే అడుగెట్టినట్టు దాఖలాలు లేవు. అతని కొడుకు యింత దూరం వస్తాడనేది తెలివితక్కువ ఆలోచన!

మరి విలాసినిని లేవదీసుకుపోయిన తను ఎవరు?!

కింగ్‌కాంగ్ చెప్పినట్టు యీ విషయాన్ని తేలికగా కొట్టి పారేసే వీలులేదు! అని మనసులో అనుకుని–

"అరేయి కింగ్‌కాంగ్! అమ్మాయీ, ఆ వుత్తరాది వాడు ఎక్కడ వున్నారో అచూకీ తియ్యి! ఎంత డబ్బయినా పర్వాలేదు! అచూకీ తెలియగానే వాడిని సఫా చెయ్యాలి. రాఘవరావు మీద కత్తి గట్టిన వాళ్ళెవ్వరూ బతికి వుండగూడదనే రూలు నీకు తెలియంది గాదు!"

"అలాగే బాస్!"

"అవసరం అయితే నువ్వు స్వయంగా బయల్దేరి వెళ్ళి అచూకీ తీయి.

ఎంత త్వరగా వాణ్ణి సఫా చేస్తే అంత మంచిది!"

"అలాగే బాస్" అంటూ తలూపాడు కింగ్‌కాంగ్.

* * * *

కింగ్‌కాంగ్ అసలు పేరు భీమసేనరావు! పుట్టినప్పుడతని బరువు ఎనిమిది కేజీలు! అందుకని అతని కాపేరు పెట్టారు!

"తిండి దండుగే, బుర్ర శూన్యం!" అని అనసాగాడు అతని మేనమామ. భీమసేనరావు కడుపులో వుండగానే అతని తండ్రి మరణించటంతో తల్లి పుట్టింటికి చేరక తప్పలేదు!

కాని మేనమామ మాటలకు భిన్నంగా అతడు అసాధారణమైన తెలివితేటలు చూపించ సాగాడు. అతని తెలివితేటలు చూసి తల్లి మేనమామ సంతోషించారు గాని మేనమామ భార్యకు అతన్ని చూస్తేనే కంపరం బుట్టుకొచ్చేది. ఇంట్లో వున్నదంతా తిన్నా వాడి ఆకలి తీరదు! అడ్డంగా నిలువుగా వళ్ళు పెంచు కుంటున్నాడు. వాడు పెద్దవాడయ్యే లోపల నా కొంప గుణ్ణమవుతుంది!" అనుకుని పుట్టింటికి వెళ్తున్నానన్న నెపంతో వెంట అతన్ని తీసుకు వెళ్ళి విజయవాడ స్టేషన్‌లో అతన్ని ఫ్లాట్‌ఫాం మీద వదలి "ఇప్పుడే వస్తానని" చెప్పి వెళ్ళిపోయింది.

కాని ఆమె పుట్టింటికి వెళ్ళి నాలుగు రోజులున్నాక దిగులుగా ఇంటికి తిరిగి వచ్చి ఆడబడుచుతో

"అబ్బిగాడు విజయవాడ స్టేషన్‌లో మారుపడిపోయాడు" అని ఏడుస్తూ చెప్పింది.

"వాడప్పుడే మనూరి సుబ్బయ్య వెంబడి యింటికి తిరిగొచ్చాడ"ని చెప్పింది ఆడపడుచు.

గుండెలో బండ పడ్డట్టు దిగులు పడి పైకి నవ్వు పులుముకుని "అలాగా!" అంది భీమసేనరావు మేనమామ భార్య.

ఆ రోజు నుండి అతన్ని హతమార్చాలని ఎన్నో ప్రయత్నాలు చేసిందామె! ఎలుకల మందు కలిపిన ఆహారం పెట్టింది! పవరు చాలకనేమో మందు

**జరిగిన కథ –8 :** తన ముఠా స్థావరంపై దాడికీ, విలాసిని ఖాతాలో ఎనిమిది లక్షలు చేరడానికీ సంబంధం ఉన్నదనీ అనుమానించి విలాసిని మీద, సన్నీ మీద పగబడతాడు నాగరాజు. సన్నీ కుడిభుజమైన సాంబును చంపేయిస్తాడు. నాగరాజు కిరాయి మనుషులు, సన్నీ కిరాయి మనుషులు విలాసిని గది ముందర భీకరంగా ఘర్షణ పడతారు. ఆ ఘర్షణ సమయంలోనే దీప్, విలాసిని అక్కడ్నించి పారిపోతారు. దొరికిన రైలు ఎక్కి మద్రాసుకు ప్రయాణం కడతారు. తన ఆస్తులకు ముప్పు వస్తుందేమోనని రాఘవరావు కూడ విలాసినిని వెతకాలని నిర్ణయించుకుంటాడు.




అతన్నేమీ చేయలేదు.

భర్త అడబదుచు చూడకుండా అతన్ని నానాహింసలు పెట్టసాగింది!

అత్త పెట్టే చిత్రహింసలు భరించలేక ఆరేళ్ళ వయసులో ఇంట్లోంచి పారిపోయాడు భీమసేనరావు! కొన్నాళ్ళు సర్కస్ ట్రూప్‌లో వుండి ఫీట్లు నేర్చుకున్నాడు. ఆ తర్వాత రెజ్‌లర్ కింగ్‌కాంగ్ దగ్గర వుండి కుస్తీ పట్లు నేర్చుకున్నాడు. అతని ఆకారాన్ని చూసి అంద రూ జూ నియర్ కింగ్‌కాంగ్ అని పిలిచేవాళ్ళు. కింగ్‌కాంగ్ మరణించాక భీమసేనరావును అందరూ కింగ్‌కాంగ్ అని పిలువసాగారు.

శరీర బలం బుద్ధి బలం వున్న కింగ్‌కాంగ్ త్వరలోనే రౌడీ ముఠా కూడగట్టుకుని బతుకసాగాడు. రాఘవరావు దృష్టిని ఆకర్షించి అతని దగ్గర చేరాడు. క్రమంగా ఒకో మెట్టూ ఎక్కి రాఘవరావు పి. ఏ. కం బాడీగార్డుగా మారాడు!

రాఘవరావు దగ్గర వున్నా అతను బాచ్‌ని మెయిన్‌టెయిన్ చేసేవాడు! ఆ

# రచయిత జవాబులు



హిమబిందు, నాగినీప్రియ, డోర్నకల్.

ప్ర : వైద్య వృత్తికి సంబంధించిన నవలలు రాయడం ఇష్టమా? లేక తద్భిన్నమైన విషయంపై రాయడం ఇష్టమా?

జ : అన్ని రకాల విషయాల గూర్చి, వైద్య వృత్తికి సంబంధించిన ఇతివృత్తాలతో సహా నవలలు వ్రాసాను. వ్రాస్తున్నాను.

వై. కార్తీక్, డోర్నకల్

ప్ర : రచయిత పాత్రలు సృష్టించేటప్పుడు పడే పురిటి నొప్పులకు స్త్రీ ప్రసవించేప్పుడు పడే నొప్పులకు తేడా ఏమిటి?

జ : పాత్రలు సృష్టించాక రచన పూర్తయ్యాక రచయిత మానసిక గ్లానికి లోనవుతాడు. ప్రసవమయ్యాక స్త్రీ శారీరక గ్లానికి లోనవుతుంది. గ్లాని తాత్కాలికమే, రెండు సందర్భాలలోనూ!అంతకు మించిన ఆనందం కష్టాన్ని మరపింపజేస్తుంది.

కె. శివరామిరెడ్డి, నందివెలుగు

ప్ర : భావుకులు మానసిక దుర్బలులు.

జ : అతిగా ఊహిస్తూ, ఊహల్లో జీవిస్తూ ప్రపంచాన్ని మరిచిపోయి కర్తవ్య నిర్వహణ సక్రమంగా నెరవేర్చలేని వాళ్ళు మానసిక దుర్బలులే!

ఎం. మధుపద్మజ, ఖర్గపూర్

ప్ర : స్వార్థం లేనిది ప్రపంచంలేదు!

జ : నిజమే. కాని సొంత స్వార్థం కొంత తగ్గించుకుని ఇతరుల మేలు కోరడం ఉత్తమ జీవుల లక్ష్యం.

శ్రీపాద శ్రీను, లంక రమేష్, బొబ్బిలి

ప్ర : రసికలాటి వాళ్ళుంటారా?

జ : ఎందుకుండరు?!

హేమసుందరరావు, డోర్నకల్

ప్ర : వైద్య వృత్తిలో వుంటూ రచనలు సాగిస్తున్నారు. సమయం ఎలా కుదురుతున్నది? దేనిలో ఎక్కువ టెన్షన్ ఫీలవుతారు

జ : ఖాళీ సమయంలో వ్రాయాలనిపించినప్పుడు రచనలు సాగిస్తున్నాను. వైద్య వృత్తిలో ఉండే టెన్షన్ ఎక్కువ.

ప్ర : నిరాశ నిస్పృహలకు లోనయ్యే వర్ధమాన రచయితలకు మీరిచ్చే సలహా.

జ : కృషితో నాస్తి దుర్భిక్షం.

ప్ర : రచయిత రచనలలోని ఆశయాలు నిజ జీవితంలో ఆచరించాలన్న భావం ఎంతవరకు సమంజసం?

జ : ఆచరించి చెప్పిన, వ్రాసిన విషయానికి విలువ ఎక్కువ.

ఎన్. ఎం. కళావతి, సత్తుపల్లి

ప్ర : విలాసిని సందీప్ పెళ్ళి చేసుకుంటారా? వారి వివాహం మంచిగా అయేట్టు చూడండి.

జ : సీరియల్ చివర వరకు చదవండి.

## ప్రేమసాగర మథనం

బాచ్‌లో మనుష్యులు విజయవాడలో ఏ మూల ఏం జరుగుతుందో తెలుసుకోవడమే గాకుండా రాఘవరావు క్లబ్‌లోను యింటి దగ్గర ఏం జరుగుతున్నదో చూసి వచ్చి అతనికి చెప్పేవాళ్ళు! అందువల్ల కింగ్‌కాంగ్ సకాలంలో బాస్‌కు సరి అయిన సలహా లిచ్చి చిక్కు పరిస్థితులలో పడకుండా గట్టెక్కించేవాడు

సంవత్సరాలు గడిచిన కొద్దీ కింగ్‌కాంగ్ రాఘవరావుకు నమ్మినబంటుగా మారిపోయాడు.

* * * *

త్రిశంకు స్వర్గం పక్కన వున్న రూమ్‌లో పట్టపగలే చీకటిగా వుంటుంది. రాఘవరావు క్లబ్‌లో వర్కర్లు ఆ రూమ్‌ను త్రిశంకు నరకం అని పిలుస్తుంటారు. ఆ రూంలో కుర్చీలో కూర్చుని శివ వైపు ఉరిమి చూడసాగాడు కింగ్‌కాంగ్.

అంతకు ముందే అతని అనుచరులు శివను జ్యోతి హోటల్ నుండి యింటికి వెళ్తుండగా పట్టుకుని తీసుకు వచ్చారు. త్రిశంకు నరకంలోకి రాగానే అతన్ని పెడరెక్కలు విరిచి కట్టారు.

"చెప్పు! వాడేమయ్యాడు?"

"ఎవరుసార్?" కింగ్‌కాంగ్‌ను చూడగానే శివ ప్రాణాలు కడబట్టిపోయాయి. అతన్ని గూర్చి అతని క్రూరకృత్యాల గురించి విజయవాడలో అనేకమంది చెప్పుకుంటుండగా అతను వినివున్నాడు.

"మాదర్చోద్! అయ్యగారినే ప్రశ్నిస్తావా?" అంటూ కొరడాతో చెళ్ళుమని బాదాడు కింగ్‌కాంగ్ అనుచరుడు.

కొరడా నిండుకూ ఇనుప రజను, దూలగొండి ఆకు పిండి అంటించి వుండడంతో దెబ్బ తగిలినంతమేరా చర్మం కమిలి నెత్తురు చిమ్మి విపరీతమైన సురదపుట్టసాగింది - విపరీతమైన బాధకు తోడు విపరీతమైన దురదతో గిలగిలలాడిపోయాడు శివ.

"జ్యోతి హోటల్‌లో 303 నంబరు గదిలో పి సత్యనారాయణ అనే పేరుగల వ్యక్తి రెండ్రోజులనాడు దిగాడు. అతన్ని ఆ రోజే మా క్లబ్‌కు తీసుకునివచ్చావు! నిన్న అతనివెంట టాక్సీలో సూర్యారావుపేట వెళ్లావు!

అతనిగూర్చి నేను అడుగుతున్నాను!

అర్థం అయిందా?" గర్జించాడు కింగ్‌కాంగ్. అర్థం అయిందన్నట్లు తలూపాడు శివ.

"అతనెక్కడికి వెళ్లాడు?"

తెలియదు అంటే మళ్ళీ కొరడాతో కొడతారేమోనన్న భయంతో మెదలకుండా వుండిపోయాడు శివ.

మాట్లాడకుండా వున్నందువల్ల కొరడా దెబ్బలు తప్పలేదు. ఎడాపెడా వంటిమీద కొరడా దెబ్బలు పడి భయంతో, బాధతో గావుకేకలు పెట్టాడు శివ.

కింగ్‌కాంగ్ సైగ చేయగా కొరడాతో కొట్టడం ఆపాడు అతని అనుచరుడు కిషన్.

"అరేయి కిషన్! పోయి యాసిడ్ పట్రా! కొరడా దెబ్బలు తగిలినచోట యాసిడ్ పోస్తే శివగాడి తలలోని జేజ దిగి నిజం పలుకుతుంది!" అన్నాడు కింగ్‌కాంగ్.

ఏసిడ్‌లో ముంచిన కుంచెతో శివ వంటిమీద గాయాన్ని తడిపాడు కిషన్.

శివకు విపరీతమైన బాధతో శరీరం యావత్తూ గిజగిజలాడింది!

"నువ్వు నిజం చెప్పకపోతే యాసిడ్‌సీసా నీమీద కుమ్మరిస్తాడు కిషన్! దాంతో బొందితో కైలాసం వెళతావు!" అన్నాడు కింగ్‌కాంగ్.

"సార్! నిజం చెబుతాను!" అన్నాడు శివ. కింగ్‌కాంగ్ సైగ చేస్తే ఏసిడ్ సీసా తీసుకుని అవతలకు వెళ్లాడు కిషన్.

"రాఘవరావుగారి పెద్దమ్మాయి ఆ వుత్తరదేశపాయన పార్కు టాక్సీలో సూర్యారావుపేటనుండి వెళ్లిపోయారు! ఆ రెక్కడి కెళ్లారో నాకు సత్య ప్రమాణికంగా తెలవదు!" వెక్కుతూ అన్నాడు శివ.

ఏసిడ్ సీసాతో శివ దగ్గరకు వెళ్ళబోతున్న కిషన్‌ను వారించాడు కింగ్‌కాంగ్.

"అరేయ్! అనవసరంగా ఎవర్నీ బాధించకూడదురా! వాణ్ని సిటీ అవతల పారేసిపోయి పార్కుగాణ్ని పట్టుకు రండి!" అన్నాడు కింగ్‌కాంగ్

శివ కాళ్ళు చేతులు కట్టి గోనె సంచిలో వేసి కారు డిక్కీలో తీసుకువెళ్ళి విజయవాడకు పది మైళ్ళ దూరంలో ఏలూరు రోడ్డు పక్కన పడవేయించాడు కిషన్!

ఎం. నరసింహం, ఏలూరు

ప్ర : ఈనాటి రచయితలు సమాజాన్ని మార్చటానికి ప్రయత్నించటం లేదు.

జ : ఏ రచనలో అయినా ఉండే మంచిని మాత్రం స్వీకరించి చెడును వదలివేస్తే బాగుంటుంది. సమాజం దానంతటదే బాగుపడుతుంది.

కె. శాయిలీల, నందివెలుగు

ప్ర : మీ మొదటి రచన అచ్చయినప్పుడు మొదటి నవల బహుమతి పొందినప్పుడు ఏమనిపించింది?

జ : ఓపిక చేసుకుని తీరిక చూసుకుని మరిన్ని రచనలు వ్రాయాలనిపించింది.

ఎం. మధుబాల, ఖర్గపూర్

ప్ర : అనంతకోటి జీవరాసులలో స్వార్థం లేని దేది?

జ : స్వార్థంలేని జీవి లేదు.

వాడ్రేవు దుర్గాప్రసాద్, తణుకు

ప్ర : పూర్వం సినిమాలు, నవలలు బాగుండేవి.

జ : పాత సినిమాలు చూస్తూ, పాత నవలలు చదువుతూ వుండండి!

కె ఎస్. వాసు, హనుమాన్ జంక్షన్

ప్ర : అందానికి, అభివృద్ధికి, నీతికి సరి అయిన అర్థం చెప్పగలరా?

జ : సరిబంధం లేని విషయాల్ని సమన్వయించ మంటున్నారు.

## ఉత్తమ ప్రశ్న

**పెయ్యేటి చండీప్రియ చాముండేశ్వరి, చిలకలూరిపేట**

ప్ర : ఇంతవరకు మీరు రచించిన నవలలో ఏ పాత్ర మీకు నచ్చింది? ఎందువలన?

**జ: సుశ్రుత నర్సింగ్‌హోం నవలలో హీరో డాక్టరు రవి పాత్ర నాకు నచ్చింది. వృత్తి ధర్మానికి అంకితమయి అపురూప మైన త్యాగానికి సిద్ధపడ్డ డాక్టరు రవి పాత్ర మరచిపోలేను.**

హిమబిందు, దోర్నకల్

ప్ర : తొలిసారిగా మీ రచన అచ్చులో చూసుకున్నప్పుడు ఎలాటి అనుభూతి పొందారు?

జ : ఈ శీర్షికలో నే సమాధానం వుంది.

డి. నాగేంద్రరావు, గంపలగూడెం

ప్ర : దేవాలయాలపై బూతు బొమ్మలెందుకు?

జ : సెక్స్ ఎడ్యుకేషన్ కోసం.

ఐరేని శ్రీనివాసగౌడ్, రామాయంపేట (మెదక్)

ప్ర . రచయితలు యువతను వూహాలోకాల్లో విహరింపజేస్తూ డబ్బు సంపాదనే ముఖ్యంగా భావిస్తున్నారు. ఈ తప్పు పాఠకులదా రచయితలదా?

జ . రచనలలో వుండే మంచిని తీసుకొని చెడును వదలి వేస్తే బాగుంటుంది.

మంగా శ్రీనివాసరెడ్డి, కతెవరం

ప్ర : ఒక ఒరలో రెండు కత్తులిమడవు. వృత్తి ధర్మానికి రచనా వ్యాసంగానికి కట్టుబడిన మీరు ఆయా ధర్మాలకు ఎంతవరకు న్యాయం చేకూర్చగల్గుతున్నారు

జ : గతంలో అనేకమంది ప్రఖ్యాత డాక్టరు రచయితలున్నారు. ఇక ముందూ వుంటారు!

హెచ్. ఆర్. వి. రాజకుమార్, బళ్లారి

ప్ర : మీరు వ్రాస్తున్న సీరియల్‌కు, నిజ జీవితానికి ఎంత తేడా ఉందనుకుంటున్నారు?

జ : మీ ప్రశ్నకు పాఠకులే సమాధానం చెప్పాలి.

ప్ర : మీ నవల బాగా జనాదరణ పొంది సినిమాగా రావాలనుకుంటున్నారా?

జ : ఆ విషయం గురించి నేనింత వరకుఏమీ అనుకోలేదు!

**కోటగిరి సీత, రేచర్ల, చింతలపూడి**

ప్ర : ఎన్ని నవలలు రాసారు?

జ : ఇరవై. □

టాక్సీ స్టాండ్‌లో వున్న పార్ధు దగ్గరకు వెళ్ళి "బాస్ రమ్మంటున్నాడు" అని పిలిచాడు పంగనామం.

పంగనామాలు పెట్టడంలో ప్రసిద్ధుడవడంతో అతని కాపేరు వచ్చింది!

అల్లంతదూరంలో కింగ్‌కాంగ్ అనుచరుడు పంగనామాన్ని చూడగానే భయంతో బిగుసుకుపోయాడు పార్ధు.

"బాస్ రమ్మంటున్నాడు" అనగానే పై ప్రాణాలు పైనే పోయా యతనికి.

డ్రైవర్ సీటులో నుండి ఆతన్ని పక్కకు తోసి అతని టాక్సీ డ్రైవ్ చేసుకుని క్లబ్‌కు తీసుకు వచ్చాడు పంగనామం.

త్రిశంకు నరకంలోకి అడుగెడుతూనే భయంతో జావగారి కుప్పగూలి పోయాడు పార్ధు.

"రేయ్ పార్థూ! వణుకుడు ఆపి నిన్న సాయంత్రం నీ కారులో సూర్యారావు పేటనుండి తీసుకు వెళ్ళిన అమ్మాయిని, అబ్బాయిని ఎక్కడ దించావో చెప్పు!" అన్నాడు పంగనామం.

పరిగెత్తుకు వెళ్ళి కింగ్‌కాంగ్ పాదాలమీద పడి,

"సార్! వాళ్ళిద్దరూ రైల్వేస్టేషన్ దగ్గర దిగారు సార్! మీ పాదాలతోడు!" అంటూ గోడు గోడున విలపించాడు పార్ధు.

కింగ్‌కాంగ్ బూటు కాలితో పార్ధును తన్నాడు! పార్ధు ఫుట్‌బాల్‌లా దొర్లుకుంటూ వెళ్ళి వాకిలి దగ్గర పడ్డాడు.

"వొరేయ్! ఈ చచ్చు పీనుగను తీసుకువెళ్ళి గేటవతల వదిలి రండి!" అన్నాడు కింగ్‌కాంగ్.

పంగనామం పార్ధును అవతలకు ఈడ్చుకువెళ్ళిన మరుక్షణమే కింగ్‌కాంగ్ మరో అనుచరుడు పట్టివర్ధనం లోపలకు వచ్చి సూట్‌కేస్, జిప్ బాగ్ బల్లమీద వుంచాడు.

కాళీ జిప్ బాగ్‌ను అవతలకు విసిరేసి సూట్‌కేస్ తెరిచి చూడసాగాడు కింగ్‌కాంగ్.

బట్టల అడుగున సందీప్ సన్ ఆఫ్ నారాయణరావు, దీప్ ఎంటర్ ప్రైజెస్ అని రాసి వున్న విజిటింగ్ కార్డ్ చూడగానే అతని కళ్ళు మిలమిల మెరిసాయి.

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

"బాస్" నెమ్మదిగా పిలిచాడు కింగ్‌కాంగ్.

"ఉ! ఏమైనా ఆచూకీ దొరికిందా?"

కళ్ళు మూసుకునే అడిగాడు రాఘవరావు.

"బాడ్ న్యూస్ బాస్! అమ్మాయిగార్ని తీసుకు వెళ్ళింది మీ బావమరిది నారాయణరావు కొడుకు సందీప్!"

ఒక్క ఉదటున లేచి కూర్చున్నాడు రాఘవరావు.

"ఏమిట్రా నువ్వనేది?"

"అవును బాస్!" అంటూ సందీప్ విజిటింగ్ కార్డ్ చూపించాడు కింగ్‌కాంగ్.

విజిటింగ్‌కార్డ్ పరిశీలనగా చూచిన తర్వాత రాఘవరావు ముఖం క్షణం వివర్ణమైపోయింది.

"ఉత్తరదేశం నుండి వచ్చిన యువకుడు జ్యోతి హోటల్ 303 రూంలో సామాను వదలివేసి అర్ధాంతరంగా అమ్మాయిని తీసుకువెళ్ళిపోయాడు! అతని సూట్‌కేస్‌లో దొరికిందా కార్డు!" అన్నాడు కింగ్‌కాంగ్

"నారాయణరావుకు కొడుకున్నాడన్నమాట!" అన్నాడు రాఘవరావు సాలోచనగా.

"భారతదేశంలో ఏ మూలన వున్నా సరే వేటాడి ఆ సందీప్‌గాడ్ని హతమార్చాలి!

ఆస్తి కోసం కాదు!

ఇది ప్రెస్టేజి క్వొశ్చను!" గర్జించాడు రాఘవరావు

"అలాగే బాస్!"

"మందీ మార్బలంతో వెళ్ళు! ఎంత ఖర్చయినా వెనుకాడకు!" అంటూ సంతకాలు పెట్టిన బ్లాంక్ చెక్‌బుక్ అతని ముందు పడేసాడు రాఘవరావు.

"బాస్! మీరు చెప్పిన పని చేసేవరకు ఏమారను! నిద్రాహారాలు మాని అయినా సందీప్ ఆచూకీ తీసి సఫా చేస్తాను!" అంటూ శెలవు తీసుకున్నాడు కింగ్‌కాంగ్.

రాఘవరావు దగ్గర్నుండి యివతలకు రాగానే కింగ్‌కాంగ్ దీప్ విజిటింగ్‌కార్డ్ మీదవున్న ఢిల్లీ ఫోన్ నంబరుకు డైరెక్టుగా డయల్ చేసాడు.

"హలో! నారాయణరావుగారేనా మాట్లాడేది?"

"లేదు! కొద్ది రోజులక్రితం నారాయణరావుగారు మరణించారు!"

"అలాగా! వాట్ ఎ సాడ్ న్యూస్! వారి అబ్బాయి సందీప్‌ను మాట్లాడమనండి!"

"తండ్రిగారి అస్థికలు కృష్ణలో కలపటానికి సందీప్ విజయవాడ వెళ్ళాడు. ఇంతకీ మీరెవరు?"

## న్యూయార్క్‌లో ఎయిడ్స్ పిల్లలు!

ఎయిడ్స్ వ్యాధిగ్రస్థులు కన్నపిల్లలకు కూడా ఎయిడ్స్ వ్యాధి వుంటుందని అన్న మాటలు నిజాలని నిరూపించుకున్న తల్లిదండ్రులు తమ పిల్లలను ఆసుపత్రుల్లోనే వదలి, పరారైపోతున్నారట. ఇలా ఇటలీలోను, న్యూయార్క్‌లోనూ యీ సంఖ్య వందలకు చేరిందట. ఒక్క న్యూయార్క్‌లోనే 135 మంది-యీ రకం ఎయిడ్స్ పిల్లలున్నారట. 1991 నాటికి యీ సంఖ్య మూడు వేలుగా పెరగవచ్చునని నిపుణులంటున్నారట.

## శిల్పానికి తల తాకిస్తే అమోఘమైన తెలివితేటలు!

స్పెయిన్‌లో శాండియాగో డి కంపోస్టెలా అనే వో చర్చ్‌లో మేటో అనే వో శిల్పి వో అద్భుతమైన స్త్రీ శిల్పాన్ని చెక్కాడటఅలనాడు. ఆ శిల్పానికి తమ పిల్లల తలలు తాకిస్తే ఆ పిల్లలకు అమోఘమైన




తెలివితేటలు వస్తాయని ఆ దేశపు నమ్మకమట. ఎంతెంత దూరాల నుంచో వచ్చిన తలిదండ్రులు తమ పిల్లల తలలు ఆ శిల్పానికి అంటించి ఆనందిస్తూంటారట.



## మనవలా! పిల్లలా!!

దక్షిణ ఆఫ్రికాలో ఆంథోని అనే వో ఆవిడ కూతురు ఫెరినియాకు ఒకే కాన్పులో గర్భ సంచి తీసేశారట. ఆవిడ ఇంకా సంతానం కనాలని వుత్సాహ పడి, డాక్టర్లతో సంప్రదించిందట. దాంతో వారు ఆమె భర్త ఆల్సినో వీర్యకణాలను తీసి, దానిని ఫెరియా అండంలోని కణాలు తీసి వాటితో కలిపి వో టెస్ట్ ట్యూబ్‌లో పెంచి, ఆనక ఆ భార్యాభర్తల యిష్టం మేరకు దానిని ఫెరినియా తల్లి ఆంథోని గర్భంలోకి ప్రవేశ పెట్టారట. వారి శ్రమ ఫలించి ఆమె గర్భవతి అయిందట. ఆమెకు నిశ్చయంగా కవల పిల్లలు పుడతారని డాక్టర్లన్నారట – అంతా బాగుంది కానీ ఆ పుట్టే పిల్లలు ఆంథోనికి ఏమవుతారు? – అల్లుడామెకు ఏమవుతాడు మరి! నో క్వశ్చన్స్.

## వారసత్వంగా దీర్ఘాయుష్షు!

ఇంగ్లండులో జీన్ అనే ఆవిడ 133 ఏళ్ళు బ్రతికి, తనువు 1780 లో చాలించిందట. ఈవిడకు పుట్టిన ముగ్గురు కూతుళ్ళు 109, 140, 111 ఏళ్ళు బ్రతికారట.

## అల్పాహారంగా అరవై గుడ్లు!

టర్కీని పరిపాలించిన అబ్దుల్ అజీజ్ పొద్దున్న లేచి, కాలకృత్యాలు తీర్చుకుంటూనే వుడక పెట్టిన 60 కోడి గుడ్లను అల్పాహారంగా సేవించేవాడట. ఈ విధంగా ఆయన విధం తప్పక 15 ఏళ్ళు అలా పలహారం చేస్తూ గడిపాడట.

## పదకొండేళ్ల బాలికను మానభంగం

మధ్యప్రదేశ్‌కు చెందిన రాయపూర్‌లో శివదా అనే పదకొండేళ్ళమ్మాయి స్కూలుకు వెళ్ళి తిరిగి రానేలేదట. వూరంతా ఆ పిల్ల తలిదండ్రులు వెతికి, పోలీసు రిపోర్టిచ్చారట. మూడో రోజున ఆమె శవం వూరు చివరి బావిలో దొరికిందట. పోస్ట్‌మార్టమ్‌లో ఆమెను ఎవరో సామూహికంగా మానభంగం చేసి ఆనక చంపేసినట్టు తేలిందట.

## అగ్నిని చల్లార్చటానికి బీరు సమర్పణ!

బ్రిటన్‌లో కుల్వర్టన్ అనే నగరంలోని వో హోటలుకు నిప్పంటుకున్నదట. సమయానికి నీళ్ళు అందుబాటులో లేనందు వల్ల ఆ హోటలు సిబ్బందీ గమ్మున చేతికందిన బీరు సీసాలు పగల గొట్టి నిప్పు




నార్ప ప్రయత్నించారట. ఈ చర్యలో వారు 20 గ్యాలనుల బీరు నుపయోగించారట. ఆ లోపుగా అగ్నిమాపక దళం వచ్చి ముక్తాయిం పిచ్చి ముగించారట. □

## ప్రేమసాగర మథనం

ఫోన్ టక్కున పెట్టేసాడు కింగ్‌కాంగ్. తనకు కావలసిన వివరాలు వచ్చాక ఫోన్‌లో అవతల అతను అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పవలసిన అవసరం లేదనిపించిందతనికి.

అది అతని పాలసీ!

★ ★ ★ ★ ★

"విలూ!"

"ఉ!"

"నేను ఇన్ని వేల మైళ్ళు ప్రయాణం చేసి విజయవాడ వచ్చినదెందుకో తెలుసా?"

"ఎందుకు?"

"మా నాన్న స్నేహితుడు ఒకాయన యీ మధ్య చనిపోయాడు!"

"అలాగా!"

"ఆయన పేరు నారాయణరావు!"

"ఆ!?"

"అవును! ఆయన మీ మేనమామ నారాయణరావే!"

విలాసిని ముఖం వివర్ణమవటం గమనించాడు దీప్.

"తన అక్క శాంత మరణానికి కారకుడైన అతను ప్రాణ భీతితో వుత్తర దేశం పారిపోయాడు కాని రెండు దశాబ్దాలైనా సిరివాడను, అక్కడ పెరుగుతున్న అక్క కూతుర్నీ మర్చిపోలేకపోయాడు!

ఆయన మా యింటి దగ్గరే మరణించాడు. ఆయన మా నాన్న ప్రాణ స్నేహితుడు కావడంతో చనిపోబోయే ముందు నన్ను ఒక కోర్కె కోరాడు!

వీలున్నంత త్వరలో విజయవాడ వెళ్ళి తన మేనగోడలును కలుసుకుని ఆమె మంచి చెడులు విచారించి కావలసిన సాయం చేయమని కోరాడు!

నేను అలాగేనని మాట యిచ్చిన తర్వాత నిశ్చింతగా ప్రాణం వొదిలాడాయన!

"ఆయన కిచ్చిన మాట ప్రకారం నేను విజయవాడ వచ్చాను!"

"విలూ! ఏమయింది"

స్పృహ తప్పి పడిపోయిన విలాసినిని కుదుపుతూ అడిగాడు దీప్

(ఇంకా ఉంది)



మాకు అలా ఒక ఇల్లు నాగార్జున సిమెంటుతో
కట్టిచ్చేయ్ కృష్ణయ్యా! వానొచ్చినప్పుడల్లా
నీకీ యిబ్బంది తప్పుతుంది!!
MAM 61




శ్రీగణేశాయ నమః
శ్రీదత్త సచ్చిదానంద ఫిలింస్
కులాల కురుక్షేత్రం
స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: శరత్
నిర్మాత: వల్లభనేని లక్ష్మీదాసు
SENA ADS



# గోస్వామి తులసీదాసు

విశ్వసాహిత్యంలో రామాయణానికి వచ్చిన ప్రచారం మరి యే యితర కావ్యానికి రాలేదు వేదసంజ్ఞను తన తపోధారతో రామచరితం గా మల్చాడు వాల్మీకిమహర్షి శ్రీరాముడు ఐతిహాసిక పురుషుడయి కూడా ఆత్మదర్మ ప్రధానమయిన అనుష్ఠానావతారం గా పేర్కొనబడ్డాడు ఒక్క మాటలో చెప్పాలంటే సీతారాముల తాత్త్వక ప్రతిపత్తిని తత్కాలీనకవి అయిన వాల్మీకి మారీచుని చేత

అప్రమేయం హి తత్తేజో
యస్యసా జనకాత్మజా'
అనిపిస్తాడు

యుగాల అనంతరం వాల్మీకి ప్రతి అవతారంగ భావించబడే గోస్వామి తులసీదాసు అనంత పరమాత్మను దశరథరామునిగా భావించి శ్రీమద్రామ చరితమానస్ రచించాడు కావ్యారంభంలో శ్రీరాముని పరబ్రహ్మ తత్త్వాన్ని

ఏక్ అనీహ అరూప అనామా
అజ సచ్చిదానంద పరధామా'
వ్యాపక విశ్వరూప భగవానా
తేహి దరి దేహ చరిత కృత నానా''

అంటూ సీతా మహాసాధ్విని

ఉద్భవస్థితి సంహార కారిణీమ్
క్లేశ హారిణీమ్'

అని కీర్తించాడు ఒక విధంగా చెప్పాలంటే వాల్మీకి రామాయణంలోని భక్తితత్త్వం నానా పురాణ నిగమాగమ సమ్మతమైన రామచరిత మానస్‌గా అవతరించింది కనుకనే మానస్ ఇప్పటి వరకు కొన్ని వేలసార్లు పునర్ముద్రితమై కొన్ని కోట్ల ప్రతులు అమ్ముడుపోయాయి దాదాపు ప్రపంచం లోని అన్ని ముఖ్యమైన భాషలలోనికి ఈ కావ్యం అనువదింపబడింది

## జన్మ – విద్యాభ్యాసం

చాలామంది మహనీయుల జీవితం మాదిరిగానే తులసీదాసు జీవనవిశేషాలు సరిగ అవగాహనకు రాలేదనే చెప్పాలి కారణం తానుగా తనను గురించి కావాలని వివరణ యిచ్చుకోలేదు కాని ఆయన రచనల ఆధారంగా తులసీ ప్రయాగ వద్ద బాందా జిల్లాలోని రాజాపుర్ గ్రామంలో క్రీ శ 1532 భాద్రపద శుద్ధ ఏకాదశి మంగళవారంనాడు జన్మించాడని విద్వాంసులుభావిస్తున్నారు తండ్రి ప్రసిద్ధ సరయూ పారీణ బ్రాహ్మణుడయిన ఆత్మారామ్ దూబే తల్లి హులసీగా చెప్పబడు తున్నారు

జనశ్రుతిలో ఒక కథ కూడా ప్రచారంలో ఉంది పన్నెండు నెలల గర్భం నిండాక జన్మించిన బాలుడు ఏడవలేదు సరికదా ఐదు సంవత్సరాల ప్రాయం వాడు లాగ ఉన్నాడు నోట్లో ముప్పయి రెండు పళ్ళుకూడ మొలిచి ఉన్నాయి రామనామం అతని నోట వెలువడింది రామనామం ఉచ్చరించాడు కనుక అతని పేరు రామబోలా అయింది కాల గమనంలో తులసీదాసుగ ప్రఖ్యాతుడయ్యాడు

అభుక్తమూలంలో జన్మించిన ఆ బాలుని రాక్షసాంశగ భావించిన తండ్రి త్యజించాడు తల్లి ఆ బాలుని చునియా అనే దాసీ సంరక్షణలో ఉంచి కన్నుమూసింది కాని ఐదు సంవత్సరాలు కూడా గడవకుండనే చునియా గతించింది అయినా తండ్రి ఆ బాలుని దరికిచేరనీయలేదు భిక్షాటన చేసుకుంటూ జీవితం గడుపుతుండగా బాబా నరహరిదాస్ అతనికి ఉపనయనం చేసి విద్యా బుద్ధులు చెప్పి వైష్ణవ పంచ సంస్కారాలు గావించి రామనామం ఉపదేశించాడు గురుశిష్యు లిరువురు సరయు ఘాఘరనదుల సంగమ క్షేత్రమయిన సోరో (శూకరక్షేత్రం) చేరారు అక్కడ నరహరిదాస్ తులసీకి రామచరితం ఉపదేశించాడు తర్వాత తులసీదాస్ కాశీ చేరి అక్కడ మహాత్మా శేషసనాతనజీ వద్ద వేద వేదాంగ ఉపనిషద్ పురాణాలు అధ్యయనం చేశాడు

## వివాహం-వైరాగ్యం

పదిహేను సంవత్సరముల అనంతరం తులసీ తన జన్మస్థలి రాజాపుర్ వచ్చాడు అక్కడ తన వాళ్ళంటూ ఎవ్వరూ లేరు ఇల్లుకూడ కూలి పోయింది యమునకు ఆవలి తీరంలో భారద్వాజ గోత్రీయుడయిన దీనబంధు తన కుమార్తె రత్నా వళినిచ్చి తులసీ వివాహం జరిపించాడు వారి దాంపత్యం చాల అన్యోన్యంగా ఉండేది

ఒకసారి రత్నావళి పుట్టింటికి వెళ్ళింది తులసీని భార్యా వ్యామోహం వేధించి వరదను కూడా లెక్క చేయకుండ నదిని దాటి ఆమెవద్దకు వెళ్లాడు అనూహ్యమైన భర్త కామోద్రేకానికి చలించిన రత్నావళి జుగుప్సా భావంతో అస్థి చర్మ మయమయి అశాశ్వతమైన నా దేహంపై మమకారంతో ఈ ప్రళయ వాతావరణంలో రావటానికి సిగ్గు లేదా? నాపైగల నీ ప్రీతిని రాముని వైపుకు మళ్ళిస్తే నీకు శుభం కలుగుతుంది' అంది

యాదృచ్ఛికంగ అర్ధాంగి అనిన మాటలు తులసీలో నిద్రాణమై ఉన్న జ్ఞాన జ్యోతిని వెలిగించిన కారణంగ శారీరక ధర్మాలపై విరక్తిచెంది వెంటనే కాశీమార్గం పట్టాడు మాట వరసకు అన్నానని భార్య ఎంత మొరపెట్టుకున్నా వినలేదు తులసీ దాసు ప్రయాగలో సన్యాసాశ్రమం స్వీకరించి మధుర బృందావనం చిత్రకూటం కురుక్షేత్రం పూరి రామేశ్వరం ద్వారక బదరికాశ్రమం కైలాసం మానససరోవరం మొదలైన పుణ్యక్షేత్రాలు సందర్శించాడు మానససరోవరం ప్రాంతంలో కాకభుశుండి దర్శనమయింది

తీర్థయాత్రా సేవనం తదుపరి తులసీదాసు కొంత కాలం చిత్రకూటంలో వసించాడు అక్కడ హనుమంతుడు ప్రత్యక్షమై రామలక్ష్మణుల దర్శనం కలిగించాడు తులసీ స్వయంగా వారికి చందనం సమర్పించుకున్నట్లు చెప్పుకున్నాడు

చిత్రకూట్ కే ఘాట్‌పర్
భఇ సంతన్ కీ భీర్'
తులసీదాస్ చందన్ ఘిసే
తిలక్ దేత రఘువీర్''

కొంతకాలం ప్రయాగ మరికొంతకాలం కాశీలోని ప్రహ్లాదఘాట్‌లో తులసీదాసు రామధ్యానంలో గడిపాడు ఒకనాటి రాత్రి కలలో శంకరుడు ప్రత్యక్షమై అయోధ్య వెళ్ళి రామచరితం రచించవలసిందిగా ఆదేశించాడు

వెంటనే తులసీ అయోధ్య చేరి పావన సరయూ తీరంలో ధ్యానమగ్నుడయి క్రీ శ 1574లో శ్రీరామనవమినాడు రామచరితమానస్ రచనకుపక్ర మించాడు ఆనాడు త్రేతాయుగంలో సరిగ్గా రాముడు అవతరించిన యోగం కుదిరింది రెండు సంవత్సరముల ఏడునెలల ఇరవైఆరు రోజులలో

అయోధ్యలో శ్రీరామ చరిత మానస్ రచించిన ప్రదేశంలో వెలసిన తులసీవనము



కావ్య రచన పూర్తయింది

పిదప తులసీదాసుకాశీ చేరి అసీఘాట్ వద్ద రామనామ ధ్యానంలో కాలం గడపసాగాడు శంకరుడు అక్కడ ఆయన రామ కావ్యంపై 'సత్యం, శివం, సుందరం' అని వ్రాసినట్లు ప్రతీతి రామ చరితమానస్ కావ్యం కనుక, తన భక్తి ప్రవృత్తి, ఆత్మ నివేదనం, కైంకర్య భావన, తాను భావించినట్లు వ్రాయలేకపోయానని తలంచిన తులసీదాసు. అత్యంత భక్తిప్రమత్తులకు ఆలవాలమయిన 'వినయ పత్రిక' అనే పదసంపుటిని రచించాడు

కాశీలో రామచరితమానస్‌పై అనేక విధాల దాడులు జరిగాయి కాని తులసీ తన పూజా మందిరంలో ధ్యానమగ్నుడయి ఉండగా ధనుర్ధారులయిన రాజకుమారులు పహరా కాస్తుండేవారు వీరు రామలక్ష్మణులనే విశ్వాసం లోకంలో ఉంది. అందువలన ఎవ్వరూ ఆ ఛాయలకు వెళ్ళి దాడిచేయలేక పోయారు కాలక్రమంలో తులసీదాసు ఒక మఠాధిపతి అయి, గోసాయిగ (గోస్వామి) ఖ్యాతిగాంచినట్లు చెప్పబడుతుంది.

1612లో తులసీ వాతదోషం వలన బాహు పీడకు లోనయి. క్రమంగా శరీరం శిథిలం కాసాగింది ఒక వైపు దారిద్ర్యం, మరో వైపు వ్యాధి ప్రకోపం చివరకు శరీరమంతా బొబ్బలు వచ్చి 1623లో శ్రావణ కృష్ణ తదియనాడు పరమపదించాడు

## కావ్య ప్రతిభ - భక్తి.

తులసీదాసు మొత్తం 32 కావ్యాలు రచించినట్లు చెప్పబడుతుంది వానిలో ముఖ్యమైనవి పన్నెండు కాగా, సుప్రసిద్ధములయిన కావ్యాలు శ్రీమద్రామచరిత మానస్, వినయపత్రిక, కవితావలి, గీతావలి, దోహావలి మొదలగునవి విశేషమేమంటే బహుకొద్ది కావ్యాలు మినహాయించి, మిగిలిన అన్నింటిలోని కావ్యవస్తువు రామగాథయే! శ్రీరాముని కేంద్ర బిందువుగ తీసుకుని, తత్కాలీన కావ్య శైలులన్నింటిలో రచన కావించిన మేటి ఆయన

భక్తికి, జ్ఞానానికి, శివ వైష్ణవానికి అభేదం నిరూపించిన పరమతాత్త్వికుడు శ్రీ తులసీదాసు ఆయన శ్రీరామునిచేత-

భగతిహి గ్యానహి నహి కఛు భేదా!
ఉభయ హరయి భవ సంభవ ఖేదా

* * * * * *

శివద్రోహి మమ భగత కహావా
సో నర్ సపనేహు మోహి నపావా!
సంకర విముఖ భగతి చహు మోరీ,
సో నర్ కీ మూఢమతి థోరీ

అని పలికిస్తాడు

తులసీదాసు తనకావ్యాల్లో పితాసుత, రాజాప్రజా, గురుశిష్య, పతిపత్ని, ప్రభు భృత్య, సేవ్య సేవక, భ్రాతృ బంధు, మాతాపుత్ర మొదలయిన సంబంధాల అనేక లోకధర్మాలు వివరించాడు భక్తి తన్మయత్వంలో ఆయన విశ్వమంతా బ్రహ్మాది దేవతలతో సహా శ్రీరాముని ఆధీనంలో ఉంటుందని భావించాడు-

యన్మాయా వశవర్తి

విశ్వమఖిలం బ్రహ్మాది దేవాసురా!

శ్రీరాముడు కారుణ్యమూర్తి, శరణాగత వత్సలుడు జటాయు, వానరులు, వాల్మీకి, అహల్య, యమలార్జునుడు మొదలయినవారు రామకృపా సముద్రంచే తరించారు కనుక 'రామచరణాల'ను వదలనంటాడు తులసీదాసు

జాఉ కహా తజి చరణ తుమ్హారే
కాకో నామ్ పతిత – పావన్ జగ్,
కేహి అతి దీన్ పియారే!

ఈ జగత్తు అంతా సీతారామమయం కనుక, జగత్తుకు నమస్కరిస్తాడా భక్త కవి-

సీయ రామమయ సబ్ జగ్ జానీ,
కరఉ ప్రనామ్ జోరి జుగ్ పానీ!

సీతారాములంటే ఇష్టపడనివారని, మనకెంతటి ఆప్తులయినప్పటికి త్యజించాలి- ప్రహ్లాదుడు తండ్రిని, విభీషణుడు, సోదరుని, భరతుడు తల్లిని, బలిచక్రవర్తి గురువును గోపికలు భర్తలను



కాశీలో తులసీదాసు ప్రతిష్ఠించిన సంకటమోచన హనుమాన్ మందిరం

త్యజించి ముక్తిప్రదులయ్యారు–

జాకే ప్రియ నరామ వైదేహి!
సో ఛాండియే కోటి వైరీసమ,
జద్యపి పరమ సనేహి!

శ్రీరాముడు ప్రేమపాశానికి బద్ధుడు కావున సర్వలోభాలు వదలి రామనామ శరణాగతి చేయాలి రాముని అనంత వ్యాపకత్వము, జీవుని అల్పత్వం సవినయంగ సూచిస్తాడు తులసి–

హౌ ప్రసిద్ధ పాతకీ, తూ పాపపుంజ హారీ
బ్రహ్మ తూ, హౌ జీవ, తూ ఠాకూర్, హౌ చేరో!

రామనామ మహిమలో తులసీదాసు బహుచక్కని వివరణ ఇస్తాడు 'రా' అనగానే కొండంత పాపం బహిర్గతమై 'మ' అనగానే కవాటం మూతబడుతుంది

తులసీ 'రా' కహ్త తెహి
బాహర్ జాత్ పాప్ పహార్!
ఫేరి భీతర్ ఆవత నహీ,
దేత మకార్ కవార్!!

రామనామము మణిదీపం లాంటిది 'దానిని 'ముఖ' మనెడి ద్వారంలో 'నాలుక' అనే కడప మీద ఉంచితే జీవునికి అంతర్బాహ్య లోకాల్లో 'వెలుగు' లభిస్తుంది–

రామనామ మనిదీప ధరు
జీహ దేహరీ ద్వార!
తులసీ భీతర బాహిరౌ
జో చాహసి ఉజిఆర్

భక్త తులసీ జీవులందర్నీ చాతకపక్షి నీల మేఘాన్నాశ్రయించినట్లు రామనామాన్ని శరణు వేడి, స్మరించి తరించమంటాడు–

రామ రామ రటు రామ రామ రటు,
రామ రామ జపు జీహా!
రామనామ నవ నేహ – మేహ కో
మన్ హఠి హోయి పపీహా!!

కవి శబ్దానికి యోగి, జ్ఞాని, మహర్షి, బ్రహ్మ అని అర్థాలున్నాయి బ్రహ్మ సృష్టించిన జగత్తుకు ప్రతిసృష్టి ని చేసి రసవంతంగ లోకానికి అందిస్తాడు, కవి అందులో 'రామకావ్యం' రచించిన కవి అన్ని విధాల మహనీయుడు, రససిద్ధుడు ఈభూమి మీద కొండలు, సెలయేళ్ళు ఉన్నంతవరకు (జీవకోటి ఉన్నంతవరకు) రామకథ లోకంలో బహుళ ఆదరం పొందుతుంటుంది–

యవత్ స్థాస్యంతి
గిరయః సరి తశ్చ మహీ తలే!
తావద్ రామాయణ కథా
లోకేషు ప్రచరిష్యతి!!

ఇట్టి మహత్తర రామకావ్యాన్ని లోకానికందించిన గోస్వామి తులసీదాసు లోకంలో శాశ్వతంగ ఉంటాడు. జరామరణాలకు ఆయన అతీతుడు–

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి ఏషాం యశః కాయే
జరా మరణజం భయం!!

వ్యాసం, ఫోటోలు
కెప్టెన్ షేక్ మౌలాలీ

# బొమ్మల చొక్కా • కె. [illegible]

సూరీడు భూదేవి మీద కినుక వహించి నిప్పులు రాలుస్తున్నాడు పుడమి తల్లి హృదయం మలమల మరిగిపోతోంది రెట్టింపు కోపంతో.

మధ్యాహ్నం పన్నెండు గంటల వేళ

పట్నణ పుర వీధులలో వాహనాలు కదిలి పోతున్నాయి.

పెద్ద చెరువు గట్టు మీద డొ'ఘల మందిగానికి ఎదురుగా వున్న కాళీ జాగాలో కొత చాపల గుడిసె ముందు కూచుని తెల్లని రాతితో బొమ్మ చెక్కుతున్నాడు నర్సిమ్మ.

వాడి నల్లని ఒంటి మీంచి చెమట ధారాపాతంగా కారుతోంది అయినా వాడు దాన్ని లెక్కించలేదు. "ఈయాల ఎట్టాగైనా ఈ బొమ్మ పూర్తయిపోవాల!" అనుకున్నాడు నిబ్బరంగా.

నర్సిమ్మకి నలభై ఏళ్ళుంటాయి.

వాడు శ్రమ జీవి. రాతి బొమ్మలు చెక్కి అమ్ముతూ వుంటాడు. "ఈ కాలంలో రాతి బొమ్మలు కొని ఆనందించే వాళ్ళేరీ?" బొమ్మ చెల్లిననాడు కూడు. చెల్లని నాడు పస్తు. ఇది నర్సిమ్మకి అలవాటయి పోయింది. ఇది జీవితం నేర్పిన పాఠం.

తెల్ల రాతితో గొల్ల భామ బొమ్మ చెక్కుతున్నాడు. "అయ్యా!" పిలుపు వినిపించేసరికి వెను దిరిగి చూశాడు నర్సిమ్మ.

అక్కడ ఆరేళ్ళ బొజ్జెన్న నిలబడి వున్నాడు.

"ఏట్రా? నిన్ను గూట్లో కూకోని కుసింత గంజి తాగమంటే, ఈడకెందుకొచ్చినావు? సూడు ఎండ ఎట్టా పేట్రేగి పోతుండాదో?"

"నాకు గెంజొద్దు!" గునిశాడు బొజ్జెన్న.

"ఏట్రా గుంట నంజి కొడక పేల్తన్నావు? గెంజొద్దా? మరేటి కావాల? నువ్వేం మారాజు కొడుకు వేట్రా పులుసన్నం బుక్కడానికి? ఎల్లెల్లు ఎండల్లెగు! కుసింత గెంజి తాగి తొంగో! సల్ల పొట్న బజార్ల బొమ్మలమ్ముదాం!" అంటూ తన పనిలో తాను నిమగ్నుడయ్యాడు నర్సిమ్మ.

బొజ్జెన్న నర్సిమ్మ ఒక్కగానొక్క కొడుకు. అసలు నర్సిమ్మకి పిల్లల పుట్టరనే అనుకున్నాడు. "వొయిసు మించిపోతుండాది. నీ బిడ్డల్లేని జనమ జనమే కాదు!" అని అనేక సార్లు విసుక్కున్నాడు కూడా.

అందరూ బొజ్జెన్న కొండకెళ్ళమని సలహా ఇచ్చారు. అనకాపల్లికి ఇరవై మైళ్ళ దూరంలో వున్న బొజ్జన్న కొండకి వెళ్ళాడు భార్య సారమ్మతో సహా.

బొజ్జెన్న దయతలిచాడు. సారమ్మ కడుపు పండింది మగ బిడ్డ పుట్టాడు. కాని సారమ్మ తనువు చాలించింది. బిడ్డ పేరు బొజ్జెన్న.

నర్సిమ్మ మరి మనువాడలేదు. బొజ్జెన్నను కంటికి రెప్పలా చూసుకోసాగేడు.

"అయ్యా!" మళ్ళీ పిలిచాడు బొజ్జెన్న.

ఒక్కసారి వెనక్కి తిరిగి "ఏట్రా ఇంకా ఈడే నిలబడ్డావురా? ఎన్నెల కాత్తందనుకున్నావురా ఎదవ నాయాలా?" కొంచెం కోపంగా అన్నాడు.

"అయ్యా నాకు బొమ్మల సొక్కా కొనవూ!" ఆశగా అండ్రి వైపు చూస్తూ అడిగాడు బొజ్జెన్న.

చేతిలో పని ఆపి, "ఏట్రా బొజ్జెన్నా నీకు సొక్కా కావల్సొచ్చిందా? అందునా బొమ్మల్సొక్కా! కూటికే గతిలేక సత్తా వుంటే సొక్కాలు కావాలంట సొక్కాలు ఎల్లు! ఎల్లి గెంజి తాగు!" మళ్ళీ బొమ్మ చెక్కడంలో నిమగ్నుడయ్యాడు నర్సిమ్మ

బొజ్జెన్న క్షణ కాలం అక్కడ నిలబడి, తరువాత లోపలికి నడిచాడు. చాపల గూడు వేడిగా వుంది. గంజి తాగాలనిపించలేదు బొజ్జెన్నకి. దాన్ని తండ్రి చూడకుండా పారబోసాడు.

వాడిలో ఆకలి నక నకల కంటే ఆశల ఆరాటం అధికమవుతోంది. క్రితం రోజు దృశ్యం వాడికి గుర్తొచ్చింది.

పార్కు గేటుకి ఎదురుగా బొమ్మలమ్ముతున్నాడు నర్సిమ్మ. ఆ పక్కనే నిలుచున్నాడు బొజ్జెన్న నోట్లో వేలు పెట్టుకుని. వాడికి చిన్నప్పటి నించీ నోట్లో వేలు పెట్టుకోవడం అలవాటు.

సాయంత్రం అయిదు గంటలయ్యింది

పార్కు నిండా రక రకాల మనుషులు చేరుతున్నారు. బొజ్జెన్న ఆసక్తిగా అటే చూస్తున్నాడు. వాడి చూపు తక్కున ఒక చోట ఆగిపోయింది.

తల్లి కొంగు పట్టుకుని ఒ అబ్బాయి పార్కులోకి వచ్చాడు. వాడు కూడా తనంతే వున్నాడు. ఆ అబ్బాయి వేసుకున్న చొక్కా తమాషాగా వుంది. చొక్కా నిండా రంగు రంగుల బొమ్మలున్నాయి. చూసినకొద్దీ చూడాలనిపిస్తోంది ఆ చొక్కా.

బాబునిదే చోట కూచో పెట్టి వాళ్ళమ్మ ఎవరితోటో మాట్లాడుతోంది.

బొజ్జెన్న మెల్లిగా అటు నడిచాడు.

బాబు బొజ్జెన్నని రమ్మన్నట్టు సైగ చేశాడు. బొజ్జెన్న ఆ అబ్బాయిని సమీపించాడు.

కొంతసేపు ఇద్దరూ మాట్లాడుకోలేదు.

క్షణ కాలం తరువాత బొజ్జన్నే అన్నాడు. "సొక్కా శానా బావుంది" అని.

బాబు గర్వంగా కాలరు సర్దుకున్నాడు. "మా మమ్మీ హైదరాబాద్ నించి తెచ్చింది! దీని ఖరీదు వంద రూపాయలు!" అని అన్నాడు.

"మమ్మీ అంటే వోరూ?" చిత్రంగా చూస్తూ ప్రశ్నించాడు బొజ్జెన్న.

"అమ్మ!" అని "నీకు తెలియదా?" అన్నట్టు చూశాడు.

"అమ్మ నాకు నేదు!" దీనంగా అన్నాడు బొజ్జెన్న

"నీ పేరేంటి?" అన్నాడు బాబు బొజ్జెన్న దగ్గరగా వచ్చి.

"బొజ్జెన్న!" చిన్నగా చెప్పాడు.

"ఛీ! అదేం పేరు? నా పేరు రాజబాబు!" అన్నాడు ఇంకోసారి గర్వంగా

బొజ్జెన్న దృష్టి అంతా బాబు తొడుక్కున్న బొమ్మల చొక్కా మీదే వుంది. "ముట్టుకోవచ్చా?" అన్నాడు బాబుని సమీపిస్తూ.

"ఇదిగో చూడు!" చొక్కా కొస అందించాడు బాబు.

మెత్తగా దూదిలా వున్న ఆ చొక్కాని ముట్టుకుని మురిసిపోయాడు బొజ్జెన్న. "ఇట్టాంటి సొక్కా తనకీ వుంటే బావుణ్ను!" అనుకున్నాడు మనసులో

"అయ్యనడిగి కొనిపించుకోవాల!" అనుకున్నాడు దృఢంగా.

"నీకెన్ని సొక్కాలున్నాయ్?" అడిగాడు బొజ్జెన్న.

"బోల్డున్నాయ్!" అన్నాడు బాబు.

"నాకు సూపించవూ!" అభ్యర్థన ధ్వనించింది బొజ్జెన్న గొంతులో.

"మా ఇంటికి రా!"

"మీ ఇల్లెక్కడ?" అన్నాడు బొజ్జెన్న.

"ఆ కనుపించే ఎర్ర మేడే! రేప్పొద్దున రా! చూపిస్తాను!" అన్నాడు బాబు.

మర్నాడు పొద్దున్న ఎనిమిది గంటల వేళప్పుడు ఎర్ర మేడకి ఎదురుగా నిలుచున్నాడు బొజ్జెన్న.

అప్పటికే అక్కడున్న బాబు, బొజ్జెన్నని చూడగానే "రా!" అన్నాడు.

బాబు వెంట లోపలికి నడిచాడు బొజ్జెన్న.

ఓ ఖరీదైన గదిలోకి నడిచాడు బాబు బొజ్జెన్నతో సహా.

"ఇవిగో చొక్కాలు!" కింద కుప్ప పోశాడు.

"ఎన్ని సొక్కాలో!" ఆశ్చర్యంతో బొజ్జెన్న కళ్ళు వెడల్పయినాయి.

"ఇంకా బీరువాల్లో వున్నాయి! నాకు తాళం తియ్యడం రాదు!" అన్నాడు బాబు. గర్వంతో బాబు కళ్ళు వెలిగిపోతున్నాయి.

అన్ని చొక్కాలలోకి మకుటాయమానంగా వెలిగిపోతున్న బొమ్మల చొక్కా మీదే వున్నాయి బొజ్జెన్న చూపులన్నీ. పదిసార్లన్నా ముట్టుకు చూశాడు దాన్ని. చొక్కా నిండా పడవలు, పిట్టలు, చెట్లు, రంగుల రంగులలో వెలిగిపోతున్నాయి. "అయ్యతో సెప్పి ఇట్టాంటి సొక్కా కొనిపించు కోవాల!" మరోసారి అనుకున్నాడు బొజ్జెన్న.

"బాబూ!" అంటూ ఆ గదిలోకొచ్చిన లలితాదేవి బొజ్జెన్నను చూసి కళ్లెర్ర జేసింది. "వీడెవడు?" అంటూ రుసరుసలాడింది.

"వీడు బొజ్జెన్న!" అన్నాడు బాబు.

"అధ్వమయిన వాళ్లనీ చేర్చద్దని నీకెన్నిసార్లు చెప్పాలి? వీళ్లు ఏ వస్తువన్నా దొంగిలిస్తే ఏం చెయ్యగలం?" అని బాబుని మందలించి "ఛో వెధవా!" అంటూ బొజ్జెన్నని తర్జనితో బెదిరించింది లలితాదేవి.

బొజ్జెన్న బిక్క చచ్చిపోయాడు.

"మమ్మీ బొజ్జెన్న బొమ్మల చొక్కా బావుందన్నాడు!" అన్నాడు బాబు మెల్లగా.

"అంటాడు! అంటాడు! అనడూ? దొంగ వెధవ! రేపు ఈ చొక్కా పట్టుకు పారిపోతాడు!"

"వాణ్ణి పొమ్మను!" అంటూ గద్దించిరది.

బొజ్జెన్న వెర్రి చూపులు చూస్తూ వీధిలోకి నడిచాడు.

"ఒరి బొజ్జెన్న లెగు లెగు!" అన్న తండ్రి పిలుపుతో వాస్తవంలోకి వచ్చాడు బొజ్జెన్న.

వాడి కళ్ల ముందు బొమ్మల చొక్కాలు వలయాలుగా తిరుగుతున్నాయి. బాబుఇంట్లో వున్నన్ని సొక్కాలు తనకి నేకపోయినా ఒక్క బొమ్మల సొక్కా వుంటే బాగుణ్ణు!"

ఆలోచిస్తూనే తండ్రి వెంట బజార్లోకి నడిచాడు.

* * *

"రాజా బాబూ స్కూల్‌డే ఫంక్షన్‌కి వెళ్లాలి! ఈ డ్రస్సు వేసుకుని తయారవ్వు!" అంది లలితాదేవి

"ఈ డ్రస్సు నాకొద్దు!" గునిశాడు బాబు.

"ఈ డ్రస్సు నీకోసం డాడీ ఎన్నో షాపులు గాలించి మరీ తెచ్చారు! వేసుకో నాన్నా!" అందామె.

"ఉహు! నాకొద్దు!" గునిశాడు బాబు మరోసారి.

"రేపు మరొకటి కొనుక్కుందాం! ఇప్పటికీ డ్రస్సు వేసుకో!" అంది బాబు గెడ్డం పుచ్చుకొని.

మొండి పట్టు పట్టాడు బాబు.

"మరి ఏ డ్రస్సు వేసుకుంటావు?"

బాబు కళ్లల్లోకి వెలుగొచ్చింది తల్లి ప్రశ్నతో. "అదికావాలి!" అంటూ స్టాండు వైపు చూపించాడు.

హతాశురాలయ్యింది లలితాదేవి.

బాగా మాసిపోయి చిరిగిపోవడానికి సిద్ధంగా వున్న బొమ్మల చొక్కా వేలాడుతోంది స్టాండు మీద. ఎంత చెప్పినా వినకుండా నెల్లాళ్లుగా ఆ చొక్కాయే తొడుక్కుంటున్నాడు బాబు.

"ఛీ!" అంటూ మూలకి గిరవాటేసింది లలితాదేవి దాన్ని.

కోపంగా చూశాడు బాబు.

తనకి ప్రాణప్రదమైన బొమ్మల చొక్కాని నేలకేసి కొట్టింది మమ్మీ. ఆ చొక్కాని చూసి బొజ్జెన్న మురిసిపోతాడు. పొంగిపోతాడు. పదిసార్లన్నా



పట్టుకుని చూసాడు ఈ సొక్కాలో నువ్వెంతో బావుండావు బాబూ' అన్నాడు ఎన్నోసార్లు

నాకీ సొక్కా ఇయ్యవూ'' అని అడిగాడు చాలాసార్లు

'అబ్బా నేనియ్యను!' అన్నాడు తను బొజ్జెన్న దృష్టిలో తను చాలా గొప్పవాడు ఆ చొక్కా ఎంతో గొప్పది అలాంటి చొక్కాని మమ్మీ వద్దంటూంది

చివరికి గునుస్తూనే మమ్మీ ఇచ్చిన డ్రస్సు వేసుకొని స్కూల్ ఫంక్షన్‌కి బయలుదేరాడు రాజాబాబు

* * *

నెల రోజులు గడిచాయి ఈ నెల రోజులూ ఎక్కడెక్కడో బొమ్మలు అమ్ముకు వస్తున్నాడు నర్సిమ్మ కూడా బొజ్జెన్న వుంటున్నాడు రోజుకో సారైనా "అయ్యా నాకు బొమ్మల సొక్కా కొనవూ?' అని అడుగుతున్నాడు

తెచ్చిన నాలుగు డబ్బులూ కూటికే సాల్లం లేదు! గుంట నాయాలా బొమ్మల సొక్కా కావల్సొచ్చి నాదిరా?' అంటూ కూకలేస్తూనే వున్నాడు నర్సిమ్మ

రోజులు దొర్లి పోతున్నాయి పార్కు వైపు వెళ్లడానికే కుదరలేదు బొజ్జెన్నకి పగలల్లా తండ్రితో చుట్టు పక్కల ఊళ్లు తిరగడం రాత్రికి పెద్ద చెరువు గట్టు మీదున్న ఈత చాపల గూడులో తల దాచుకోవడం

'బాబెట్టా వున్నాడో? ఒక్క పాలి సూత్తే బావుణ్ణు!' అనుకున్నాడు బొజ్జెన్న తనలో తానే!

బొజ్జెన్నకి నాలుగు రోజుల్లై జ్వరం కాస్తోంది

ఆ జ్వరంలో నే' అయ్యా బొమ్మల సొక్కా కొనవూ' అంటూ కలవరిస్తున్నాడు

నర్సిమ్మ హృదయం గిల గిలలాడింది

మరో న్నాల్రోజులు గడిచాయి బొజ్జెన్న జ్వరం తగ్గు ముఖం పట్టింది బొజ్జెన్నా ముందీ కూడు తిన్రా నకు మంచిదిత్తాను'' అన్నాడు నర్సిమ్మా ఆ రోజు ఉదయాన్నే

'ఏటి?' అన్నాడు బొజ్జెన్న ఆత్రుతగా

బొమ్మల గంపలోంచి ఓ గుడ్డ తీశాడు

# బొమ్మల చొక్కా

దాని వైపు ఆసక్తిగా చూశాడు బొజ్జెన్న

అది బొమ్మల చొక్కా

'అయ్యా!' అంటూ తండ్రిని వాటేసుకున్నాడు బొజ్జెన్న వాడి కళ్లల్లోంచి ఆనంద బాష్పాలు రాలుతున్నాయి

చొక్కాని పదే పదే ముట్టుకొని చూస్తున్నాడు అచ్చం అది బాబు చొక్కాలాగే వుంది

రేపే సొక్కా తొడుక్కుని బాబుకి చూపించాలి! అనుకున్నాడు బొజ్జెన్న వాడి కళ్లల్లో గర్వ రేఖ తళుక్కున మెరుస్తోంది

* * *

సాయంత్రం ఆరు గంటలవుతోంది న్యూ పూర్ణా నాలుగు రోడ్ల కూడలిలో రోడ్డుకి ఓ వారగా బొమ్మలు పేర్చుకు కూచున్నాడు నర్సిమ్మ

పక్కనే నిలబడి వొచ్చే పోయే వాళ్లని చూస్తున్నాడు బొజ్జెన్న వాడికిప్పుడు ప్రపంచాన్ని జయించినంత సంబరంగా వుంది పదే పదే తను తొడుక్కున బొమ్మల చొక్కా వైపు చూసుకుంటున్నాడు

ఈ చొక్కా ఓపాలి ఆ బాబుకి సూపించాలి! అనుకున్నాడు

మెల్లగా పార్కు వైపు నడిచాడు

అక్కడ ఎందరో పిల్లలు ఆడకుంటున్నారు

వారిద్దరి మధ్యా చుక్కల్లో చంద్రుల్లా వెలిగి పోతున్నాడు బాబు బాబు ఇవాళ కొత్త రకం చొక్కా తొడుక్కున్నాడు

బాబుని రమ్మన్నట్టు చేత్తో సంజ్ఞ చేశాడు బొజ్జెన్న

పరుగు పరుగున వచ్చాడు బాబు

నా బొమ్మల చొక్కా బావుందా?'' అని అడిగాడు బాబుని

బాబు ముఖంలో నీలి నీడలు కదిలాయి ఇన్నాళ్లూ బొజ్జెన్న దృష్టిలో తను గొప్ప వాడు కాని ఇప్పుడు బొజ్జెన్న?

తనకంటే వాడే గొప్పవాడు ఇప్పుడు

చొక్కా ముట్టుకు చూశాడు మెత్తగా స్పాంజిలా తన చొక్కాలాగే వుందిఅది అవే బొమ్మలు, అదే రంగు

ఈ చొక్కా ఎక్కడిది?

మా అయ్య తెచ్చిండు!

మళ్లీ చొక్కా అంతా పరికించి చూశాడు బాబు చూపు రక్కున ఓ చోట ఆగిపోయింది ఈ చొక్కా నాది!' అన్నాడు గట్టిగా

కాదు! మా అయ్య కొన్నాడు!' అన్నాడు బొజ్జెన్న

'ఇదిగో చూడు నాపేరు!' అంటూ చూపించాడు జేబు మీద రాజబాబు అని కుట్టిన అక్షరాలు వున్నాయి

అవేమిటో అర్థం కాకపోయినా అదో పేరు అని మాత్రం గ్రహించాడు చొక్కా వైపు చూసుకుంటూ మౌనంగా వుండిపోయాడు బొజ్జెన్న

బాబులో కోపం బుసలు కొట్టింది తన చొక్కా బొజ్జెన్న దొంగిలించాడు అందుకే ఆ చొక్కా చాలా రోజుల్లై కనుపించడం లేదు తల్లి దాచేసిందను కున్నాడు కాని ఇప్పుడు తెలిసింది బొజ్జెన్న దాన్ని దొంగిలించాడు

ఈ చొక్కా నాది! నువ్వు దొంగిలించావు! నువ్వు దొంగవి!' అంటూ చొక్కా పట్టుకు గుంజాడు

అది పర్రున చిరిగిపోయింది

ఒరయ్యో!' అంటూ ఏడుపు లంకించుకున్నాడు బొజ్జెన్న

అప్పుడే బొమ్మల తట్ట నెత్తికెత్తుకుని అటు వైపుగా వస్తున్న నర్సిమ్మ ఒక్క ఉదుటున బొజ్జెన్న దగ్గరకొచ్చాడు

'ఏట్రా? ఏటైనాది?'' అన్నాడు ఆందోళనగా

అప్పటికే చొక్కా చినిగి పీలికలై బొజ్జెన్న ఒంటి మీద వేలాడుతోంది

బాబు చేతిలో కొన్ని పీలికలున్నాయి

అయ్యా నాను దొంగనా? అన్నాడు బొజ్జెన్న వెక్కుతూ

'కాదు బిడ్డా మనం పేదోళ్లం అన్నాడు నర్సిమ్మ బాబు నుండి బొజ్జెన్నని విడిపిస్తూ

'అయ్యా ఈ సొక్కా ఎడ కొన్నావు?' అన్నాడు బొజ్జెన్న వాడి ప్రశ్నలో పౌరుషం ధ్వనిస్తోంది

ఒరి బొజ్జెన్నా నాన్లొంగతనం సెయ్యనేదురా! పాత బట్టలకి టీలు గిన్నెలమ్మే వోడి దగ్గర ఈ సొక్కా కనిపిత్తే పది రూపాయలిచ్చి కొన్నాన్రా' అన్నాడు నర్సిమ్మ

ఆ మాటలు విని ఇంటి వైపుగా పరుగు తీశాడు బాబు

నిరాశా వీచికలు తారట్లాడుతున్న బొజ్జెన్న ముఖంలోకి చూస్తూ 'ఒరే బొజ్జెన్నా ఈపాలి సావులో కొంటానురా బొమ్మల సొక్కా!' ముందింటికి నడు'' అన్నాడు నర్సిమ్మ

తండ్రి వెనుకె రేపును ఊహించుకుంటూ నడిచాడు బొజ్జెన్న □

## మహిళా పాఠకులకి మరో కొత్త శీర్షిక!

# ఈ కాలం పెళ్ళిళ్ళు









మన సంస్కృతిలో వివాహానికి అత్యంత ప్రాముఖ్యం, ఎంతో పవిత్రత ఉన్నాయి. ప్రతి వ్యక్తి జీవితంలో పెళ్లి అన్నది అతి ముఖ్యమైన మలుపు. స్త్రీ పురుషుల జీవితాలలో అది ఒక మధురమైన దివ్యానుభూతి, నూరేళ్ల పంటగా నిలిచే పవిత్ర బంధం.

మారుతున్న నేటి సమాజంలో పెళ్లిళ్లు ఎలా జరుగుతున్నాయి? వివాహాల విషయంలో ఎలాంటి సమస్యలు ఎదురవుతున్నాయి? మొదలైన విషయాలని చర్చిస్తూ ఈ కింద పేర్కొన్న అంశాలపై లేదా వాటిలో కొన్నిటిని గురించి కానీ వ్యాసాలు రాసి పంపవచ్చును.







1. మారుతున్న సామాజిక పరిస్థితులు
2. విడాకులు పునర్ వివాహాలు
3. భార్యల సంపాదనలు ఉద్యోగాలు
4. కట్నం
5. సమిష్టి కుటుంబం
6. వివాహంలో వ్యభిచారం సెక్స్
7. కులాంతర వివాహాలు
8. వివిధ కులాలలో వివాహ వ్యవస్థ
9. మతాంతర వివాహాలు
10. ఇంకా రాబోయే మార్పులు
11. సినిమాల పత్రికల ప్రభావం
12. భర్తలని హింసించే భార్యలు

### నిబంధనలు :

- ★ రచనలు ఆలోచనలని రేకెత్తించేట్లుగా ఉండాలి.
- ★ ఆడవారి రచనలకే ఎక్కువ ప్రధాన్యత ఉంటుంది.
- ★ రచనతో పాటు రాసినవారి ఫొటో పంపవచ్చు.
- ★ రచనలు కాగితానికి ఒక వైపే సిరా లేదా బాల్‌పెన్‌తో రాయాలి.
- ★ వ్యాసాలు రెండు అర తావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది.
- ★ వ్రాత ప్రతి మీద వ్యాసం రాసిన వారి పేరు, పూర్తి చిరునామా ఉండాలి.
- ★ ప్రతి రచనతో ఈ పేజీలో ఇచ్చిన కూపన్ జతపరచి పంపాలి. కూపన్ జత పరచకుండా పంపిన వ్యాసాలు పరిశీలింపబడవు.
- ★ ప్రచురించిన ప్రతి రచనకీ రు. 50/- పారితోషికం ఇస్తాము.
- ★ ప్రచురణకి స్వీకరించని వ్యాసాలని, ఫొటోలని తిప్పి పంపగోరేవారు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరచి పంపాలి. వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.
- ★ ప్రచురణకి స్వీకరించిన రచనల విషయం ఆయా రచయిత్రులకి తెలియ చేయటం జరుగుతుంది.
- ★ పరిశీలనకి పంపే వ్యాసాలని "ఈ కాలం పెళ్లిళ్ళు" శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అనే చిరునామాకి పంపాలి.

–సంపాదకుడు

---

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## ఈ కాలం పెళ్ళిళ్ళు

పంపిన వారి పేరు ............................................

పూర్తి చిరునామా ............................................

............................................

............................................

పిన్ కోడ్ ....................

# వారఫలం

**24-7-1987 శుక్రవారం మొదలు 30-7-1987 గురువారం వరకు**

★ **మేషం :** ఇదొక విశిష్టమైన వారం. ఆదాయమున్నది. అనుకూల వార్తాశ్రవణం. విద్యా విషయంలో పెంపు. కృషి యందు అధిక పెంపు, పత్రిక, భారీ వ్యాపారమైన లాభదాయకం. అధికోత్సాహకరమైన వారం. స్త్రీలకు : ఉద్యోగ లాభం. ఉత్సాహమైన వృత్తి, ఆదాయం.

★ **వృషభం :** అనుకొనేదొకటి, అయ్యేదొకటి, ఏదో చేద్దాం అని, ఏదో చేయటం, డబ్బు యివ్వవలసిన వారి వత్తిడి అధికం కావటం, ఆరోగ్య మందు లోపం కలగటం, గ్రహ చర్య అనుకూలంగాదని గ్రహించగలుగుతారు. స్త్రీలకు : రాజకీయాలందు మేలు, అనుకూల మిత్ర సందర్శనం.

★ **మిథునం :** సర్వ రంగాలలో సదవకాశాలుంటాయి. వృత్తి యందు చెప్పదగిన పెంపు చేకూరుతుంది. వ్యాపారం చేయాలని ఉబలాట పడే వారికి అనుకూలం. వివిధ రంగాలందు సదవకాశాలు మీకు చేకూరనున్నవన్న ఆశ్చర్యం లేదు. స్త్రీలకు : అనుకూల వార్తా శ్రవణం, వృత్తి యందు పెంపు.

★ **కర్కాటకం :** నూతన వ్యక్తుల పరిచయం లాభదాయకం. కృషి యందు రాణింపు చెప్పదగిన అంశం. విద్యా విషయంగా పెంపు చేకూరుటకు ఆస్కారమున్నది. 'సినీ' అవకాశాలు కొందరు స్త్రీలకు చెప్పదగిన అంశం. రాజకీయాలందు సదవకాశాలున్నాయి. స్త్రీలకు: ఉద్యోగ రీత్యా పెంపు, నూత్నోత్సాహం.

★ **సింహం :** నూతన మిత్రులు చేరుతారు. ఉత్తరాల మూలంగా పలు విషయాలు తెలిసి కొంటారు. విద్యా విషయంగా పెంపు చేకూరుతుంది. కొందరకు నూతనోద్యోగ ప్రాప్తి, గృహానందం, రాజకీయాలందు మెరుగు, స్త్రీలకు : ధన ధాన్యాభి వృద్ధి, విలాస వస్తు సేకరణ, ఆదాయమందు వృద్ధి.

★ **కన్య :** ధన ధాన్య సంపత్తికి కొరత లేదు. ఎందుకో? శని మూడింట ఉన్నందులకు. రాజకీయాల్లో మేలున్నది, ఎందుకో? గురుడు అనుకూలుడయినందులకు, సభా గౌరవమున్నది. పత్రికా గౌరవానికి ఆస్కారమున్నది. స్త్రీలకు : అనుకూల వార్తాశ్రవణం, అభివృద్ధి కార్యాలలో జోక్యం, ధనాదాయం.

★ **తుల :** ముఖ్యులతో పేచీలు రాకుండా చూచుకోండి. విదేశీ మిత్రులో, పరిచితులో యింటికి రాగలరు. అవకాశ వాదులను దాపునకు రానీయకండి. మీకు చికాకు కలిగిస్తారు, రాజకీయాలు ఫలించవు. స్త్రీలకు : వృత్తి యందనుకూలం. పెద్దల పరిచయం.

★ **వృశ్చికం :** నూతన మిత్రుల సంపర్కం ఏర్పడుతుంది. వివాహ కార్యానుకూలం, ఒకానొక విషయంలో అపజయం కలిగిందని బాధపడకండి. అది దైవ నిర్ణయమే- ఏదో ఆపద తొలగిందని అర్థం. స్త్రీలకు : దూర ప్రాంతాలకు పోగల అవకాశాలున్నాయి. కొందరు ఉద్యోగ రీత్యా ప్రయాణిస్తారు.

★ **ధనుస్సు :** నూతనోత్సాహం, నూతన మిత్రుల సంపర్కం, మిత్రుల కొరకు అధికంగా వెచ్చించటం, ఆదాయమందు అభివృద్ధిని సాధించటం, రాజకీయాలందు జోక్యం కలిగించుకోవటం వారఫలం స్త్రీలకు: మేలైన రోజులు, ఆదాయమున్నది. అనుకూల వార్తాశ్రవణం.

★ **మకరం :** పదే పదే ఆలోచించి, చేసిన పనికి యిబ్బంది రాదు. రాజకీయాలలో మీ ప్రమేయం ఎంతైనా అవసరం ఆస్తి హక్కులను గూర్చి, మీ వ్యాపార విజయాన్ని గూర్చి బాగా మురిసిపోతారు. విద్యా విషయంగా పెంపున్నది. స్త్రీలకు రాజకీయాల్లో ప్రవేశమున్న వారికి అధిక గౌరవపు వారం

★ **కుంభం :** అనుకూల మిత్రులు చేరుతారు మాటకు విలువ చేకూరుతుంది. రాజకీయ మిత్రుల వలన చక్కని అవకాశాలు లబ్యం. కళా జీవులకు అంటే నాట్య నాటక, చిత్ర రంగానుభవం గల వారికి చక్కని అవకాశాలు. స్త్రీలకు వృత్తి యందు పెంపు, స్వల్పాదాయం

★ **మీనం :** విద్యా విషయంలో మీకు పెంపు చేకూరుతుంది శుభ కార్య ప్రస్తావనలున్నాయి. ఉత్తర ప్రత్యుత్తరాల వలన అనేక విషయాలు గ్రహిస్తారు. కొందరి ప్రయాణాలకు ఆటంకాలు రానున్నవి. స్త్రీలకు : నూతన యత్న సాఫల్యం ఒకానొక వ్యవహారంలో విజయం శని, ఆది వారాలందు ధనలబ్ధి.

**-విద్వాన్ కోట సత్యారంగయ్యశాస్త్రి**

# వ్యక్తిగతం



సోవియట్ రష్యా 'ఇనుప తెర వెనుక' ఉన్నదని కొందరు మేధావులు అభి వర్ణించారు. ఆ ఇనుప తెరను ఒంటరిగాడు చిన్న విమానంలో దాటి సరాసరి రాజధాని నగరం మాస్కో నడిబొడ్డున అనుకోని వేళ అతిథిగా దిగాడు పందొమ్మిది సంవత్సరాల మాథియాస్ రుస్ట్ ఆయన పశ్చిమ జర్మనీలోని హాంబర్గ్‌లో కంప్యూటర్ ఆపరేటర్‌గా పనిచేస్తూ, ఔత్సాహిక విమాన చోదకుడుగా ఉన్నారు. ఎప్పుడూ అతి సమర్థ వంతమయిన రక్షణలో ఉండే సోవియట్ యూనియన్ గగనతలంలో 400 మైళ్ళు క్షేమంగా ప్రయాణం చేసిన రుస్ట్ చివరికి నిరంతరం క్షిపణి విధ్వంసక పరికరాలు కాపలా కాస్తూ ఉండేటటు వంటి మాస్కో నగరం మీద కూడా గింగిరాలు తిరిగి చివరికి అక్కడే నేలమీదికి దిగాడు. ఒక సంవత్సరం విమానాలు నడపడానికి ప్రైవేట్ లైసెన్స్ గల రుస్ట్ హాంబర్గ్ ఏరో క్లబ్ నుంచి చిన్న విమానాన్ని అద్దెకు తీసుకొని దాంట్లో ఇంధన ట్యాంకులు అదనంగా నింపించుకున్నాడు. 1300 మైళ్ళ దూరంలో రీక్‌జవిక్‌కు వెళ్ళడానికి అనుమతి తీసుకున్నాడు. రీక్‌జవిక్‌కు వెళ్ళి, అక్కడ నుండి హెల్సింకీకి వెళ్ళి, స్టాక్‌హోమ్‌కు వెళ్ళడానికి అనుమతి తీసుకుని రుస్ట్ మాస్కోకు ప్రయాణం కట్టాడు. మాథియాస్ రుస్ట్ చేసిన వినోదయాత్ర సోవియట్ - పశ్చిమ జర్మనీ సంబంధాల మీద, అజేయమయినదని చెప్పబడుతున్న సోవియట్ వైమానికదళం ప్రతిష్ఠ మీద తీవ్రమైన ప్రభావం చూపిస్తుందని పరిశీలకులు భావిస్తున్నారు. □



దూరదర్శన్‌లో అర్ధరాత్రి సినిమాలు అసభ్యంగా ఉంటున్నాయని, అందు వల్ల వాటి ప్రదర్శనని రద్దు చెయ్యాలని బొంబాయిలో ఉద్యమం మొదలుపెట్టారు డాక్టర్ పుష్పా ప్రభు. బొంబాయి దూరదర్శనం కేంద్రం ముందు పెద్ద పెద్ద నిరసన ప్రదర్శనలు నిర్వహించిన పుష్ప బొంబాయి మేయర్ రమేష్‌ప్రభు భార్య. ఆమె భర్త మేయర్ కాక ముందు వీధుల్లో జులాయిల వేధింపులను ఎదుర్కొనేందుకు ఎప్పుడూ ఒక కృపాణాన్ని దగ్గర పెట్టుకుని తిరుగుతుండేవారట. ఆమె శివసేన నాయకురాలు కూడా 'స్త్రీని రక్షించడానికి ఎప్పుడూ భర్తో, సోదరుడో పక్కన ఉండాలి ప్రకృతి కల్పించిన లక్షణాల వల్ల స్త్రీని మానభంగం చేయడానికి వీలున్నది కాని పురుషుణ్ని ఎవరూ ఏమీ చేయలేరు. కనుకనే స్త్రీలకు రక్షణ కావాలి" అంటుందామె. ఇంత ధైర్యంగా ప్రజా జీవనంలో పాల్గొంటున్న ఆమె సభా పిరికి! "నేను ఉపన్యాసాలివ్వలేను. వేదిక ఎక్కితేనే వణుకు వచ్చేస్తుంది" అంటారామె. అందుకే వీధుల్లోనే బలప్రయోగంతో దుండగులకు వణుకు పుట్టిస్తూ ఉంటారు డాక్టర్ పుష్పాప్రభు. □

# విజయ్ మిక్సీ

**55 నిమిషాలు నిర్విరామంగా పనిచేయుగలదు.**

## ఉచితం!

"ప్రతీ విజయ్ మిక్సీతో ఒక విజయ్ స్విచ్ ఐరన్ ఉచితం."






ఈ అవకాశం
కొద్ది రోజులు మాత్రమే

**Vijay** - a friend of your family

JAISONS AMA 687

## నిత్య నూతన సీరియల్




(గత సంచిక తరువాయి)

ఒకనికి తన్ని యింకొకనికి చేపి పాలిచ్చిన బఱ్ఱెవలె ఆ భూమి యితని సేద్యము క్రింద సమృద్ధిగా ఫలించెను. వంద యెకరముల మెట్ట యీ రీతిగా పదునకు వచ్చి, జొన్న, మొక్కజొన్నయు కలిపి ఆ యేడెనిమిది పుట్లు పండించెను. రామచంద్రరాజు పాలము త్రొక్కిన చాలును, అది కామధేనువు వలె అడిగిన దెల్ల ఇచ్చు చుండెను. ఆరేండ్లలో రాజు డెబ్బది ఎనుబది వేల ఆసామి అయ్యెను. అతడచట ధనవంతుడై నప్పటినుండియు సుబ్బన్న పేటకు వచ్చి తల్లిని. బంధువులను చూడవలెను అను కోర్కె అతనిలో చెలరేగెను. కాని తండ్రి చనిపోయినాడన్న తరువాత ఉత్సాహము కొంత తగ్గెను తాను ప్రయోజకు డైతినని తండ్రిచేత అనిపించుకొన వలయునని అతడు తలంచెను. ఆ కోర్కె సాగలేదు. రామచంద్రరాజు ఒకసారి గంజాం జిల్లా పోయి అక్కడ తన తల్లి తరపువారిని అందరను చూచి వచ్చెను. వారును ఇతడు ధనవంతుడని తెలిసి, మరల క్షత్రియ సంప్రదాయములో ఉన్నాడనియు, తమ వారందరు గౌరవించు చున్నారనియు ఇతనిని గౌరవించిరి. రంగాజమ్మ గారి అన్నదమ్ము లందరును చనిపోయిరి. వారి పుత్రు లున్నారు. ఆమె పిన తండ్రి కుమారు లున్నారు. వారందరును రామచంద్ర రాజుతో కలసి మెలసి బంధువుతో వలె తిరిగినారు. రామచంద్రరాజు ధనవంతుడని తెలిసినంతనే సుబ్బన్న పేట ప్రజ అతనిని చాల గౌరవించెను. అందరును, "ఓహో! రాజుగారు! దయచేయుడు మరల రామేశ్వర శాస్త్రిగారికి పేరు తెచ్చితి"రని అయనను పొగడిరి. 'శాస్త్రిగారి కేమి? చివరి రోజులలో కొంచెము చెడిపోయెను గాని, మహారాజు! దానికేమి! చంద్రునంత వానికి మచ్చ పోలేదు" అనిరి. అన్నదమ్ము లిద్దరి అన్యోన్యమును చూచి ధర్మారావును జనులు మరియు గౌరవించిరి. అతనికేమి లక్షాధికారి అన్నగారనిరి. ఇద్దరును కలసి రంగాజమ్మ గారి వద్దకు పోయిరి. ఆమెక్కు నిన్నటికన్న ఎక్కువ చేసెను. శ్లేష్మము గుండెల కెగదన్ని ఆమె బాధపడు చుండెను. జ్వరము తగ్గలేదు. ధారక మంతగా లేదు.

రామ ఈమెకు మంచి వైద్యము చేయించవలెను. ఎట్లు?

ధర్మా : ఆస్థాన వైద్యులు రెండేండ్లయినది పోయి, అయన ఘన వైద్యులు. ఆయన బ్రతికి యుండగా ఈ చుట్టుపట్ల జనులకు వెదకుకొన నక్కర లేకుండ ఉండెడిది. ఇప్పుడు దిక్కు లేదు. మంచి మందులే లేవు. ఉన్నచో అవి కోటలో ఎక్కడ ఉండెనో ఎవరికిని తెలియదు సరియైన వైద్యము కావలయునన్నచో ఇంగ్లీషు వైద్యము చేయించవలయును. దానికి బెజవాడ తీసికొని పోవలయును

రంగా : నేను బెజవాడకు రాను, గిజవాడకు రాను. నన్నిచటనే తగుల పెట్టవలయును. మీరు నన్ను బెజవాడకు కొనిపోదురు. నే నచట గుటుక్కు మన్నచో నన్నక్కడ తగుల వేయుటకా? నా శవము సుబ్బన్నపేటలో నే తగులబడవలయును. అయినను నాకు వైద్య మెందుకు?

ధర్మా : అదేమి మాట? చూచుచు చూచుచు ప్రాణమును తీసికొందుమా? ప్రాణము లున్నంత

వరకు చికిత్స చేయవలసినదే. అట్లు చేయనిచో ఆత్మహత్య క్రిందకు వచ్చును.

రామ : నీవు బి. ఏ. మొదటి యేడు పరీక్ష నిచ్చితివా?

ధర్మా : అవును. ఇప్పుడా ప్రసక్తి యేమి?

రామ : చక్కగా మాటాడితివి. ఎట్లయినను చదువుకొన్న దారి వేరు.

ధర్మా · ఇంగ్లీషు చదువుకొనుట వలన కాదు, నేనిట్లు మాటాడునది.

రామ : బెజవాడ నుండి డాక్టరును పిలిపించి నచో?

రంగా : బాబూ! అది అనవసరపు ఖర్చు. మొన్న మొన్న చంద్రారెడ్డి భార్యకు జబ్బు చేసినపుడు



చూచినాను. అదేమి ఆశ. అదేమి దబ్బు! ఆయనకు నెలకు వేయి రూపాయల జీతమట. సొంత మోటారు మీద వచ్చినాడు ఆ డాక్టరు. వచ్చి ఏదో మందిచ్చి నాడు. నాలుగు వందలు పుచ్చుకున్నాడట.

ఇలాగయినచో మనమందరము దివాలాలు తీయువలసినదే.

ధర్మా : అవును. ఈ వ్యవహారమింతే.

రంగా : అయిన కావచ్చును. కాని నా భర్త ఇచ్చిన ప్రతి సెంటు భూమియు నా కుమారుడనుభవించ వలయునే కాని నేనందులో ఏమియు కర్చు పెట్టను. నేను చచ్చిపోయినను సరే.

రామ : ఏమిటమ్మా యీ పిచ్చి. ధనము ప్రాణాపద కడ్డు వచ్చుటకు కాకపోయినచో దేనికి? పాతరవేసిన చివరికెవరికగును.

రంగా : అందుకని సముద్రములో పోయుదుమా?

రామ : వైద్యున కిచ్చుట సముద్రముల పోయుటా?

రంగా : ఆ వైద్యునకు వేయి రూపాయలు జీతమాయును. సాలును పన్నెండు వేలు. నా ఆస్తి మీద సాలునకు వెయ్యి రాదు. ఇప్పటి ధరలలో ఎనిమిది వందలు వచ్చుచున్నవి. శిస్తులు, ఖర్చులు పోను నాలుగు వందలే మిగులును. అందులో తిండికెంత? వైద్యమునకెంత? వైద్యమని మూలచ్ఛేదము చేసికొందువా? సాలునకంత ఆదాయము వచ్చువానికి మనము మన భుక్తికైన పొలమమ్మి యిచ్చుటలో నాకర్థము కనిపించుట లెదు తీసికొనుటకు ఆయనకు మాత్రము మనసెట్లొప్పుచున్నదో?

ధర్మా : అమ్మా, వారు నీయంతగా విచారించరు కదా.

ధర్మారావ"మ్మా" అని పలుచుటతో రంగాజమ్మ గారికి ఆనందమయ్యెను. ఇంతవరకు తనతో సంగ మాటాడనైన మాటాడని వాడు తన్నిప్పుడు "అమ్మా" అని పిలుచునంత ప్రేమ ఏల కలిగెనో?

రామచంద్ర రాజూరకుండెను. భోజనము వేళ అయినదని ధర్మారావింటికి పోయెను. రంగాజమ్మ గారి వివేకమున కతడు నివ్వెరపోయెను. ఏమియు చదువుకోని ఆమెకంత యర్థశాస్త్ర పరిజ్ఞాన మెట్లున్నది? పాఠశాలలోని అర్థ శాస్త్రములో ఈ సంగతులే ఉండవు కాబోలు. అతడు రెట్టింపు ఉత్సాహముతో ఇంటికి గాలి తెరలమీద ఊగుచు పోయెను.

మేనత్త వలదన్నకొలదియు అరుంధతి మడికట్టుకొని వంట చేసెను. ధర్మారావు పోయిన వెంటనే నీళ్ళు తోడి, సున్నిపిండి ఉంచి, స్నానము చేయుటకు రమ్మనెను. అతనికి నీళ్ళందించెను. వీపు తోమెను. వీపు తోము వేళ ధర్మారావు ప్రక్కలకు చేతులతో నామె చేతులు నొక్కి పట్టుకొనెను. ఆమె నవ్వెను. చేతికి నీళ్ళందించు వేళ, తుడుచుకొనుటకు తువాలు ఇచ్చు వేళ, మడిబట్ట అందించువేళ, హస్తాగ్ర స్పర్శము పతి చేయక మానడు. ఆమె సిగ్గుపడకమానదు. అతడూరక నవ్వించకమానడు. ఆమె కిలకిలలాడక మానదు. సావిత్రమ్మగారి మొగములో కన్నులు, ముక్కు, నోరు సర్వము పోయినవి. ఆనందమే ఉన్నది.

భోజనము చేయువేళ సావిత్రమ్మగారు పోయి వీధి అరుగు మీద కూర్చున్నది. అరుంధతి విస్తరి వేసినది. ధర్మారావు పీట మీద కూర్చుండి విస్తరి వేయుటకు వచ్చిన ఆమెను తన వద్ద పీటమీద కూర్చుండబెట్టెను. ఆమె "అయ్యో! అన్నము వడ్డించవలదా?" అనెను. "ఇదిగో అన్నము తినుచున్నాను" అని అతడామె నొడలెల్ల కొరికెను. అరుంధతి చక్కిలిగింతలకు పకపకాలున నవ్వెను. చక్రమువలె అతని చేతిలో తిరిగిపోవును. చివరకు వదలించుకొని దూరము నుండి ఆమె విస్తరి మీద నీళ్ళు చల్లి అభిఘరించెను. ధర్మారావు "అంత దూరాన నిలుచున్న నేను దగ్గరకు రాలేనా?"అనెను. అరుంధతి "అవును ఎనిమిది నెలలయిన పట్టదా అని దిలాసా" అనెను.

ధర్మారావు "అప్పుడంతే(ఇప్పుడు -" అని లేచి ఆమె చుబుకము పూని, "అంత కోపమెందుకు? నవు పుట్టినింట సుఖపడుచున్నా వనుకొన్నాను గాని కష్టపడుచుంటివని తెలిసినచో కన్నుమూసి కన్ను తెరచువరకు నీ దగ్గర ఉండెడివాడను కానా? ఎనిమిది నెలలు కాదు ఎనిమిది లిప్తలింక నీ వియోగము సహించచాలను". అని మరల పీటమీద కూర్చుండెను. ఆమె అన్నము వడ్డించెను. పప్పు, పొట్లకాయ కూర, ఒక పచ్చడి - ఇవి పదార్థములు. సావిత్రమ్మగారు జాగ్రత్తగా నీళ్ళు పోసి దొడ్డిలో పొట్ల బీర పాదులు వేసంగిలో కూడ కాయించు చుండెను.

ధర్మా : ఈ పచ్చడి ఏమిటి?

అరుం : తెలిసికొండు.

ధర్మా : నాకు దెలియదబ్బా. నాకు దెలిసిన దొక్కటియె. మరి ఏమియు తెలియవు.

అరుం : ఆ తెలిసినదేమిటి?

ధర్మా : చెప్పుదునా? మా ఊరికి దగ్గరగా రంగాపురమని ఉన్నది. ఆ ఊరిలో ఒక పిల్ల ఉన్నది. దాని పేరేమిటో మరచిపోయినాను. ఆ పిల్ల మగనితో లేచిపోయినదట. ఇది నాకు తెలిసిన సంగతి. ఆ పిల్ల పేరు నీకు తెలియునా?

అరుం : తెలియును. ఆ పిల్ల పేరా? ధర్మారావు.

ఇద్దరును నవ్వి నవ్వి ఆయాసము వచ్చు వరకు నవ్విరి. ఇంతలో తల్లి వాకిట నుండి వచ్చెను. ధర్మారావేమియు ఎరగనట్లు ఆమెతో ఇందాకటి నుండియు మాట్లాడలేదన్నట్లు "అమ్మా! మజ్జిగ" అనెను. ఆవిడ "నాయనా! మడిగట్టుకొన్నది నేనా?" అనెను.

ధర్మారావు "అయినచో పోయుమ"నెను. అరుంధతి మజ్జిగ పోయుచుండెను. ధర్మారావామెమీద చేతిలోని చల్ల చిలుకరించెను. అది ఆమె మీద పడి ఒడలెల్ల ఎంగిలి అయ్యెను. అంతలో సావిత్రమ్మగారు దొడ్డిలోనికి చనెను.

అరుం : ఇంక నేను మరల స్నానము చేయవలెను. ఆ రోజున ఎంగిలి పన్నీరు; ఈ రోజున ఎంగిలి చల్ల.

ధర్మా : "నీ ఒడలంతయు ఎంగలయినది అసలు" అరుంధతి కొడలెల్ల ఎంగిలయినట్లు లేదు. అమృతమయమైనట్లున్నది.

అరుం : నేను స్నానము చేయను ఇట్లే ఉందును.

ధర్మా : అనగా ఎప్పుడును పుంస్త్రీగానే ఉందువా?

అరుం : అవును.

ఇద్దరు ఒకరి వంక ఒకరు చూచుకొంచునే ఉండిరి. ధర్మారావు, చివర రెండు ముద్దలున్నవి. అవి తినుట ఎరుగడు. అరుంధతి చల్ల తప్పేల క్రింద నుంచుట ఎరుగదు. ఇద్దరు ఏవో పరస్పరాక్షి కోణముల గూఢార్థములు చదువుకొనుచున్నారు. ధర్మారావు కనులలో నీరు నిలిచెను.

అతడు చేయి కడుగుకొని గదిలోనికి పోయెను. అరుంధతి చేతులు కాళ్ళు, మొగము కడుగుకొని తాను కూడ గదిలోనికి పోయెను.

ధర్మా : పోయి భోజనము చేయుము. ఇప్పుడెందుకు వచ్చితివి?

అరుం : మీకు తాంబూల మిచ్చి పోయెదను.

ధర్మా : తమలపాకు లెక్కడివి?

అరుం : ఇందాక అమ్మవచ్చినవి.

ధర్మా : అరుంధతి వెంటనే అవికూడ ఊరిలోనికి వచ్చినవి కాబోలు!

అరుంధతి మొగమునందు మధురలజ్జ విచిత్రముగా కనపడెను. ఆ రేఖ కొన్ని జన్మలుగా అభ్యసించిన ఒక అభినయ విశేషము వలె ఆమె మొగము మీదికి అంతలో వచ్చును. వచ్చినంతనే ఆ ముఖము మేఘము చాటున అస్తమించు సూర్యరోచిస్సులు ఎగతన్ని పశ్చిమాశకు పై భాగమున కల తెల్ల మొగిలు చివళ్ళు బంగారపు జరీవలె ధగ ధగ మెరిసిపోవు వేళ ఆ మొగిలు కడ్డముగా బెగ్గురు పక్షి తన తెల్లని రెక్కలతో గీచినట్లు మెరసిపోవును.

ధర్మారావు మొదటి ఆరునాళ్ళలో దానిని లీలగా చూచెను. రాత్రి రహో మధుర దుఃఖకథన గాథలో అట్టిది జరుగలేదు. ఇపుడా రేఖ అరుంధతీ లీలా ముగ్ధత్రపా మధుర వదన సరోజము పైకట్లు వచ్చి అట్లు పోయెను. ధర్మారావు నిలుచున్నవాడు నిలుచున్నట్లు ముగ్ధుడైపోయెను.

పతి పొందిన తన్మయత్వమున కేమి హేతువో సతికి తెలియదు. తాను తన భర్తకు అంత

జరిగిన కథ –15 : సుబ్బన్న పేట జమీందారు కృష్ణమనాయని మరణానంతరం రంగారావు గారికి పట్టాభిషేకం జరుగుతుంది. రుక్మిణమ్మా రావుగారి సాయంతో ధర్మారావు గుంటూరు కళాశాలలో చేరతాడు. ధర్మారావుకు సూర్యపతి అనే మిత్రుడుంటాడు. సీస పద్యాన్ని శ్రీనాథుడే నాశనం చేసాడని రాఘవరావుతో ధర్మారావు అంటాడు. ధర్మారావు సుబ్బన్నపేట వెడుతూ దారిలో రామచంద్ర రాజును కలుసు కుంటాడు. పుట్టింటిలో తాను పడిన కష్టాలను అరుంధతి ధర్మారావుతో చెబుతుంది. రంగాజమ్మ గారికి జబ్బు చేస్తుంది. రామచంద్రరాజు పెద్ద పెద్ద వైద్యులను పిలిపించాలని అనుకుంటాడు.

ప్రేమాస్పదురాలగుట ఆమె ప్రాణ మార్గములో అమృత ప్రవాహములు సుళ్ళు తిరుగుచుండెను. ఆమెకు పోయి భర్తను తానుగా కౌగలించుకొన వలయును అనిపించెను. కాని స్త్రీ సహజమైన లజ్జ అడ్డము వచ్చుచున్నది.

ధర్మా : నేనిపుడు తాంబూలము వేసికొనను. నీవు కూడ భోజనము చేసి రమ్ము. ఇద్దరము కలసి అపుడు వేసికొందము.

అరుం : నాకు రోజును సాయంకాలపు పొద్దు తిరిగిన తరువాతగాని తిండి అలవాటు లేదు. మా నాయన ఇష్టి పూర్తి అయిన తరువాత.

ధర్మా : ఇక ఆ అలవాటు మారిపోవును కదా! దానికి నేడే మొదలు పోయి రమ్ము.

అరుం : అంతవరకు తాంబూలము లేకుండా ఉందురా!

ధర్మా : ఇంత కాలము నీవు లేకుండ లేనా?

ఆమె పోయి భోజనము చేసి వచ్చెను. తమలపాకులకు సున్నము రాచుచుండెను. ధర్మారావు సున్నము తీసి ఆమె బుగ్గకు రాచెను. ఆమె తుడుచుకొనలేదు. ధర్మారావు "తుడుచుకొనవేమి!" అనెను.

అరుం : నాకేమియు అవసరములేదు. నా మొగము నాకెట్లున్నను సరే!

ధర్మా : నాకు అంతే.

అరుం : నిజముగానా?

ధర్మా : నిజముగానే!

ధర్మారావు తమ్మ నమలి అరుంధతి కందీయబోయెను. అరుంధతి గ్రహించలేదు.

అరుం : నాకీ ఎంగిలి వద్దు.

ధర్మా : వద్దని నిన్న సాయంకాలము చెప్ప వలసినది. ఇప్పుడు నేనొప్పుకోను.

అరుం : ఒప్పుకొనక ఏమి చేసెదరు?

గోడ మీద ఒక పటము చూపి ధర్మారావు "అది" అనెను.

అరుంధతి మొగము మీదికి మరల మధుర లజ్జా రేఖ వచ్చెను. ధర్మారావా రేఖను దిగ్భ్రాంతుడై చూచెను. అరుంధతి మరల కలవరపడెను.

ధర్మా: హేమ రేఖా! అది, అది!

ప్రొద్దు వాటారెను. దేవదాసి వచ్చెను. సావడిలో నుండి "అన్నా!" అన్న పిలుపు వినపడెను. ధర్మారావుత్తరీయమును వేసికొని బయలుదేరెను. అరుంధతి యింతకు ముందు వఱకు తానే గాక ప్రపంచము లేదన్నట్లున్న పతి యింతలో ఇట్లు లేచి పోవుచున్నందుల కచ్చెరువు పడి "ఎవరామె!" అన్నది.

ధర్మా: గిరిక.

అరుంధతికి జ్ఞాపకము వచ్చెను. తన ఉంగరము వంక చూచుకొనెను. ఉంగరములోనిది నీలపు రాయి. భార్యా భర్తలిరువురును బయటికి వచ్చిరి. దేవదాసి అరుంధతిని అదే చూచుట.

దేవ: వదినగారికి నమస్కారములు.

అరుంధతికేమియు తోచలేదు. తానెక్కడ! ఆమె ఎక్కడ! ఆ నమస్కారమునకు తాను తగుదునా అనుకొన్నది. అనుకొని ఉంగరము వంక చూచెను. ఉంగరము తమాల వృక్షచ్ఛాయవలె, యమునా తరంగము వలె, కపిల శరీర కాంతి వలె, యశోదా శిశువువలె, నల్లని కాంతులు వెదజల్లుచుండెను.

అరుంధతి గదిలోనికి పోయి రెండు తాంబూలములు తెచ్చి దేవదాసి చేతిలో ఉంచెను. దేవదాసి చూచుకొన్నది. తెండెందుకు అనలేదు. మఱల గుప్పిలి మూసెను. అన్నా చెల్లెండ్రిద్దరును నడచి పోయిరి. అరుంధతి వారి వంకనే చూచెను. ఇద్దరును పోయి తండ్రి కట్టించిన చలువ రాతి మెట్లపై కూర్చుండిరి. గిరిక పాదములు నీళ్ళలో పడునట్లు కూర్చుండెను.

ధర్మా: నా కొఱకు నీవు నిన్న కూడ వచ్చితివా?

గిరిక: రాలేదు. నీవు రంగాపురము వెళ్ళితివిగా!

ధర్మా: అది నీకెవరు చెప్పిరి?

గిరిక: నీవు వెళ్ళుచుండగా నేను చూచితిని. ఇక్కడ నుండి చూడుము. రంగాపురము త్రోవ కనపడుటలేదా? దూరాన నిన్ను చూచి గ్రహించితిని.

ధర్మా: ఈ ఎనిమిది నెలలు ఏమి చేయుచున్నావు?

గిరిక: చదువు లేదు, సంధ్య లేదు. నీవు నీ దారి చూచుకొనుచున్నావు కాని, నా దారి చూచి పెట్టుట లేదు కదా!

ధర్మా: నా దారి తేలిక, నీ దారి కష్టము. నీ దారి నీవే ఎక్కువ చూచుకొనవలయును. ఆ దారి మాకనుభవములో లేనిది.

గిరిక: అది ఏమి, అట్లందువు? నీవున్నావని నేను ధైర్యము పడుచుండగా, నీవట్లన్న నేనేమి కావలయును? అన్నా! నీవు చెప్పినట్లుగా రోజును రాత్రి నిద్ర పోవు వఱకును ప్రాణాయామము చేయుచు స్వామిని ధ్యానించుచు, పండుకొందును. స్వామి మూర్తి నాకు ముందు నిలువదు. రెండు, మూడు సార్లు నిలిచినది. కాని అంతలో మాయమైనది. అన్నా! గుడిలో ప్రభువునకెదురుగ నిల్చున్నప్పుడున్నంత సుఖము నాకింటి వద్ద కలుగుటలేదు.

ధర్మా: తల్లీ! ఇది ఎనిమిది నెలలోనే సిద్ధించెడి విద్య అయినచో ఋషులకు యుగములు పట్టుటేల? నీవు నన్ను మఱచిపోవలయును. నేను లేను. నీవేమి చేయుదువు? చేసినదే చేసి, చేసినదే చేసి నీ ప్రాణము విసుగవలయును. అప్పుడతని ప్రాణములు విసుగును. అప్పుడుగాని ఆ దొంగ గుండె కరుగదు. ప్రాణములు వేధించుటలో అతడే మొనగాడు.

గిరిక: బావగారిని ఎన్నయిన అనుము. ఆయన పడవలసినవాడును, నీవనవలసినవాడవును.

ధర్మా: గిరికా! ఈ సరాగములకేమి? యీ నవ్వులకేమి? ఆయన ఎంత దూరము వచ్చినాడు? మఱల స్వప్నమేమయిన వచ్చెనా?

గిరిక: నీవు వెళ్ళిన తరువాత నెలనాళ్ళ క్రిందట వచ్చినది.

ధర్మా: అందులో ఏమి జరిగినది?

గిరిక: స్వామి వేణు వూదుచున్నాడు. గోవులన్నియు మెడలెత్తుకొని ఆయన వంక చూచుచున్నవి. దూరమున యమునా నది ప్రవహించుచున్నది. తమాల వృక్షములు గాలి కూగుచున్నవి. స్వామి నల్లని దేహ కాంతులు నా మీదికి వచ్చినవి. నేనా నీడలలో, నక్కి నక్కి స్వామి దగ్గఱకు పోయితిని. అదివఱకు నన్నుగనినంతనే ఆయన పారిపోయినారు కదా? అందుచేత ఆయనకు కనపడకుండ నేను సమీపించితిని. వెనుక నుంచి వెళ్ళుట చేత నేనాయనకు కనపడలేదు. దగ్గఱకు పోయి వ్రేలాడుచున్న ప్రభువు ఉత్తరీయమును తాకితిని. ఇంతలో నాకు మహానందమయినది. నా గుండె కొట్టుకొన్నది. నా దేహములోనున్న రక్తమంతయు వేగాతి వేగముగ ప్రవహించెను. ఇంతలో మెలుకువ వచ్చినది. లేచి చూచితిని. స్వామి లేడు; ఏమి లేదు, ఇంత సేపేడ్చితిని. మఱల నిదుర రాలేదు.

ధర్మా: ఓపిక పట్టుము. ఇంకను ఆలస్యము పట్టును. అది యేండ్లు కావచ్చును. ఇది వఱకు చెప్పినదే మార్గము. స్వామి నీతో మాట్లాడ వలయును. అదియు కలలోన గాదు; నీవు మెలుకువతో ఉండగనే వచ్చి నీతో ప్రసంగించ వలయును.



గిరిక దిగాలపడిపోయెను. అమె ఏడ్చుచుండెను. ధర్మారావామె వంకనే చూచెను. అమె తాను కూర్చున్న రాతి మీద పడి "అన్నా! నాథుడెప్పటికయిన నన్నట్లు మన్నించునా? నేనెన్ని రాత్రులు నిద్రించలేదో ఆయనకైన తెలియదా! నేను పడుచున్న కష్టములు చాలవు కాబోలును. ఏకాదశులు. ద్వాదశులు ఒక్క పూటయే తినుచున్నాను. అష్టమి, నవములు ఒక్క పూటయే. ఇంక నాల్గు రోజులలో అన్నమే మానివేసెదను. అన్నా! ఇంకను ఏమి చేయవలయునో చెప్పుము. ఒక్కసారిగా మెడ నఱకు కొనుమందువా! అది సులభముగా చేసెదను. స్వామికి దయలేని యీ మొండి బ్రతుకు బ్రతికి ఎందులకు? ఇందాక వదినె గారిని చూచితిని. అమెకు నీవు ప్రత్యక్షముగా ఉన్నావు. ఈర్ష్య కాదు సుమా? నాకట్లు లేదాయెను. పతి దయ చూచుటెప్పుడో తెలియదు.

ధర్మా: ఇంక ఎన్ని క్షేత్రయ్య పదములు నేర్చుకొంటివి?

గిరిక: మా అమ్మకు వచ్చినవన్నియు నేర్పినది.

ధర్మా: నీకా చిన్న పుస్తకమిచ్చితిని- అందు నాయికలు, వారి స్వభావము, వారి లక్షణములు నున్నవని- అది చదివితివా?

గిరిక: చదివితిని కాని సరిగా తెలియలేదు. తేవు రాత్రికి వత్తువా? చెప్పుదువుగాని. నీకు వీలుండదా?

ధర్మా: ప్రతి రోజున ఒక గంట చదువుము. రేపటి నుండి రమ్ము. ఈ మూడు నెలలు నేనిందే ఉండెదను. నీకు వచ్చిన పదాలలో కూడ నాయికా విభాగము చెప్పెదను. ఈ మూడు నెలలగు వఱకు నీవు చదువదగినది ఏమియునుండ రాదు.

గిరిక: ఇంక లెక్క పది రోజులలో స్వామి నాతో కనీసము కలలో నైనను సరే మాటాడెనా మాటాడెను; లేదా యే రాత్రి వేళనో వచ్చి యీ చెరువులో పడెదను. నాతో స్వామికి తెప్ప ఉత్సవము జరుగును చివరకునే నంతేలే!

గిరిక ఊరక ఏడ్వనారంభించెను. ధర్మారావు "ఆలయములోనికి పోయి కనుగొందము రా." అని

# వేయిపడగలు

అమెను లేవదీసి ఆలయములోనికి కొంపోయెను.. పోయినది మొదలు గిరికకు స్మృతి లేదు. ధర్మారావు తన్మయుడై పోయెను. ఆలయము బయటకు ఇర్వురును కలసియే వచ్చిరి. ఇంటికి పోవు చుండిరి.

గిరిక: "అడుగలేదేమి?" అనెను. ధర్మారావు "మరచిపోతి" ననెను.

రాత్రి ప్రొద్దు పోయినది. గిరికని ఇంటి వద్ద దిగ విడిచి ధర్మారావింటికి వచ్చెను. అరుంధతి వీధి గుమ్మము వద్ద నిలుచుండి ఎదురు చూచు చుండెను. అతడామెను చేతులలో ఎత్తుకొని లోనికి తీసికొని పోయెను. చీకటులు దట్టమై క్రమ్ముకొనెను.

మరునాడు రంగాజమ్మగారి కెక్కువ చేసెను. తెల్ల వారులు నిదుర పట్టలేదు. జ్వరము జారనుగూడ లేదు. ఊరిలోని మంగలియు నర్చకులిద్దరును వచ్చి చూచిరి. ఏవో మందులు నడుపుచుండిరి. ఒక వారము గడచినగాని రోగ స్వభావము చెప్పలేమనిరి. రామచంద్రరాజుగారు, రంగాజమ్మ గారికి తెలియకుండ పోయి పెద్ద డాక్టరును దీసికొని వచ్చెను. ఆయన చూచి కొన్ని మందుల పేర్లు చెప్పి, ఇవి కొని తెమ్మని చెప్పి, తానేదో యింజక్షనిచ్చి వెళ్ళెను. తరువాత ప్రతి గంటకు జ్వరము చూచుట, వ్రాసి ఉంచుట, గంట గంటకు మందిచ్చుట. ఒక మనిషి ప్రత్యేకముగా అమె యొద్దనుండవలసి వచ్చెను. నీళ్ళు కలిపిన ఏ మందయినను త్రాగనని రంగాజమ్మగారు పట్టు పట్టెను. అందుచే పొడులు, బిళ్ళలే యిచ్చుచుండిరి. ఆ మరునాడు మధ్యాహ్నమున ధర్మారావును, రామచంద్రరాజును రంగాజమ్మగారి మంచము వద్ద కూర్చుండిరి.

రంగా: నాయనా! ఈ డాక్టరేమిటి? అంత పెద్ద వాడు లాగు తొడుగునేమిటి? మనిషి అసహ్యముగా లేడా?

రామ: అమ్మా, నీవు మాటలాడలేని స్థితిలో నున్నావు. డాక్టరు మాటాడవద్దని చెప్పినాడు. మాటాడకుండ పండుకొనుము.

రంగా: ఆ నోటిలో సిగరెట్టుతో నా వద్దకు వచ్చినాడు. మీరు దానిని పాఱ వేయమని యైన చెప్పినారు కాదు.

రామ: వారు గొప్ప వారు. అంతే! దొరలవలె ఉందురు.

రంగా: నేనేమి దొరల మొగ మెరుగనా? కృష్ణమ నాయుడుగారెప్పుడయిన నిట్టి అపభ్రంశపు పనులు చేసిరా? వారికన్న వీరు గొప్ప వారా? ఆయన ఎంత భక్తి కలవారు!

ధర్మారావున కామె ప్రతి మాటయు ఎంతో అర్థవంతముగా కనబడెను. అతి హేయమైన ధూమపానమ్ము గౌరవనీయమైపోయెను. గొప్ప దొరలనగా మహా గుణ సంపన్నులన్న అర్థము పోయి పెద్ద జీతగాండ్రన్న అర్థము వచ్చెను.

రంగా: ఆయన నాడియే చూడదేమి? "అది యెట్లున్నది ఇది ఎట్లున్నది" అని అడిగినచో రోగమెట్లు తెలియును? నాడి పరిశీలించి తత్త్వము తెలిసికొని, తత్త్వానుగుణముగా మందు నడపవలయునుగాని, యిట్లు పై చిహ్నములు చూచి నడపినచో ఏటికి తీసిన కోటికి తీయునేమో కదా?

రామ: అమ్మా! వీరి వైద్యము వేరు. వీరికి సర్వమును నాడి చూడకుండగనే తెలియును.

రంగాజమ్మగారు "కాబోలు" అని ఊరకున్నది. అదియు కాక తరువాత మాటాడలేకపోయినది. రామచంద్రరాజు తన కుమారునకు "రామేశ్వరశాస్త్రి రాజు" అని పేరు పెట్టెను. ఆ పిల్లవాడు నాయనమ్మ మంచము వద్దకు వచ్చెను. అతనికి అత్త, అమ్మ, నాన్న, అన్న మూడు మాటలు వచ్చెను. సుబ్బన్న పేట వచ్చిన తరువాత మామ్మ అన్న మాట కూడ వచ్చినది. రంగాజమ్మగారికి మనుమని చేత ఈ మాటలనిపించుటయే పనియైనది. అమె మనుమనితో "మామ్మ" అనపోయి అయాసము






చేత మానివేసెను. పిల్ల వానిని దగ్గఱకు తీసికొనెను.

అనాడు సాయంకాలము ధర్మారావు రంగాజమ్మగారి యింటి వద్ద ఉండగా దేవదాసి అతనిని చూడపోయెను. ధర్మారావు రామచంద్రరాజుతో మాటాడుచు మాటాడుచు హఠాత్తుగా లేచి ఆమెతో కలసి దేవాలయమునకు పోయెను. రామచంద్రరాజాశ్చర్యపోయెను. రంగాజమ్మగారు దేవదాసిని చూచెను. ఆమె కుమారునితో "ఆశ్చర్యపోయెద వెందులకు? ఆ పిల్ల ఎవరనుకొన్నావు? మీ నాయనగారుంచుకొన్నారే, రత్నగిరి! ఎరుగుదువు కదా, ఆమె కూతురు" అనెను. రాజు "ధర్మారావట్లు లేచిపోయెనేమి?" అనెను. రంగాజమ్మగారు "వారిద్దరిది ఒక చిత్రము. అది ఎవరికిని తెలియుట లేదు. ఇద్దరును అన్నయు, చెల్లెలును. వెనుక ఇప్పటి జమీందారుగారి పట్టాభిషేకమున ఒక చిత్రము జరిగినది వారు నృత్యము చేయుటకు దేవదాసిని రమ్మన్నారు. ఆమె పేరు దేవదాసిలే! ఆమె రానన్నది. వారు బలవంతముగ తీసికొని పో ప్రయత్నము చేసిరి. ధర్మారావు ప్రాణములు పోయినను అట్లు జరుగదని ప్రతిఘటించెను. వారూరకున్నారు" అనెను.

రామ: ధర్మారావు చాల మంచివాడే. దేవదాసి ఎట్టిది?

రంగా: నేను దేవదాసిని చాలాసార్లు పలుకరించి చూచితిని. ఆమెకు భాగవతమంతయు కంఠతః వచ్చును. మాట్లాడుచు మాట్లాడుచు తన ఒడలు తానే ఎరుగదు. ధర్మారావును గూర్చి మాట్లాడుచు "అన్న" అనును. ఆమె చాల భక్తురాలు. నా ఉద్దేశమేమనగా కొలది దినములలో ఆమె గోపాల-

రంగాజమ్మగారింక మాటాడలేకపోయెను. అంత వరకే ఆయాసపడుచు మాట్లాడగలిగెను. ఆ రాత్రి ప్రొద్దు పోయి గిరికను వెంట పెట్టుకొని ధర్మారావింటికి పోవుచున్న వేళ రామచంద్రరాజు కనిపించెను. ధర్మారావాగి "అన్నా! ఈమె ఎవ్వరో అమ్మగారు చెప్పినది కదా! యీమె పేరు గిరిక" అనెను దేవదాసి నిలుచుండెను.

ధర్మా: గిరికా! యీయన రంగాజమ్మగారి కుమారుడు. మన అందరిలో పెద్దవాడు. రామచంద్రరాజుగారు.

గిరిక రాజును చూచెను.

రాజు: "దేవదాసి అట కదా?" అనెను.

గిరిక: అన్న నన్ను గిరికయే అనను.

రాజు: అన్న కాదు, అన్నలు నన్ను గిరికయే అందురనుము.

గిరికయు, ధర్మారావును నవ్విరి. తరువాత వారిద్దరును కలిసి వెళ్ళిరి. నాటి రాత్రి రామచంద్రరాజు రథంతరితో "రథంతరీ! ఒక మాట. ఈ ఊరిలో మా నాయనగారుంచుకొన్న ఆమె కూతురు దేవదాసి అను పిల్ల కలదు. రేపామె యిచటికి వచ్చును. నీవు మన మిచ్చుటనున్న ప్రతి దినమును ఆమెకు వచ్చినపుడెల్ల ఏవో పువ్వులు, ఫలహారము ఒసంగవలయును. చాల భక్తితో నీయవలయును" అని చెప్పెను. (ఇంకా ఉంది)

# ధర్మపథం ఉత్తమసృష్టి



భగవంతుని సృష్టిలోని పదార్థాలన్ని ఏదో విధంగా ఉపయోగించేవే కాని, ఒక్కటీ వ్యర్థమైనదిలేదు. ప్రాణాలు తీసే విషం కూడా ఒకప్పుడు ప్రాణరక్షణకు ఉపయోగ పడుతుంది. నిష్ప్రయోజనాలనుకున్న తృణాదుల వల్ల కూడా మేలు కలుగుతుంది. ఇలా అన్నిటి వల్లా ప్రయోజనం కనబడుతున్నా, కొన్నిటిని మాత్రం మనవారు అత్యుత్తమ సృష్టిగా తెలియజేసి ఉన్నారు.

వృక్షాలలో మామిడి, పక్షుల్లో హంస, వన్యమృగాలలో సింహం, పెంపుడు జంతువుల్లో గోవు, మానవులలో సత్యవాది అత్యుత్తములుగా నిర్ణయించ బడినారు. దీనికి కారణం లేక పోలేదు.

మామిడి చెట్టు చిగురు నుంచి మ్రాను వరకూ అన్నీ ఎంతో ఉపయోగిస్తాయి. చిగుళ్ళు తిని కోకిలలు తమ కంఠ స్వరానికి మాధుర్యం అలవరచు కుంటాయి. శుభ కార్యాలన్నిటికీ మామిడాకుల తోరణాలు అత్యంతావశ్యకాలు. శాస్త్ర విహితాలైన వైదిక కర్మలు అవిలేనిదే జరగవు. మామిడి పవిత్రమైన వృక్షంగా ఉంటున్నది. దాని పిందెలు, కాయలు ఆహారంలోని వ్యంజనాలకు ఎంతో అవసరం. ఇక పండ్ల సంగతి చెప్పనక్కరయేలేదు. ఎండిపోయిన మామిడి మ్రాను వంట చెరకునకూ, కలపకూ బాగా ఉపయోగపడుతుంది.

ఇక– హంసను మించిన అందమైన పక్షి మరొకటి లేదు. దాని ఆహారం మృదువైనది. నీర, క్షీరాలను వేరుచేసే శక్తి హంసకు తప్ప మరొక పక్షికి లేదు. పూర్వం రాయబారాలకు హంసలను ఉపయోగించినట్లు తెలుస్తున్నది. అవి మేలైన సరస్సుల్లోగాని సామాన్యపు తటాకాలలో కానరావు.

వన్య మృగాలలో సింహం ఉత్తమమైనది. అది మృగరాజు. ఆకలి వేసినప్పుడే గాని ఇతర జంతువులను చంపదు. దానికి – కృతజ్ఞత ఉన్నది. అది యితర మృగాలలో కానరాదు. పెంపుడు జంతువులలో గోవు అతి ముఖ్యమైనది. పవిత్ర మైనది. గోమాతను పూజించేవారు చాలా మంది ఉన్నారు. మానవ జీవనాధారా లయిన పాలు, పెరుగులకు, నేతికీ గోవు ఆధారం! గోఘృతం లేనిదే హోమ కార్యాలు జరగవు. గోమయం కూడా పవిత్రమే! అది ఎరువుగానూ, వంట చెరకు గానూ కూడా ఉపయోగ పడుతుంది. పవిత్రమైన పంచ గవ్యంలో గోమూత్రం కూడా చేరి ఉన్నది.

మానవుల్లో సత్యవాది అత్యుత్తముడు. సత్య వాదికి ఔదార్యం సహజంగా అలవడుతుంది. సత్య వాఙ్మయమం వల్ల అతడు ఎట్టి త్యాగాని కయినా సిద్ధపడతాడు. తన సర్వస్వాన్ని కోలుపోయి, ఎట్టి కష్టాలు పడడాని కయినా సిద్ధ పడతాడు. దీనికి మనకు హరిశ్చంద్రుడే గొప్ప ఉదాహరణం.

ఈ విషయాలన్నీ అందరూ ఎరిగినవే కాని, క్రొత్తవి కావు. అయినా సృష్టిలో విభిన్న ప్రాణుల ఉత్తమత్వం సమిష్టిగా స్మరించుకునే అవకాశం కలిగించడానికి ఇలా చెప్పడం జరిగింది.

–బులుసు వేంకటరమణయ్య

# స్నేహితుడు

## కట్టా రాంబాబు

బస్ కోసం నిలబడి నిలబడి విసుగొచ్చేసింది.

ఈ బస్సుల్ని నమ్ముకుని ప్రయాణాలు పెట్టుకుంటే యింతే. పేపరు చూసుకుంటూ నిలబడ్డాను.

"ఒరేయ్! విశ్వం" ఎవరో ఎవర్నో పిలిచారు.

"నిన్నేరా పిలుస్తుంటే పలకవేం?" అంటూ ఒకతను వచ్చి నా భుజంమీద చరిచాడు.

"నన్నా మీరు పిలి చింది. నాపేరు విశ్వంకాదు, సూర్యం" అన్నాను.

"అదే....సూర్యం అలా పిలవబోయి విశ్వం అన్నాను" అన్నాడతను.

అతనెవరో నాకు తెలీదు. మనిషిని పరికించి చూసాను. నా వయస్సే వుంటుం దతనికి. సాదా బట్టల్లో వున్నాడు. ఒరే అని పిలుస్తున్నాడంటే నన్ను చూసి పొరపాటుపడివుంటాడు.

"మీరు నన్నుచూసి ఎవరనుకుంటున్నారో నేను...."అంటూ చెప్పబోయాను.

"అరే! నన్ను అప్పుడే మరిచిపోయావేంట్రా. నేను బ్రహ్మాన్ని గుర్తుపట్టలేదా?"

"బ్రహ్మం అంటే...."

"అదేరా నీ చిన్నప్పటి క్లాసమేటుని స్నేహితుణ్ణి."

బ్రహ్మం అనే పేరుగలవాళ్ళెవ్వరూ నాకు ఒకటో తరగతి నుంచి ఎమ్మే క్లాస్‌మేట్సుగా లేరు. ఆవిషయం నాకు బాగా గుర్తు. మరయితే యితనెవరు?

అతను ఏదేదో చెప్పుకొస్తున్నాడు. తనెప్పుడూ క్లాసులో ఎలా అల్లరిచేసేవాడో, మేష్టర్లని ఎలా ఏడిపించేవాడో, తనంటే ఆడపిల్లలు ఎలా భయపడేవారో ఉదాహరణలతో సహా చెపుతున్నాడు. ఇలాంటివాళ్ళు ప్రతి క్లాసులోను వుండేవారు. కానీ వాళ్ళలో బ్రహ్మం అని పేరుగలవాళ్ళెవరూ లేరు.

ఒకవేళ నేనే పొరపడుపడుతున్నా నా? నిజంగా అతను నాతో చదివివుండకపోతే అంత క్లోజ్‌గా ఎలామాట్లాడతాడు?

"అవునూ! టెంత్‌లో మన క్లాస్‌మేటు సుబ్బలక్ష్మి వుండేది గుర్తుందా? మెల్లకన్నూ, పిలకజడతో



## గడుసులోకం —బాబు







వుండేది. ఎలా మరిచిపోతావులే....అప్పుడు మనం బాగా ఏడిపించేవాళ్ళం. వాళ్ళమ్మాయికి పురుడు పోయించడానికి హాస్పిటల్‌కి తీసుకొచ్చింది. నేనూ కాస్త వంట్లో బాగుండకపోతే హాస్పిటల్‌కి వెళ్లాన్లే. ముసలమ్మలా అయిపోయింది. మనమింకా కుర్రాళ్ళలాగా వున్నాము. నేనే గుర్తుపట్టి పలకరించాను. నీగురించి కూడా అడిగింది" అంటూ ఆపాడు.

ఎంత తలబద్దలు కొట్టుకున్నా ఆ సుబ్బులక్ష్మి, ఈ బ్రహ్మం ఎవరో గుర్తు రావడంలేదు. నువ్వెవ్రో తెలీదు, పొమ్మందామంటే సభ్యతగా వుండదేమో. చుట్టూ చాలామంది కూడా ఉన్నారు. సర్లే ఎవరయితే ఏంలే బస్సు వస్తే పోవచ్చును కదా అని అతనేం చెపుతున్నా వింటున్నాను.

ఇంతలో బస్సు రానే వచ్చింది. బస్సెక్కాను. అతను కూడా నాతోపాటే ఎక్కి నా ప్రక్కనే కూర్చున్నాడు.

'యిదెక్కడి జిడ్డురా బాబూ ఈ బోరు బస్ దిగే వరకూ తప్పదన్నమాట' కండక్టరు వచ్చాడు టికెట్స్ తీసుకోమంటూ.

నేను అయిదు రూపాయల నోటు తీసి నా టికెట్ తీసుకోబోయాను.

"అదేంట్రా చాలా కాలానికి కలిశాం. నువ్వు తియ్యడం ఏమిటి నేను తీస్తానుండు" అంటూ అతనొక అయిదు రూపాయల నోటు తీసి యివ్వబోయాడు.

నేనతన్ని వారించి నేను తీస్తానన్నాను. వీల్లేదంటూ అతను నా చేతిని పట్టుకున్నాడు.

"ఎవరో యివ్వండిసార్" అన్నాడు కండక్టరు.

నేను నా చేతిని విడిపించుకుని నోటుని కండక్టరు చేతిలో పెట్టబోయేసరికి అతను ముందే కండక్టరుకు నోటుని చూపించి అతని క్యాష్‌బ్యాగ్‌లో పెట్టేసి "అమలాపురం - రెండు టికెట్లియ్యి" అన్నాడు.

## స్నేహితుడు

కండక్టరు నవ్వుతూ టికెట్లు పంచ్‌చేసి వాటితోపాటు ఒకరూపాయి అతని చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు.

ఇంతకీ యితనెవరో అంతుబట్టడంలేదు. నేనెవరో తెలియకుండా నాకు టికెట్ ఎందుకు తీస్తాడు. ఎప్పుడో నాకు క్లాస్‌మేటు అయ్యేవుంటాడు. నేనే పొరపాటుపడ్డానేమో. నా మతిమరుపుకు తిట్టుకున్నాను.

అరగంటలో అమలాపురం చేరుకున్నాము.

ఇద్దరం బస్ దిగాం. మమ్మల్ని దించి బస్ ముందుకు వెళ్ళిపోయింది.

"సార్! నా ప్రవర్తన మిమ్మల్ని చాలా ఆశ్చర్యపరిచింది కదూ" అన్నాడు. అతనివంక ఆశ్చర్యంగా చూసాను.

"అంత చనువుగా ప్రవర్తించినందుకు క్షమించండిసార్. నిజంగా మీరెవరో నాకు తెలీదు. నేను మీతో చదవలేదు. మీరు నా స్నేహితులు కారు. అయితే స్నేహితుడనేవాడు ఆపదలో ఆదుకుంటాడట. మీరు నిజంగా నాకు స్నేహితులుకాకపోయినా నన్నాదుకున్నారు"

'నేనా!!!"

"అవున్సార్. నేను మధ్యాహ్నం హోటల్లో భోజనంచేసి నాదగ్గరున్న పదిరూపాయలనోటుని హోటలువాడికిస్తే వాడు మారని అయిదురూపాయల నోటుని నాకు అంటగట్టాడు. నేనప్పుడు చూసుకోలేదు. తర్వాత చూసుకుని వెళ్ళి అడిగితే దాన్ని తనివ్వలేదు పొమ్మన్నాడు. యింతకుముందొక బస్ ఎక్కాను. కండక్టరు అది మారదు యింకోనోటివ్వమన్నాడు. నాదగ్గరింక డబ్బుల్లేక బస్ దిగిపోయాను. తర్వాత మీరు దేవుళ్లా కనపడ్డారు. మీ స్నేహితుడిలా నటించి కండక్టరు బ్యాగ్‌లో ఆ నోటుని పెట్టేసాను. మనిద్దరం నిజంగా స్నేహితులమని, టికెట్స్ తీయడానికి పోట్లాడుకుంటున్నామనుకుని ఆ నోటిలాంటిదో చూడకుండానే టిక్కెట్లిచ్చేసాడు."

నే నతనివంక ఆశ్చర్యంగా నోరావలించి చూస్తున్నాను.

"నేనతన్ని మోసంచేశానని బాధపడటంలేదుసార్. ఎందుకంటే హోటలువాడు నాకంటగట్టినట్లే ఈ కండక్టరు కూడా ఎవరికో అంటగట్టేస్తాడు. అదలా చేతులు మారుతూనేవుంటుంది."

అతని తెలివితేటలకు నాకు మతిపోయింది.

"సార్! మళ్ళీ నేనువెనక్కి పోవాలంటే నాదగ్గర ఒక రూపాయేవుంది. మీ టిక్కెట్ డబ్బులు రెండు రూపాయలు యిస్తే నేను పని చూసుకుని తిరిగిపోగలను" అన్నాడతను. అలా అడిగినందుకు సిగ్గుపడుతున్నట్టు తల వంచుకున్నాడు.

నేను రెండు రూపాయలు తీసి అతనికిచ్చాను.

"నమస్కారం సార్" అని చెప్పి వెళ్ళిపోతున్న అతనివంక చూస్తూ వుండిపోయాను. □

### మనుగడ

ఆశ అమృతమై
మనిషిని బ్రతికించి,
ముందుకు నడిపిస్తుంది.
దురాశ గరళమై
మనిషి అంతు చూసేదాకా,
వదిలిపెట్టదు.
ఆశ దురాశల మధ్య
భేదం గ్రహిస్తేనే
మనిషి మనుగడ భద్రం.

– సూర్యదేవర జోగేశ్వరరావు

పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## "అమ్మా! ఒక్కసారి రా అమ్మా...."

అర్ధరాత్రి.

ఆ పాడుబడిన భవనంలో ఒక మూలన పడుక్కున్న సూరిగాడు వెక్కివెక్కి ఏడుస్తున్నాడు నిద్ర పట్టక అటూ ఇటూ దొర్లుతున్న వరహాలు తాత చెవిన పడింది ఆ ఏడుపు. ఆ పాడుపడిన హాలులో సూరిగాడి ఈడువాళ్ళే చాలామంది పిల్లలు పడుకున్నారు. అందువల్లే ఆ ఏడుస్తున్నది ఎవరో అర్థం కాలేదు వరహాలు తాతకి.

"ఎవుర్రా అది? ఏంటా ఏడుపు?"

సూరిగాడి దగ్గర నుంచి సమాధానం రాలేదు కానీ ఏడుపు మాత్రం ఆగలేదు. ఉదయం నుంచీ సూరిగాడి మనసు మనసులో లేదు. ఎన్నాళ్ళ నుంచో సూరిగాడు 'అమ్మ' గురించి ఆలోచిస్తున్నాడు. అమ్మ ఎలా ఉంటుంది? తననెలా చూస్తుంది? ఉదయం కాన్వెంట్ స్కూల్లో తను చూసిన దృశ్యం గుర్తొచ్చింది. ఒకావిడ, చిన్న పిల్లాణ్ణి ఎత్తుకుని నవ్వుతూ, లాలిస్తూ స్కూలుకి తీసుకెళుతోంది. ఆ పిల్లాడి స్థానంలో తనని ఊహించుకున్నాడు. అంతేకాదు. ఆవిడ దగ్గరికి వెళ్ళి "ఏమండీ! ఒకసారి నన్ను కూడా అలా ఎత్తుకోండీ" అనడిగాడు. "ఈడియట్. అడుక్కునే వెధవ్వి, నీకింత అలుసేమిట్రా" అని కోపంగా వెళ్ళిపోయింది. ఏం? ఆవిడ ఆ పిల్లాడికేనా అమ్మ? తననొకసారి ఎత్తుకుంటే ఏం పోతుంది? వరహాలు తాతని ఎప్పుడు అమ్మ గురించి అడిగినా మిగతా పిల్లల్ని చూపించి వాళ్ళలో ఎవరో ఒకరిని మీ అమ్మ అనుకోరా అంటాడు. అసలు తనకు అమ్మ అంటూ ఉందా? ఉంటే రాదేమి? తనింతలా ఏడుస్తున్నా ఒకసారి వచ్చి ఎత్తుకోదేమి?

ఆ వూహకి మళ్ళీ ఏడుపు తన్నుకొచ్చింది.

"అమ్మా! ఒకసారి రా అమ్మా!" ఏడుస్తూ బయటకే అనేసాడు ఆ మాటల్ని.

"సూరిగా! ఏటిరా ఆ ఏడుపు? అమ్మా లేదు, బామ్మా లేదు, పడుకోవో" కసిరాడు వరహాలు తాత.

"వరహాలు తాతా! ఒకసారి మా అమ్మని చూపించు తాతా! ఒకసారి తాతా!" జాలిగా అడిగాడు సూరిగాడు.

"ఒరే సూరిగా! అందరికీ 'అమ్మ'లు ఉంద్రా! నీకు కూడా అమ్మ లేదనుకోరా" వరహాలు తాత చెప్పింది నిజమే. ఎవరో వయసులో ఉన్న వాళ్ళు తమ కామం తీర్చుకుని, ఆ పాప ఫలితమైన సూరిగాడ్ని ఒక కోవెల గట్టు మీద వదిలేసి వెళ్ళిపోయారు. దిక్కూ మొక్కూ లేని పిల్లల్ని చేరదీసి వాళ్ళ చేత బిచ్చమెత్తించడమే వృత్తిగా గల వరహాలు తాత సూరిగాడ్ని కూడా చేరదీసాడు. పదిసార్లు అమ్మ కావాలని సూరిగాడు ఏడిస్తే అతడు మాత్రం ఎక్కడ నుంచి తేగలడు?



సూరిగాడు ఇంకా ఏడుపు ఆపలేదు. మళ్ళీ వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు ఈ



సారి స్వరం కాస్త పెంచాడు.

"నిజం చెప్తేస్తున్నారా సూరిగా! ఎర్ర చీర కట్టుకునుంటుంది చూడు. అదేరా మీ అమ్మ" ఆ రాత్రి సూరిగాడి చేత ఏడుపు ఆపించాలంటే, అంత కంటే మరేం చెప్పాలో తెలియక అబద్ధం చెప్పాడు వరహాలు తాత.

ఆ మాటని పదే పదే తలుచుకుంటూ, ప్రశాంతంగా నిద్రపోయాడు సూరిగాడు.

మరునాడు రైల్వేస్టేషన్లో అడుక్కుంటున్న సూరిగాడి కళ్ళు ఆనందంతో మెరిసాయి. అందుకు కారణం, అప్పుడే ప్లాట్‌పారం మీద నుంచి కదలబోతున్న ట్రైన్ కిటికీలోంచి రెపరెపలాడుతూ కనిపించింది ఎర్ర చీర కొంగు. చాలా దూరంగాఉంది ఆ పెట్టె. ఎక్కు పెట్టిన బాణంలా రివ్వున ఆ దిక్కుకేసి పరుగుతీసాడు సూరిగాడు. జనాన్ని తప్పించుకుంటూ పరిగెత్తడం కష్టంగా ఉంది వాడికి. రైలు అప్పటికే వేగం పుంజుకుంటోంది. సూరిగాడు బాగా వెనకబడిపోతున్నాడు. అంత దగ్గరలో నున్న అమ్మని అందుకోలేక పోతున్నాననే బాధ అలసటని కూడా తెలియనీయలేదు. తప్పించుకుని, తోసుకుని, చిన్న చిన్న పెట్టెలు, సామాన్లు దాటుకుని పరుగెత్తసాగాడు. సూరిగాడు ప్లాట్‌ఫారం చివరకి చేరుకునేసరికి ఆ పెట్టె ప్లాట్‌ఫారమ్‌ని దాటేసింది. అయినా పరుగు ఆపలేదు సూరిగాడు. పట్టాల పక్కగా, కంకరరాళ్ళ మీదుగా పరుగు తీస్తూ వేగం పెంచాడు. క్రమేపి ఆ పెట్టెకి, సూరిగాడికి దూరం తగ్గుతోంది.

"అమ్మా, అమ్మా" అని అరుస్తూనే పరుగుతీస్తున్నాడు. చాలా దగ్గరికి వచ్చేసాడు. చేయి జాపి ఆ కొంగుని అందుకుందామని చేయి జాపాడు. కానీ అందలేదు. పరిగెడుతూనే మళ్ళీ చేయి జాపాడు. ఈ సారి అందింది. మరుక్షణం సూరిగాణ్ణి ఎవరో బలంగా గుంజినట్టయింది. చేయి పట్టు తప్పింది. కాలి అడుగు పడరాని చోట పడింది. ఒక్క క్షణం. అంతా నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ వచ్చిందో భయంకరమైన కేక.

"అమ్మా"

రైలు కిందపడిన సూరిగాడు నుజ్జు నుజ్జయిపోయాడు.

ఆరేళ్ళయినా నిండని ఆ చిన్నారి జీవితం, ఆ ఆఖరి కేకతో అంతమయి పోయింది.

—సోమయాజుల సాయిప్రసాద్,
విజయనగరం

* * *

## బాలల భవిష్యత్తు బంగారుబాట కావాలి

మన దేశంలో ముఖ్యంగా బాలల స్థితి దయనీయంగా ఉండడానికి కారణం దరిద్రం, ఆకలి, అధిక సంతానం, నిరక్షరాస్యత. చాలా మంది మనలో కూలీనాలీ చేసుకునే వారు కావడంతో కుటుంబ నియంత్రణ అంతగా పాటించరు. ఎక్కువ మంది పిల్లలుండుట చేత ఇల్లు గడవక, వారు తెచ్చే డబ్బుల కాశపడి, ఎక్కడో అక్కడ ముక్కు పచ్చలారని పిల్లలను పనిలో పెట్టడం చేస్తారు. పిల్లలు

"ఎక్స్‌ప్లాయిటర్" ఎవరంటావేం టర్రా! మన లెక్కల మాష్టారు నిన్న హెడ్మాష్టర్ చేత చీవాట్లు తిన్నట్టు! హ్హ..హ్హ హ్హ...

కష్టపడి తెచ్చే డబ్బులతో కూడా త్రాగే మహానుభావులున్నారు.

కొంత మంది ఇళ్ళలో పిల్లలను స్కూళ్ళకు పంపినా వారు క్రమబద్ధంగా స్కూలుకు వెళుతున్నారా లేదా! పట్టించుకోరు. పరీక్ష ఫెయిలయితే మాత్రం చీవాట్లు వేస్తారు.

ఇంకా కొంత మంది రకరకాల చెడు పుస్తకాలు పెద్దవాళ్ళు చదువుతూ ఉంటే అదే గొప్ప సాహిత్య మనుకొని పిల్లలూ చదువుతూ ఉంటారు. వారిని చదవొద్దని మందలిస్తారే గాని పెద్దలు మాత్రము ఆ పని మానరు. అందువల్ల పిన్నలు దొంగతనంగా చదివే అవకాశ ముంటుంది.

ధనికులలో చాలా మంది పిల్లలు అడిగినప్పుడల్లా వారికి కావలసిన ధనమిస్తారే తప్ప వారి గురించి పట్టించుకోరు. అటువంటి వారు విచ్చలవిడిగా ధనము ఖర్చు చేస్తూ స్కూల్లో ఉపాధ్యాయులకి పేరు పెడుతూ తమ గొప్పతనము ప్రదర్శిస్తుంటారు. ఇటువంటి వారు 15 సంవత్సరములు వచ్చే సరికే మాదక ద్రవ్యాలకు కూడా బానిస లౌతున్నారంటే ఆశ్చర్యపడక్కరలేదు.

కొందరి ఇళ్ళలో ఎప్పుడూ గొడవలు, తల్లిదండ్రుల కీచులాటలు, ఇలాటివి జరుగుతూ ఉంటే పసివాళ్ళ మనసులు విరిగి పోతాయి. వీరు ఇంటి నుంచి పారిపోవడం కూడా కద్దు. ఇటువంటి వారే పెద్దయాక, దొంగలుగా, స్మగ్లర్లుగా మారతారు.

పిల్లల మనసులు పూవులతో సమానమంటారు. ఇంట్లో తల్లిదండ్రులు, స్కూల్లో ఉపాధ్యాయుడు కూడా ఎల్లప్పుడూ వారిని మంచి మార్గంలోనే పెట్టాలి. చదువుతో పాటు, వారికి మంచి బాలల సాహిత్యం చదివించాలి. దేశ నాయకుల, మహావీరుల చరిత్రలు చెప్పాలి. తగినంత స్వేచ్ఛ ఇవ్వాలి.

తల్లితండ్రులు మిత సంతానము కని, వారిని ఉత్తమ భావి పౌరులుగా తీర్చిదిద్దాలి. కొన్ని వేళలలో తమ స్వసుఖాలను కూడా వీరు త్యాగం చేయవలసి వస్తుంది.

మన ప్రభుత్వం, స్వచ్ఛంద సేవా సంస్థలు కూడా పిల్లల విషయంపై ఎక్కువ శ్రద్ధ చూపించాలి. పాఠశాలలో చదువుతో పాటు, వృత్తి విద్యలు తప్పనిసరిగా నేర్పించాలి. వీరి ఆరోగ్య విషయమునకై ప్రత్యేక సదుపాయాలు చేయాలి. ముఖ్యంగా పిల్లలకు అందజేస్తున్న ఉచిత పాఠ్య పుస్తకాలు, బట్టలు వారికి సరిగ్గా అందక మధ్యవర్తులు కాజేస్తున్నారు. ఈ విషయమై ప్రభుత్వం, సరియైన కట్టుదిట్టం చేయాలి. ఇవన్నీ జరిగిన నాడు మనదేశంలో పిల్లల భవిష్యత్తు బంగారు బాట ఔతుంది.

–శ్రీమతి డి. విజయలక్ష్మి
ఎన్. ఎస్. సి. ఫామ్,
నందికొట్కూరు

* * *

# "నేరం వారిది కాదు;మనదే!"

"బ్లూ ఫిలించే ప్రభావితుడై "రేప్" చేసిన 15 సం.ల బాలుడు" అన్న వార్త పత్రికలలో చూసాము. తన పాఠ్య పుస్తకంచే ప్రభావితుడై "కిడ్నాప్" చేయగలిగిన 9వ తరగతి విద్యార్థి చరిత్రను పత్రికల్లో చదివాం. భరత మాత ముద్దు బిడ్డలు ఇలా మారుతున్నారు అంటే మన బాధ్యత లేదా? ఉంది. 14 సం. లోపు వయస్సు గల పసివారిచే కష్టతరమైన పనులు చేయించరాదని మన రాజ్యాంగం ఘోషిస్తుంది. కాని నేటికీ గనుల్లో, కార్ఖానాల్లో ఒకటేమిటి అన్నిరకాల వ్యాపార రంగాల్లోను మనకు బాల కార్మికులు దర్శన మిస్తున్నారు. దీనికి బాధ్యులు మరెవ్వరో కాదు సుమా మనమే!

పిల్లల భవిష్యత్ అంతా తల్లి దండ్రుల పెంపకం పైనే ఆధారపడి ఉంటుంది. అందుకే వారిని మాతృ, పితృ దేవతలుగా మన పురాణాలు ఉటంకిస్తున్నాయి. కాని దురదృష్టవశాత్తు నేడు చాలా మంది తల్లి దండ్రులు తమ తొలి సంతానంపై చూపే శ్రద్ధను మలి సంతానంపై చూపడం లేదు. పిల్లల పెంపకం ఏదో మొక్కుబడి కాదు తమ బాధ్యత అని చాలా మంది గుర్తించరు. పిల్లల ముందే ధూమపానం, మద్యపానం, పేకాట వంటి వ్యసనాలలో మునిగి తేలుతుంటారు. మరి కొందరు తల్లి దండ్రులు, భార్యా భర్తల కీచులాటలు పసివారిపై తీవ్ర ప్రభావాన్ని కల్గిస్తాయని గుర్తించని పెద్దలు పిల్లల ముందే ఘర్షణ పడుతుంటారు. వివిధ సందర్భాలలో పసివారి ముందే బూతు సంభాషణలకు దిగుతుంటారు. "ఫలానా పని చేస్తే – పావలా; ఫలానా పని చేస్తే అర్థ" అని రేట్లు నిర్ణయించి బాల్యం నుంచే లంచాలకు పసివారిని అలవాటు పడేలా చేస్తుంటారు. యిలా చెప్పుకుంటూ పోతే తల్లిదండ్రులు తమకు తెలియకుండానే తమ పిల్లలకు చేసే హాని గురించి ఎంతైనా చెప్ప వచ్చును. యివన్నీ సున్నితమైన సమస్యలు. కాని ఖచ్చితంగా పసివారి ప్రవర్తనపై ప్రభావాన్ని చూపుతాయన్నది అక్షరాల నిజం! కనుక తల్లి దండ్రులూ! తస్మాత్ జాగ్రత్త!! మీ

మా అమ్మానాన్నలకి మా అన్నయ్యమీదున్న ప్రేమ నామీద లేదురా! ప్చ్...

పిల్లల భవిష్యత్ నిర్దేశకులు మీరే!!!

కారణాలు ఏమైనప్పటికి ఎవరో చేసిన పాపానికి అనాథలుగా నిల్చిపోయిన అభాగ్యులు ఎందరో! యిలాంటి వారి సంరక్షణకు ప్రభుత్వము, వివిధ సంస్థలు, అనాథశరణాలయాలు విరివిగా స్థాపించాలి. అనాథలకు కావల్సింది పిడికెడు సానుభూతి కాదు, చిటికెడు ప్రేమ అని గమనించాలి. తెలిసో తెలియకో నేర ప్రవత్తిని ఏర్పరచుకున్న రేపటి పౌరులను సంస్కరించేందుకు జైళ్ళు ఉన్నాయి. ముందుగా వీటిని సంస్కరించాలి. యిలాంటి పిల్లలను పూర్తిగా మనస్తత్వవేత్తల ఆధీనంలో ఉంచాలి. మామూలు నేరస్థుల్లా చూడకూడదు. పసి వారి మెదడును కలుషితం చేసే క్షుద్ర, క్రైం, సెక్స్ సాహిత్యాన్ని, సినిమాలను పూర్తిగా నిషేధించాలి. పాఠ్య పుస్తకాలను సైతం మార్చవలసిన తరుణం ఆసన్న మైంది. పిల్లలకు మానసిక, ఆత్మ విశ్వాసాన్ని కల్గించ డంలో నేటి మన చదువులు పూర్తిగా విఫల మయ్యాయి. దీనిపై ముందుగా శ్రద్ధ వహించాలి. ప్రపంచ వ్యాప్తంగా పౌష్టికాహారం లోపం వల్ల రోజుకు 40,000 మంది పిల్లలు మృత్యువాత పడుతున్నారని "యునిసెఫ్" వెల్లడించింది. కనుక ప్రజ లందరూ పసి వారిపై మరింతగా తమ దృష్టిని మళ్ళించాలి. యిందుకు తల్లి దండ్రులు, ప్రభుత్వం, ప్రజలు అందరూ తమ వంతు కర్తవ్యం నిర్వహించాలి. అప్పుడే "నేటి బాలలు– రేపటి పౌరులు"గా ప్రకాశించ గల్గుతారు.

– సయ్యద్ ఖుర్షీద్,
మహబూబాబాద్.□

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు :.................................
పూర్తి చిరునామా :.................................
.................................
.................................
పిన్ కోడ్

# అడగని ప్రశ్న

## కె. గోదావరిశర్మ

గది నిండా చీకట్లు కమ్ముకుంటున్నా లేచి లైటు వెయ్యడానికి బద్ధకించి అలా పడుకునే ఉండిపోయాడు భీమేశ్వరరావు. బయట వాతావరణం లాగే మనసు కూడా స్తబ్ధంగా, జడంగా ఉంది.

తలుపు మీద చేతి వేళ్ల కణుపులతో టక్ టక్‌మని శబ్దం చేస్తూ 'జైభీమ్' అని పిలిచేడు కుమారస్వామి. శుద్ధ శ్రోత్రియుడైన భీమేశ్వరరావుని 'జై భీమ్' అని పలకరించడం కుమారస్వామికి సరదా.

లేచి లుంగీ సర్దుకుని లైటు వేసి తలుపు తీశాడు భీమేశ్వరరావు.

"ఈ సమయంలో లేవ్‌లో ఉంటావనుకున్నాను. రూమ్‌లోనే ఉన్నావేం?" అన్నాడు కుమారస్వామి లోపలికొస్తూ. లేవ్ అంటే లేవెటరీ కాదు, లెవొరేటరీ. అప్పుడప్పుడు మాటల్లోని బకారాలని వకారాలుగా మార్చి అన్– బెంగాలీగా మాట్లాడడం కుమారస్వామికి సరదా. ఆ సూత్రం ప్రకారం లేబొరేటరీ లేవొరేటరీ అయి, లేవ్ అని సంక్షిప్తీకరించబడింది. ఏదైనా పెద్దగా తేడా లేదు కదా అని అతడి వివరణ.

"లేబ్ కెళ్లాలనిపించలేదు. బోర్‌గా ఉంది" అన్నాడు భీమేశ్వరరావు, మళ్లీ మంచం మీద వాలుతూ.

"రెస్ట్ కోసం ఇంటికెళ్లిన వాడివి రెండు రోజుల్లోనే బూమ్‌రేంగ్ అయ్యేవు! ఏమయినా విశేషమా, ఇంట–రెస్ట్ లేకా?" మిత్రుణ్ణి నిశితంగా పరిశీలిస్తూ అడిగేడు కుమారస్వామి.

"విశేషమూలేదు పాడూ లేదు. ఆ ఊరు, ఆ ఇల్లు, ఆ మనుషులు – ఎన్నేళ్లయినా అంతే! అక్కడ సామాన్యాలే గాని విశేషాలు ఉండవు. నిన్న రాత్రే వచ్చేశాను" అన్నాడు భీమేశ్వరరావు విసుగ్గా. ఈ మాటలు చెపుతున్న సమయంలోనే టేబుల్ మీది పుస్తకం ఒకటి తీసి పేజీలు తిరగేసి మళ్లీ అక్కడే పడేశాడు విసుగ్గా.

"నిన్న రాత్రే వచ్చేశావని ఉదయం తెలిసిందిలే. మీ కొలీగ్ లేడూ – బొద్దింక మీసాలు వాడు – వాడు చెప్పేడు పోనీ, వచ్చేశావు. మంచి పని చేశావులేగానీ, లే! బి ఎ మేన్! మేన్! అలా నిరాశగా, నిర్లిప్తంగా, నిస్పృహగా, నిస్తేజంగా, నిక్రృష్టంగా – నో, నో, సారీ నిక్రృష్టంగా ఇక్కడ వాడకూడదు– ని ... ని ... నిర్జీవంగా అలా పడి వుండడం ఏం బావోలేదు. లే. పద!" అని ఉత్సాహపరిచాడు కుమారస్వామి, "అలా బీచ్‌కి పోయి కాస్త హవాఖానా చేద్దాం".

నిర్జీవంగానే ఓ నవ్వు నవ్వేడు భీమేశ్వరరావు. "హవాఖానాయే చెయ్యాలిలే. ఇంకేం తినడానికీ ఇంకేం డబ్బుల్లేవు" అన్నాడు లేచే ప్రయత్నం చెయ్యకుండా.

"డబ్బుదేముందోయ్, కుక్కని కొడితే రాలుతుంది" అన్నాడు కుమారస్వామి తేలిగ్గా.

"ఏదీ పద. ఓ కుక్కని కొట్టి చూద్దాం! ఏం రాలుతుందో! అప్పుడు మనం హవాఖానాకి బదులు దవాఖానాకి వెళ్లాలి." స్వామి సన్నిధిలో నిరాశాజనకుడికి కూడా ఆశ కలగకపోయినా హాస్యం పుడుతుందేమో!

"ఈవేళ ఉదయమే కొట్టేనోయ్– కుక్కని కాదు గాని, మా కుక్కుని– వంద రాలింది" ఉత్సాహంగా చెప్పేడు కుమారస్వామి.

"కుక్కునా? చివరికి-మీ వంటావిడ దగ్గర కూడా అప్పులు చేస్తున్నావన్నమాట!"

"కుక్కు అనగా వంటమనిషి కాదు నాయనా! అసలు మా వంటమనిషి పని మానేసి వారం రోజులైంది. ప్రస్తుతం ఇంటావిడే వంటావిడ. ఆవిడ తాళింపు డబ్బాలోంచి వంద రూపాయలు రాలితే ఇంకేం కావాలి?– ఇంతకీ, కుక్కు అనగా ప్రొఫెసర్ ఎస్కే రావ్ అనబడే మా కుక్కుటేశ్వరరావు. అది అతని కరంట్ పెట్ నేమ్. ఉదయం కనిపిస్తే ఎందుకైనా మంచిదని ఎప్పుడూ లేనిది వందనం చేసేను. 'వంద' అన్నాను, 'నమ్ములు' అనకుండా నీళ్లు నములుతూ, ఆనందాశ్చర్యాలతో చూస్తూ, 'ఇంద' అని తీసి ఇచ్చాడు. పుచ్చుగు చక్కా వచ్చాను. 'థాంక్స్ ఫర్ యువర్ బొంద' అని బెంగాలీగా అనుకుంటూ".

"అందులో – ఆ వందలో – ఇప్పుడెంత మిగిలింది?" ఆశకి ఊపిరి పోస్తూ అడిగాడు భీమేశ్వరరావు.

కుమారస్వామి జేబులోంచి విలాసంగా ఖడక్ నోటు తీసి దానిమీద వేళ్లతో (చిరిగిపోకుండా జాగ్రత్తగా) కొడుతూ, "ఆసచర్యం! ఆసచర్యం!" అన్నాడు.

ఎడమ చేత్తో ఆ నోటూ కుడి చేత్తో హేంగర్‌కున్న తన చొక్కా అందుకుని మొదటి దాన్ని రెండో దాంట్లో భద్రపరిచేడు భీమేశ్వరరావు.

"అన్నన్యాయం! అన్నన్యాయం!" అని హాహాకారాలు చేస్తూ గోలపెట్టేడు కుమారస్వామి.

"అయినా ఇదేం పనోయ్. కుక్కుని కొట్టి తెచ్చుకున్నది డేగ తన్నుకుపోయినట్టు ..." అని మొసలి కన్నీరు కార్చేడు.

భీమేశ్వరరావు లేచి షర్టు శరీరానికి ఎక్కించి, జేబులోంచి గుండెలోకి బలాన్ని పీల్చుకున్నాడు.

"అయినాగాని ఇంటికెళ్లిన వాడివి పాతికో, పరకో తెచ్చుకోకుండా వచ్చేశావేం?" అన్నాడు కుమారస్వామి. దృష్టి అతడి జేబుమీదే నిలిపి.

"వచ్చేటప్పుడు మూడ్ బాగాలేదు. వాళ్లని అడగాలనిపించలేదు" అన్నాడు భీమేశ్వరరావు. మళ్లీ సీరియస్‌గా అయిపోతూ.

"వాళ్లు అనగా ఎవరోయ్? మీ నాన్నే కద? లక్షలాది రూపాయలు సంపాదించి పల్లెటూళ్లో కూర్చున్నాడు కద! యూనివర్సిటీలో రిసెర్చి చేస్తున్న కొడుకు ఇంటికి వచ్చి వెళుతున్నప్పుడు వందో యాభయ్యో ఇవ్వాలని తోచదూ?"

"తోచదు. అదే మా వాళ్ల ప్రత్యేకత. నాకేం, తెలివైనవాణ్ణి, ఎలాగైనా బతికేస్తాను. పాపం, మా అన్నే. వెర్రిబాగులవాడు. ఈ మధ్య మళ్లీ తులంన్నర వెంకటేశ్వరస్వామి ఉంగరం చేయించుకున్నాడు నాలుగో వేలికి. మా నాన్నే ముచ్చటపడి చేయించేడుట ..."

"మీ అన్న అంటే మీ ఊళ్లో ఎల్. ఐ సీ ... ఆ అన్నేనా?"

"ఆఁ! ఉన్నదే ఒక్క అన్న!"

"ఐసీ! కారణం ఏమిటంటావ్?"

"కారణం ఏమిటి? మా అన్న తరవాత నేనే పుట్టేను. మధ్యలో ఇంకెవరూ లేరు. అంచేత నాకు ఒక్కడే అన్న –"

"ఛ ఛ! అది కాదోయ్! మీ నాన్న, మీ అన్నపట్ల ఆ విధంగా, నీపట్ల ఈ విధంగా ప్రవర్తించడానికి కారణం ఏమిటీ అని అడుగుతున్నాను".

"అదా! ఏముంది? మొదటి నుంచీ మా అన్న బుద్ధిమంతుడు. అంటే చెప్పిన మాట విని గంగిరెద్దులా తల ఊపుతాడు. నాకు బుర్ర తిరుగుడు. ఎందుకంటే వాళ్లు చెప్పినది తప్పో రైటో, మంచో చెడో ఆలోచిస్తాను నేను ..."

"ఇకనేం? తాళం వెయ్–"

"మా నాన్న మాటకా?"

"ఛ ఛ కాదోయ్. రూమ్‌కి. బయటికి వెళుతున్నాం కదా" టేబుల్‌మీద తాళం కప్ప, చెవి తీసి మిత్రుడికి అందించేడు కుమారస్వామి.

ఇద్దరూ హాస్టల్ విడిచి రోడ్డున పడ్డారు.

"సరేగాని నీ జేబులో ఉన్న ఆ శతమానం మార్చి నా మొహాన ఓ ఎనభై పడేసి మిగతాదంతా నువ్వే ఉంచుకో" నిష్పత్తి నిరుకు చేసుకున్నాడు కుమారస్వామి.

"సరే" నవ్వేడు భీమేశ్వరరావు.

* * * * * * *

ఓ దశాబ్దం కిందట భీమేశ్వరరావు, కుమారస్వామి తొమ్మిది, పది తరగతులు చదువుతూ ఉండేవారు. ఇద్దరిదీ ఒకే ఊరు కాకపోవడం వల్ల ఇద్దరికీ పరిచయం లేదు. కుమారస్వామి టెన్త్ పరీక్ష తప్పి, పునాది దిట్టం చేసుకొని, భీమేశ్వరరావుతో సమాన ఫాయాకి వచ్చాడు. **అయిదేళ్ల తరువాత ఇద్దరూ** యూనివర్శిటీలో వేర్వేరు డిపార్టుమెంట్లలో ఎం.ఎస్‌సి. కోర్సులో చేరేరు. అదయ్యాక రిసెర్చిలో చేరేరు. నాలుగేళ్లపాటు హాస్టల్స్‌లో రూమ్‌మేట్స్‌గా గడపడంవల్ల వాళ్ల స్నేహం కలిసి, బలిసింది.

భీమేశ్వరరావు తెలివైనవాడు. శాంత గంభీరుడు. కుమారస్వామికి చదువులో శ్రద్ధ తక్కువైనా చురుకైనవాడు, మంచివాడు. లోకజ్ఞానం చాలా ఉంది. ఎక్స్‌ట్రా కరికులర్ ఏక్టివిటీస్ ఎక్కువ. అతడు గత సంవత్సరమే యూనివర్సిటీలో లెక్చరరు అయ్యాడు. థీసిస్ సబ్మిట్ చెయ్యగానే లెక్చరర్ కావడం అదృష్టమే అన్నారు తెలియనివాళ్ళు. తెలిసిన వాళ్ళకి అది అ–దృష్టం కాదు, దృష్టమే.

**భీమేశ్వరరావు ఇంకా రిసెర్చి స్కాలర్‌గానే** ఉన్నాడు. అతని డిపార్ట్‌మెంటులోనూ, యూనివర్సిటీలోనూ అతని కులస్థులెవరూ పని కొచ్చే పదవుల్లో లేరు. అంచేత ఇంకా కొన్నేళ్ళు అతడు అలాగే ఉండవచ్చు. ఈలోగా కుమారస్వామి రీడరు, ప్రొఫెసర్ కూడా అయిపోవచ్చు. దీనికి కారణం – కిట్టనివాళ్ళు చెప్పేదేమిటంటే – భీమేశ్వరరావు తెలివైనవాడు కావడం, కుమారస్వామి తెలివితేటలు అంతంతమాత్రం కావడమేనని. కాని 'కన్సెర్న్‌డ్' పెద్దల నెవరినైనా కాస్త ప్రైవేట్‌గా కలుసుకుని అడిగితే వాళ్ళు సిన్సియర్‌గా ఇలా అంటారు. "ఛఛ! అదేం లేదండీ! యూనివర్సిటీలో ఉద్యోగాలు, ప్రమోషన్లు మెరిట్ ఉన్నవాళ్ళకి ఇవ్వరని, మెరిట్ లేనివాళ్ళకే ఇస్తారనీ ఒక అపప్రధ ఉంది. అది నిజంకాదు. అసలు యూనివర్సిటీ అపాయింట్‌మెంట్ల విషయంలో మెరిట్ ప్రసక్తే లేదు కదండీ! కేవలం కులం, డబ్బు– అంతే! అంతేకాని, మెరిట్‌ని చిన్న చూపు చూడాలని ఇక్కడేమీ రూల్ లేదండి. అది అబద్ధం!"

ఈ పరిస్థితిని ఎవరూ ఇదేమని ప్రశ్నించరు. ఎదిరించరు. ఇది సహజం. ఇది తప్పదు అన్నట్టు చూస్తూ ఊరుకుంటారు. అస్మదీయులు, ఆశ్రితులు, ఆర్థికులూ తమ పనులు తాము






# అడగని ప్రశ్న

జరిపించుకుంటారు. మిగిలినవాళ్ళు వేణ్ణీళ్ళకి చన్నీళ్ళుగా ఏదో సైడ్ బిజినెస్ చేసుకోవడమో, అన్యాయాన్నీ, అవినీతినీ అంగీకరించి ధృతరాష్ట్రులై జీవించడమో చేస్తారు.

* * * * * * * * * *

"అదికాదోయ్-" అని సంభాషణ కొనసాగించేడు భీమేశ్వరరావు.

ఎదురుగా బెంగాలీ అఖాతం వంగ భాషలోని బౌళ్ గీతాన్ని కోరస్‌లో పాడుతున్నట్టు హోరు పెడుతూంది.

"అసలు మొదటినుంచీ చూస్తున్నాను తెలివి తేటలు, అర్హత ఉన్నవాళ్ళకి అన్యాయం జరగడం, అర్హత లేనివాళ్ళు, తక్కువ లెవెల్‌వాళ్ళూ ఎక్కువ ప్రయోజనం పొందడమూను! ఇలా ఎందుకు జరుగుతూంది?మన యూనివర్సిటీలో అంటే సరే, అంతా కరప్ట్ ఫెలోస్! కాని ఇంట్లో తల్లీ తండ్రీ కూడా అలాగే ప్రవర్తిస్తారేం? అర్హతనిబట్టి ఆదరణ-"

"లేదు. ఎప్పుడూ ఉండదు" అని మధ్యలోనే అతణ్ణి ఆపి ఒప్పుకున్నాడు కుమారస్వామి.

"ఆమధ్య ఓ కవిత చదివాను - "అందమైన నెమలికి అడవుల్లో తిండిలేక మాడే అవయోగం, కురూపి కాకికి పిండాలు తిని బలిసే అదృష్టయోగం'- అని! ఇది ఎక్కడా ఉన్నదే. తల్లిదండ్రుల ప్రేమ పిల్లలందరిమీదా సమానంగా ఉండదు. చెడిపోతున్న పిల్లల్ని గురించి బెంగ పెట్టుకుంటారు గాని బాగుపడుతున్న పిల్లల్ని ప్రోత్సహించరు..."

"ప్రోత్సహించడం కూడానా? నిరుత్సాహపరచి పాడు చేస్తూ ఉంటే!" అన్నాడు భీమేశ్వరరావు, కోపంగా, చిరాగ్గా.

"తప్పదు. వాళ్ళ టైము - ఎనర్జీ, మనీ, రిసోర్సెస్, చివరకి ప్రేమ కూడా పిల్లలందరికీ డిస్ట్రిబ్యూట్ చెయ్యాలి. మంది ఎక్కువైనకొద్దీ మజ్జిగే కాదు, మరేదైనా పలుచబడుతుంది. అందుకే కుటుంబ నియంత్రణో అని ఘోష పెట్టడం! పిల్లలు ఎక్కువయినకొద్దీ వాళ్ళ మధ్య పోటీలు, పోలికలు, తేడాలు, అసూయలు.... సమస్య చాలా కాంప్లెక్స్ అవుతుంది. అలాంటప్పుడు 'వీకర్ సెక్షన్స్'కి సహాయం ఎక్కువ అందుతుంది. పుట్టుకతోటే మానసికంగానో, శారీరకంగానో బలహీనంగా ఉన్నవాళ్ళంటే ఎవరికైనా సానుభూతే కద! 'అంచులేని బిందెని రెండు చేతులతో ఎత్తాలని' సామెత! తెలివి తక్కువ పిల్లల గురించి ఆందోళనపడుతూ తెలివైన పిల్లల్ని అశ్రద్ధ చేస్తారు. "వాడు ఎలాగైనా బతికేస్తాడు. వీడే పాపం ఎలా నెగ్గుకొస్తాడో ఏమో" అంటూంటారు. దీనివల్ల ఏం జరుగుతుందంటే బలహీనులు బాగుపడరు. వాళ్ళకి ఆత్మవిశ్వాసం స్వతంత్రంగా ఆలోచించడం, పనిచెయ్యడం ఎప్పటికీ రాదు. సరికదా, వాళ్ళంటే మిగిలిన పిల్లలకి అసూయ, తల్లిదండ్రులంటే కసి, కోపం పెరుగుతాయి...."

"కరక్ట్. నీ ఎనాలిసిస్ బాగుంది. నా విషయంలో సరిగ్గా అలాగే జరిగింది. మా అన్నకి బుర్ర లేకపోవడమే వాడి క్వాలిఫికేషను కాగా, నా తెలివితేటలే నాకు డిస్ క్వాలిఫికేషను. అయితే మా వాడి దగ్గర ఒకటుంది- కింగ్ లియర్ పెద్ద కూతుళ్ళు ఇద్దరూ చూడు - తండ్రి మెప్పుకోసం ఇచ్చకం మాటలాడతారు! అలా తియ్యగా, డ్రమెటిక్‌గా, సినిమాటిక్‌గా మాట్లాడతాడు. అంటే- మాతృదేవోభవ, పితృదేవోభవ, పెద్దలను గౌరవింపుము - లాంటివి. దాన్తో మావాళ్ళు ఐస్ఐపోతారు. నేనేమో కార్డీలియాలాంటివాడిని. నిజం చెబితే ఎప్పుడూ నిష్ఠూరమేకదా!" నిట్టూర్చేడు భీమేశ్వరరావు.

"మరింకేం? విషయం ఏమిటో సరిగ్గా విశ్లేషణ అయిపోయింది కద? ఇది లోక సహజం. దీన్ని చూసి ఆశ్చర్యపడక్కర్లేదు.' అన్నాడు కుమారస్వామి.

"మన యూనివర్సిటీలో అవకతవకలలాగానా?" కోపంగా అడిగాడు భీమేశ్వరరావు.

"లోకంలో చాలా అన్యాయాలు చాలా కాలంగా జరుగుతున్నాయి అదే మన సంప్రదాయం అని, అలా జరగక తప్పదనీ చాలామంది అనుకోవచ్చు. కాని అది సమర్థనీయం కాదు. తేడా తెలిసినవాళ్ళు దాన్ని ఎదిరించాలి" అన్నాడు.

కుమారస్వామి కొంచెం గిల్టీగా తల గోక్కున్నాడు. "నిజమే అనుకో! కాని మనకి నచ్చినా నచ్చకపోయినా కొన్ని విషయాలని గమనించక తప్పదు. నీలాంటి ఆదర్శ యువకులు ధర్మాధర్మాలు, నీతి – అవినీతులు, న్యాయా న్యాయాల గురించి ఆలోచిస్తారు. ఎందుకంటే మనుషులంతా సమానమే అన్న భావనలో ఉంటారు కనక. కాని చాలామంది పెద్దలకి – వయస్సులోగాని, అధికారంలో గాని, డబ్బులోగాని – ఈ అందరూ సమానమే అన్న భావం మింగుడుపడదు. అది వాళ్ళ పెద్దరికానికి దెబ్బ కదా! అంచేత పెద్దవాళ్ళకి విధేయత ప్రధానం. ఒక ఆఫీసర్ మెప్పు పొందాలంటే సబార్డినేట్ సమర్థుడైతే ఉపయోగం లేదు. విధేయుడై ఉండాలి. అసలు ఆఫీసరు కంటే గుమాస్తా తెలివైనవాడైతే ఆఫీసరు పనిలో తప్పులెంచడూ? అంచేత బాస్ మాటే వేదం. బాస్ తప్పు చేసినా అది రైటన్న సబార్డినేట్లకే మంచి రిమార్కులు, రిపోర్టులు, రివార్డులూను. మరి, అదే సూత్రం ఇంట్లో కూడాను. పిల్లలు తమ మాట వింటున్నంత కాలం పెద్దవాళ్ళు వాళ్ళని వాత్సల్యంతో చూస్తారు. మాట వినకపోయేసరికి వాళ్ళ అహంకారం దెబ్బతింటుంది. ఎంత శిక్ష వెయ్యటానికైనా వెనుదియ్యరు. అప్పుడు అందులోను ఇద్దరు పిల్లలు ఉండి, ఒకరు తమకి విధేయంగా ఉన్నప్పుడు రెండోవాడు తక్కువ విధేయత కనబరిస్తే అది పెద్ద నేరమే. నువ్వేమో మీ నాన్న ఏదైనా అంటే, "అదేమిటి నాన్నా, పెద్దవాడివై ఉండి అలాంటి తప్పు మాట' అంటావు" అన్నావనుకో, మీ నాన్నకి కోపం వచ్చి తీరుతుంది. సహజం.

"సహజం అంటే అది ఆ మనిషి బలహీనత. దానిని మనం ఎందుకు సమర్థించాలి? ముసలాళ్ళు సరే. వాళ్ళకి పెద్దరికమూ అహంకారమే ప్రధానం. పిల్లల నుండి వాళ్ళు ఆశించేది విధేయతే. కాని మా అన్న – ముసలాడు కాదే! మరి వాడికి నీతి, న్యాయం వద్దా? మా నాన్న ఏదంటే దానికి తందానతాన అనడమేనా?"

"అదే లాభసాటి కదా! మీ అన్న వయసులో ముసలాడు కాకపోవచ్చు. కాని 'కొంతమంది కుర్రవాళ్ళు పుట్టుకతో వృద్ధులు' కదా! లేదా అవకాశవాది గాని సంప్రదాయవాది గాని కావచ్చు. రెండూ ప్రమాదమే. పితృ వాక్య పరిపాలన మన సంప్రదాయం కదా! నీలాంటి వాళ్ళు, కార్డీలియాలాంటి వాళ్ళకి జీవితాంతం బాధలు తప్పవు. అదే పరశురాముడి కథ చూడు! తండ్రి తల్లిని చంపమనగానే నిస్సంకోచంగా గొడ్డలితో నరికేశాడు. కన్నతల్లిని! మాతృదేవోభవ అన్న ఈ గడ్డ మీదనే! అయినా పరశురాముడు హీరోనే. పితృ వాక్య పాలనలో శ్రీరాముణ్ణి మించిపోయాడు కద! అదీ కథ! అంచేత సుఖపడదలచుకున్నవాళ్ళు పెద్దల యెడ గౌరవంతో, సంప్రదాయబద్ధులై, న్యాయాన్యాయ విచక్షణ పెట్టుకోకుండా హాయిగా గడుపుతారు". కుమారస్వామి గొంతులో వ్యంగ్యమూ నిజాయితీ ఆశ్చర్యంగా కలిశాయి.

"మరి నువ్వు? నువ్వు ఎటు వైపు?" అని అడగలేదు భీమేశ్వరరావు. అడిగి అతడి స్నేహాన్ని వదులుకోలేక.

మిత్రులిద్దరూ యూనివర్సిటీ కాంపస్‌కేసి తిరుగుముఖం పట్టారు. □






# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

**కె. ప్రసాద్, హైదరాబాదు**

ప్ర : ఒళ్ళంతా నల్లని మచ్చలు.

జ : బైద్యనాథ్ రక్త శోధకబటి 2 మాత్రలు చొప్పున సురక్త స్ప్రాంగుతో ఉదయం సాయంత్రం సేవించండి. బైద్యనాథ్ తువరక తేల్ గానీ సోమరాజీ తేల్ గానీ పై పూతకు వాడండి.

**రాశి, బరంపురం**

ప్ర : తలజుట్టు ఊడిపోకుండా బాగా పెరుగుటకు.

జ : బైద్యనాథ్ మహాభృంగ రాజతేల్ తల నూనెగా ఉపయోగించండి. బైద్యనాథ్ చ్యవన్‌ప్రాశ స్పెషల్ ఉదయం సాయంత్రం పాలతో సేవించండి.

**వై. ఎ. హెచ్. రేణుకుంట (నల్గొండ)**

ప్ర : వీర్య నష్టం, బహుమూత్ర వ్యాధి.

జ : బైద్యనాథ్ విటాఎక్స్ 1 మాత్ర, బైద్యనాథ్ బసంతకుసుమాకర రస 1 మాత్ర, ఉదయం సాయంత్రం పాలతో సేవించండి.

**శేషం యూన్సీరాణి, అనుమంచిపల్లి**

ప్ర : కుడికాలు, కుడిచేయి వణుకుతుంది.

జ : బైద్యనాథ్ విటాఎక్స్ 1 మాత్ర చొప్పున బైద్యనాథ్ సుందరీ కల్పతో ఉదయం సాయంత్రం సేవించండి. బైద్యనాథ్ మహామాష తేల్ వణికే భాగానికి మర్దన చేయండి.

**విజయకుమార్, ఒరిస్సా**

ప్ర : పళ్ళ ఇగుళ్ళు తగ్గిపోయి పండ్ల సందులు ఏర్పడినవి.

జ : బైద్యనాథ్ లిర్ల పండ్లపొడిని పండ్ల పొడిగా వాడండి. బైద్యనాథ్ ఇరిమేదాది తేల్‌తో, మర్దన చేయండి.

**జి. శంకర్, ముప్కాల,**
**వై. కె. రావు, సత్తెనపల్లి,**
**పి. ఉషారాణి, పిడుగురాళ్ళ**

ప్ర : మొఖము మీద నల్లని మచ్చలు, మొటిమలు.

జ : బైద్యనాథ్ రక్తశోధక బటి మాత్ర 1 చొప్పున బైద్యనాథ్ సురక్త స్ప్రాంగుతో ఉదయం సాయంత్రం సేవించండి.

**బి. రుక్మిణి, చీపురుపల్లి**

ప్ర : విరేచనం సరిగా అవదు. లావుగా అగుటకు.

జ : బైద్యనాథ్ అవిపత్తి కరచూర్ణం రాత్రి పడుకోబోయేటప్పుడు 2 చెంచాలు వేడి నీటితో సేవించండి. ఉదయం సాయంత్రం బైద్యనాథ్ చ్యవన్‌ప్రాశ స్పెషల్, భోజనం తరువాత బైద్యనాథ్ సుందరీ కల్ప రెండు సార్లు సేవించండి

**ఎ. సుబ్రమణ్యం, ఒంగోలు**

ప్ర : ఆయాసం, విపరీతమైన నీరసం.

జ : బైద్యనాథ్ శ్వాసకల్ప మాత్రలు ఉదయం సాయంత్రం 2 మాత్రల చొప్పున వాడండి. బైద్యనాథ్ చ్యవన్‌ప్రాశ స్పెషల్ పాలతో సేవించండి.

**పేరాల జయప్రకాశ్, మంకమ్మతోట**

ప్ర : మూత్రములో మంట.

జ : బైద్యనాథ్ చంద్రప్రభాబటి మాత్రలు ఉదయం సాయంత్రం 2 చొప్పున బైద్యనాథ్ చందనాసవతో వాడండి.

**జి. చంద్రమౌళి, జగిత్యాల,**
**పి. రత్నాజీ, కాకినాడ**

ప్ర : చాలా సన్నగా ఉంటాను. లావు అవటానికి.

జ : బైద్యనాథ్ చ్యవన్‌ప్రాశ స్పెషల్ ఉదయం సాయంత్రం పాలతో లోనికి వాడుతూ మంచి ఆహారం తీసుకోండి.

**జి. వి. రావ్, కొత్తగూడెం**

ప్ర : అజీర్తి, కడుపులో మంట, శరీరమంతా మంట.

జ : రాత్రి పడుకోబోయేటప్పుడు బైద్యనాథ్ అవిపత్తి కరచూర్ణము 2 చెంచాలు గోరు వెచ్చని నీటితో సేవించి విశ్రమించండి. బైద్యనాథ్ గైసాంతక బటి మాత్రలు రోజుకు రెండు మూడు సార్లు చప్పరించి మింగండి. కారము, పులుపు, ఉప్పు తగ్గించండి.

**యస్. రామారావు, కడప**

ప్ర : బుద్ధ ఉన్నది.

జ : బైద్యనాథ్ వృద్ధి బాధికబటి 2 మాత్రలు, బైద్యనాథ్ నిత్యానందరస 1 మాత్ర చొప్పున ఉదయం సాయంత్రం బైద్యనాథ్ మహారాస్నాది కాఢాతో సేవించండి.

**డి. వి. నారాయణరావు, హైదరాబాద్**

ప్ర : ముక్కుకు వాసన తెలియదు, తల వెంట్రుకలు నెరిసి పోయాయి. జ్ఞాపకశక్తి తగ్గిపోయినది.

జ : బైద్యనాథ్ బ్రెయిన్ టాబిలెట్సు ఉదయం సాయంత్రం పాలతో సేవించండి. బైద్యనాథ్ షడ్బిందుతేల్ ముక్కులో రోజుకు రెండు సార్లు 3 చుక్కలు వేయండి.

**యం. భీమయ్య, దాయపంతులపల్లె**

ప్ర : జ్ఞాపకశక్తి తగ్గినది. శరీరము బరువు పెరుగుటకు.

జ : బైద్యనాథ్ బ్రెయిన్ టాబిలెటు 1 మాత్ర, బైద్యనాథ్ చ్యవన్‌ప్రాశ స్పెషల్ 1 చెంచా ఉదయం సాయంత్రం పాలతో వాడండి మంచి ఆహారం తీసుకోండి.

**ఆర్. ఎ. అశల్, నారాయణపేట**

ప్ర : స్వప్న స్ఖలనము, అంగము చిన్నదగుట.

జ . బైద్యనాథ్ విటా–ఎక్స్ 2 మాత్రలు, బైద్యనాథ్ చ్యవన్‌ప్రాశ స్పెషల్ 1 చెంచా చొప్పున ఉదయం, సాయంత్రం పాలతో సేవించండి.

**పి. రామారావు, చీరాల**

ప్ర : సంభోగము తరువాత అతి నీరసము, తలనొప్పి.

జ : బైద్యనాథ్ విటాఎక్స్ 1 మాత్ర, బైద్యనాథ్ స్వర్ణమకర ధ్వజ 1 మాత్ర పాలతో ఉదయం సాయంత్రం వాడండి... బైద్యనాథ్ చ్యవన్‌ప్రాశతో వాడితే మంచిది.

**యస్. శ్రీనివాస్, తాడవాయి, కామారెడ్డి**

ప్ర : వేడివల్ల అరచేతి, అరికాలు పొట్టు ఊడుతుంది.

జ · విడవకుండా బైద్యనాథ్ సురక్తస్ప్రాంగ్ ఉదయం, సాయంత్రం లోనికి వాడండి. బైద్యనాథ్ చాల్ మొగ్రాతేల్ చేతులకు, కాళ్ళకు మర్దన చేయండి. ☐

---

**కూపన్**

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

**బైద్యనాథ్ ఆరోగ్య దీపిక**

ప్రశ్న :..............................................

..............................................

..............................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :

# ప్రిన్సిపుల్ దూరి వెంకటరావు

**యస్.** యస్. సి పేపర్లు దిద్దడానికని విశాఖ వెళ్ళి తిరిగొస్తున్నాను.

కాంప్లెక్స్ చేరుకునే సరికి విజయనగరం వెళ్ళే ఫాస్ట్ పాసింజరు బయలుదేరడానికి సిద్ధంగా వుంది

భుజం మీంచి వ్రేలాడుతున్న ఎయిర్ బేగ్‌ని పైకెగదోసుకుంటూ హడావిడిగా బస్సెక్కి సీటు చూసుకుని కూర్చున్నాను.

మరో ఐదు నిమిషాలలో సీట్లన్నీ ఫిలప్ అయిపోయాయి. కండక్టరు రైట్ చెప్పడంతో బయలుదేరింది బస్సు.

విజయనగరం చేరుకోడానికి కనీసం గంటన్నరైనా బస్సులో కూర్చోవాలి. సమయం సునాయాసంగా సాగిపోవడానికి పుస్తక పఠనమే బ్రహ్మాస్త్రమని తో చడంతో బేగ్ లోంచి వార పత్రిక తీసాను.

రెండు కథలు చదివానో లేదో బస్సు ఆనందపురం జంక్షన్ చేరుకుంది అక్కడ జనం బాగా ఎక్కారు. అసలే వేసవి దానికి తోడు వోవర్ రష్‌గా వుండటంతో ఊపిరి తీసుకోడానికి మాకు ప్రాణవాయువు కరువైంది ఉక్కపోతకు బట్టలు తడిసి పోతున్నాయి

·అక్కడ బస్సెక్కిన వారిలో తెల్లటి పైజామా షర్టు ధరించిన పొడవుగా బక్క పల్చగా వున్న వ్యక్తి నన్ను చూసి పలకరింపుగా చిరునవ్వు నవ్వాడు అతగాడి




నెప్పుడు ఎక్కడ చూసానో ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా స్ఫురణకు రావడం లేదు

అలా కూర్చోండి ఎవరైనా ఆడవాళ్ళు ఎక్కినప్పుడు లేచి పోదురుగాని' అన్నాను సభ్యత కోసం లేడిస్ సీటు ఖాళీగా వుంటే చూపిస్తూ

తప్పు తప్పు స్త్రీలకు కేటాయించిన సీట్లను వారికే విడిచి పెట్టాలి అప్పుడే మన సభ్యత సంస్కారం గోచరిస్తాయి" దాదాపు ఉపన్యాసమిస్తున్నట్టుగా అని ప్రక్కవాణ్ణి కాస్త సర్దుకోమని చెప్పి ఎడ్జస్టైపోయాడు.

అతగాడి మాటలే మిగిలిపోయాయి గాని మరెవరో ఆ సీట్లు క్షణాల్లో ఆక్యుపై చేసేసారు.

మళ్ళీ బస్సు కదిలింది

కండక్టరుకు రెండు టిక్కట్లు షార్టు రావడంతో బస్సులో వున్న వాళ్ళందర్నీ తీసిన టిక్కట్లు చూపమన్నాడు అతడి కోరిక మేరకు అందరం టిక్కట్లు అతడికిచ్చాం.

ఐతే పైజామా వ్యక్తి మాత్రం తన టిక్కటివ్వడానికి నిరాకరిస్తూ బస్సు మీద చూడమన్నట్లు సౌజ్ఞ చేసాడు.

అందరి దృష్టి బస్సు మీద పడింది.

సరియైన టిక్కట్టు తీసుకుని ప్రయాణించవలెను.

తీసుకున్న టిక్కట్టు కండక్టరు కివ్వరాదు. తనిఖీ అధికారులు అడిగినప్పుడు మాత్రమే చూపవలెను.

స్త్రీలకు కేటాయించిన సీట్లను వారికే విడిచి పెట్టవలెను.

పొగ త్రాగరాదు.

ఆర్. టి. సి. వారి సూచనలన్నీ ఆ వ్యక్తి తు. చ. తప్పకుండా పాటిస్తున్నందుకు ఎందరో ప్రయాణీకులు అతడిని అభినందించారు. ప్రతి వ్యక్తి అలాగే వుంటే స్టాఫ్ అవినీతికి పాల్పడ్డానికి గాని, సంస్థకు నష్టం రావడం లాంటివి జరగడానికి అవగింజంతైనా అవకాశముండదనుకున్నారు. మరికొందరతడిని వెర్రిబాగులాడనుకున్నారు.

కండక్టరు ఎంత వత్తిడి చేసినా అతడు తన టిక్కట్టివ్వక పోయేసరికి, "అతనితో వాదనెందుకయ్యా, మిగిలిన వాళ్ళ టిక్కట్లు చూస్తే సరిపోలా అతడు ప్రిన్సిపుల్సుకు కట్టుబడ్డ వ్యక్తనని చెప్తున్నాడు కదా" అన్నారెవరో పైజామా ధరించిన వ్యక్తిని సైడ్ చేస్తూ.

మరి చేసేదేమీ లేక కండక్టరు బస్సులో ఆ చివరి నుండి ఈ చివరి వరకు అభిమన్యుడిలా పాసింజర్సందర్నీ ఛేదించుకుంటూ ముమ్మాటు చెక్ చేసి ఈ మారు ఒక్క టిక్కట్టు మాత్రమే షార్టు వుందన్నాడు.

"ఇంత రద్దీలో నీకలా కనిపిస్తుంది. మరేం ఫరవాలేదు. మరోసారి లెక్క చూసుకో అదే సరిపోతుంది" మరి మమ్మల్ని విసిగించకన్నట్టుగా చిరాగ్గా ముఖం పెట్టి అన్నాడు నా ప్రక్కన కూర్చున్న వ్యక్తి.

ఈ మారు నాకు పుస్తకం చదవట్లేకుండానే టైము పాసైపోతోంది.

బస్సులో అటు ఇటు తిరిగి అలసిపోయిన కండక్టరు ఉస్సూరుమంటూ తన సీట్లో కెళ్ళి కూర్చున్నాడు.

తగరపు వలస చేరేసరికి స్క్వాడ్ వచ్చి టిక్కట్లు చెక్ చేయడం కాకతాళీయంగా జరిగింది. ఒక టిక్కట్టు తేడా వున్నా ధైర్యంగానే వున్నాడు కండక్టరు.

తనిఖీ అధికారుల చెకింగ్‌లో టిక్కట్టు తీయని వ్యక్తి పైజామావాలా అని తేలేసరికి ప్రయాణీకులంతా ఆశ్చర్యపోతూ ముక్కు మీద వేలేసుకున్నారు.

"హారి పిడుగా! ఇన్ని శ్రీరంగ నీతులు వల్లించి నువ్వు చేసిన పని ఇదా!" అనుకున్నాను నాలో నేను.

పంద రూపాయలు పెనాల్టి వేసి అతగాణ్ణి బస్సులోంచి దింపేసారు. అంత వరకు అతడి మాటల గారడీకి మంత్ర ముగ్ధులైన ప్రయాణీకులలో తిట్టని వారు లేరిప్పుడు.

అవినీతిని అరికట్టడానికి, ప్రయాణీకుల భద్రత కోసం ఆర్. టి. సి. వారు తయారు చేసిన సూచనలను తన అతి తెలివితో స్వప్రయోజనానికి వాడుకోవాలనుకుని ప్రయత్నించి పట్టుబడ్డ పైజామా వ్యక్తి మీద ఎవ్వరికీ సానుభూతి కలగలేదంటే నమ్మండి. □

# కోహినూర్

సుతిమె త్తని నీ చిరునవ్వుల వెల్గులు
సుగమం చేస్తాయి నా భవితవ్యాన్ని
జీవిత సోపానాల అధిరోహణలో
నేను ఒంటిగాదు జంటగా నీ బాహుంబంధం
అనురాగం చిందే నీ హృదయం నాకు వేయి విధాల విదితం

**KOHINOOR®**

గులాబీరంగు
సుఖదా యకమైన ల్యూబ్రికేటెడ్
కాండొమ్. ఎలెక్ట్రానిక్
ఉపకరణాలతో పరీక్ష
చేయబడివది.




ఇప్పుడు
ఖర్చు ఆదా చేసే
విధంగా ఒకే
ప్యాక్‌లో పది.

ttk తయారీ

MAA (S) LRC 4 A TEL 86




# అది అమావాస్య రాత్రి....

జరీ నక్షత్రాలు అద్దిన నల్ల చీర కట్టుకుని నల్లని కాటుక పెట్టుకుని విహారాని కొచ్చిన నిశాదేవి నగరంలో ప్రవేశించటానికి ప్రయత్నిస్తోంది,...

శత్రువును లోపలికి చొరనివ్వకుండా కాపలా కాసే సరిహద్దు భద్రతాదళాల్లాగా నగరాన్నావరించిన ఎలక్ట్రిక్ లైట్ల కాంతి నిశాదేవి ప్రయత్నాలు సాగకుండా అడ్డు పడుతోంది....

హఠాత్తుగా లైట్లారి పోయాయి!

అంతవరకూ ఊరి బయటున్న చెట్ల మధ్య పొంచి ఉన్న చీకటి విజయగర్వంతో నగరంలోకి ప్రవేశించింది....

అక్కడక్కడ వెలుగుతున్న కొవ్వొత్తులు, లాంతర్లు ఆ చీకటిని ఆపలేని తమ అసమర్థతకు వెల వెల బోతున్నాయి....

చీకటిని చీల్చుకుంటూ సాగిపోతోంది పోలీస్ జీప్.... హోటల్ బ్లూస్టార్‌లో అప్‌స్టెయిర్‌లో సూట్లలో ఉన్న రసికాగ్రేసరులు భూలోకానికి దిగివచ్చిన స్వర్గాన్ని ప్రత్యక్షంగా చూస్తూ మత్తెక్కి పోతున్నారు.

పోలీస్ జీప్ బ్లూస్టార్‌ని సమీపించేలోగా లైట్లు వెలిగాయి. జీప్ దిగి హోటల్లో ప్రవేశించాడు డి. ఎస్. పి. విజయ్....

సాధారణంగా పోలీస్ అధికార్లు ఆ హోటల్ జోలికి పోరు. సంఘంలో పేరు ప్రతిష్ఠలున్న పెద్ద మనుషులు, ప్రముఖులు తమకు నచ్చిన అమ్మాయిలతో.... పోలీసుల బెడద లేకుండా విశృంఖలంగా.... నిశ్చింతగా గడప గలిగిన స్థలమది.

కాస్త ఉడుకు రక్తంగల పోలీసాఫీస రెవరైనా ఆ హోటల్ మీద రైడింగ్ చెయ్యటానికి ప్రయత్నిస్తే ఆ సంగతి ఆ డిపార్ట్‌మెంటుకు చెందిన వాళ్ళ ద్వారానే ముందుగా బ్లూస్టార్ హోటల్ యజమానికి తెలియ జెయ్యబడుతుంది. మరుక్షణం హోటల్ వాతావరణం మారిపోతుంది.... వచ్చిన ఆఫీసర్ మొహం వేళ్ళాడేసుకుని వెనక్కి తిరగాల్సిందే తప్ప అక్కడేం దొరకదు.

బ్లూస్టార్ హోటల్ యజమాని రంగారావు. నగరంలో ప్రముఖ పారిశ్రామికవేత్తల్లో మొదటి వాడు. అనేక సంస్థలకు నిర్లక్ష్యంగా డొనేషన్లు విసిరెయ్యగల దాత. రాజకీయంగా పలుకుబడి కలిగిన వ్యక్తి. ఇది అతని బాహ్య




నమస్కారం. ఈ వారం నుంచీ "డి. ఎస్. పి. విజయ్" ప్రారంభమవుతోంది. పాఠకుల మానసిక స్థాయి ఇప్పుడు బాగా పెరిగింది. కలలు... ఊహలు పోగేసి రాసిన నవలల్ని వెనక్కి నెట్టి సమాజానికి దగ్గరగా ... రియాలిటీగా ఉన్న వాటినే వాళ్ళిప్పుడు ఆదరిస్తున్నారు.

ఈ సీరియల్ గురించిన సెంట్రల్ ఐడియా నేనిప్పుడే చెప్పేస్తే... టెంపో తగ్గిపోతుంది. అందుకని నేనేం చెప్పటం లేదు. కానీ ... ఇది ఊహించి రాసిన నవల కాదు... ఈ నవల రాసే ముందు .. గతంలో "ఇన్‌స్పెక్టర్ జనరలాఫ్ పోలీస్"గా పని చేసి ప్రస్తుతం ఆర్. టి. సి. మేనేజింగ్ డైరెక్టర్‌గా ఉన్న శ్రీ కె. విజయ రామారావు గార్ని కొన్ని విషయాల గురించి అనుమతి అడుగుతూ ఈ నవల రాయటంలో గల ఉద్దేశ్యాన్ని వివరించి చెప్పాను. ఆయన అనుమతించి ప్రోత్సహించారు...

గతంలో విజయవాడ ఎస్. పి. గా ఉన్న "వ్యాస్" గార్ని ఇంకా కొందరు డి. ఎస్. పి లను ఇంటర్వ్యూ చేసి, వాళ్ళ అనుభవాలను క్రోడీకరించి దీన్ని రాయటం జరిగింది.

వారందరికీ పత్రికా ముఖంగా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

మొన్నటి "ఒడిలో చెలి మోహన రాగం" నవలను మీరంతా విశేషంగా ఆదరించారు. ఈ నవల కూడా మిమ్మల్ని బాగా ఆకర్షిస్తుందని నా నమ్మకం.

ఈ సారి "రచయిత్రి జవాబులు" శీర్షికలో పాల్గొనటం లేదు. ఇంత తక్కువ వ్యవధిలో తిరిగి పాల్గొనటం ఇష్టం లేక మానేశాను.

కానీ... మీ అభిప్రాయాలను ఎప్పటికప్పుడు "ఆదూరి సావిత్రి, కేరాఫ్ ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3" కు తెలియజెయ్యండి. ప్రతి ఉత్తరం నేను చదువుతాను.

గతంలో లాగే మీ సలహాలు.. అభిప్రాయాలు తెలియజేస్తూ ఉంటే ... సీరియల్ అయిపోయే ముందు మరోసారి ఇలాగే మిమ్మల్ని కలుసుకుంటాను. అప్పుడు వాటికి జవాబులిస్తాను.

చాలా మంది పాఠకులు "మీరు ఆంధ్రపత్రికకే ఎక్కువగా రాస్తూ ఉంటారెందుకని? మా పత్రిక అంటే మీకు ఇష్టమా?" అని అడుగుతున్నారు.

ఔను! చాలా ఇష్టం! ఒక మంచి నవల రాస్తే వెంటనే "దీన్ని పత్రికకు ఇవ్వాలి" అనిపిస్తుంది. ఎలాంటి రాజకీయాలకూ రాగద్వేషాలకూ తావు లేకుండా రైటర్‌లో ఉండే "వర్త్"ని గుర్తించి ప్రోత్సహిస్తుంది ఆంధ్రపత్రిక. అందుకే.. సాధారణంగా నేను పత్రికకే ఎక్కువగా రాస్తుంటాను.

మీ అభిమానాన్ని.. ప్రోత్సాహాన్నీ ఆశిస్తూ-

ఆదూరి సావిత్రి

స్వరూపం

తెర వెనుక అతను ధనమదంతో విర్రవీగే నీచుడు అందమైన ఆడపిల్లల పాలిట యముడు. పసిబిడ్డల పాలిట రాక్షసుడు ఇంకా ఎన్నో చీకటి వ్యాపారాలున్నాయతనికి. ముఖ్యంగా అతను ప్రభుత్వాలను కూలదొయ్య గలడు., నిలబెట్ట గలడు అధికార పక్షంలో ఉన్న ముఖ్యమైన వ్యక్తులతో అతనికి మంచి మంచి సంబంధాలున్నాయి

అలాంటి రంగారావు హోటల్ జోలికిపోయే సాహసం ఎవరికీ లేదు.. .

అక్కడికి కొత్తగా వచ్చిన డి ఎస్ పి విజయ్ ముప్పయి సంవత్సరాల యువకుడూ, స్ఫురద్రూపి అయిన విజయ్ అమిత సాహసవంతుడు. చెడును ఎదిరించటం అనే విషయంలో అతనెవర్నీ లెక్క చెయ్యడు దేనికీ వెరవడు. అండమాన్ దీవులకు విసిరేసినా చెక్కు చెదరకుండా తిరిగి అక్కడా అలాగే ప్రవర్తిస్తాడు.

అక్కడికి రాగానే అతను రంగారావు గురించి విన్నాడు బ్లూస్టార్ హోటల్ గురించి కూపీ లాగాడు.

ఆ హోటల్‌మీద వచ్చిన కంప్లయింట్స్ చర్య తీసుకోక పోవటానికి, ఒకవేళ తీసుకున్నా విజయం సాధించలేక పోవటానికి గల కారణాలు తమ డిపార్ట్‌మెంటు నుంచి కొందరి ద్వారా జరుగుతున్న నమ్మకద్రోహం.... పైనుంచి వచ్చే ప్రెషర్స్ . వీటన్నిటినీ సమీకరించాడు

ఆ రాత్రి బ్లూస్టార్ మీద దాడి జరగబోతోందనే విషయం విజయ్‌కి తప్ప ఆఖరుక్షణం వరకూ డిపార్ట్‌మెంటు వాళ్ళకి కూడా తెలీదు

అనూహ్యమైన రీతిలో.... రంగారావుకు ఇన్‌ఫర్మేషన్ చేరే వ్యవధి కూడా లేనంత పకడ్బందీగా ఆ దాడిని నిర్వహించాడు విజయ్. ఆ మెరుపుదాడి నూహించని పెద్ద మనుషులు అదిరిపడ్డారు బోనులో చిక్కిన మృగాల్లా దిక్కు తెలియకషాక్‌లో నిలబడి పోయారు....

వారూ వీరూ అనే విచక్షణ చూపకుండా అందర్నీ లాక్కొచ్చి వ్యాన్ఎక్కించాడు విజయ్.. .

క్షణంలో సగంసేపు దిగ్భ్రమ చెందినా వెంటనే ఎలర్ట్‌గా అయిపోయాడు రంగారావు అతని చెయ్యి ఫోన్‌మీది కెళ్ళింది....

రెండు సింహాలు . ఒకదాని కొకటి ఏమాత్రం తీసిపోనివి ముఖాముఖి ఢీకొనటం అప్పుడే ప్రారంభమయింది . .

జీప్ ఎక్కబోతుండగా దూరంగా వినిపించిన సన్నని కంఠధ్వనికి ఎడమవేపుగా చూసిన విజయ్ బెబ్బులిలా ముందు కురికాడు.

కానీ అప్పటికే ఆలస్యమయింది.

ఆమె నెక్కించుకున్న కారు ముందుకు కదిలింది

విజయ్ జీప్ హోటల్ ఆవరణలో ఉంది. అక్కడ నుంచి హోటల్లోకి ఎడమ వేపుగా వెళ్ళేటప్పుడు ఎంట్రన్స్ హాలు ముందు అర్ధ చంద్రాకారంగా ఉన్న బాల్కనీకి కుడివేపు గోడ ఉంది మిగతా రెండు వేపులా ద్వారా లున్నాయి. ఒక ద్వారం దొడ్డివేపు. రెండోది ముందున్న ఆవరణ వేపు వుంది ఆవరణ వేపు విజయ్

## డి. ఎస్. పి. విజయ్

ఉన్నాడు. అటువేపు మొహంతో బాల్కనీ కింద ఉన్నదాకారు. అక్కడ ఒక్క కారే పడుతుంది.

ఆ కారు ననుసరించటానికి విజయ్ జీప్‌ను ఎడమ వేపు తిప్పాడు. వెంటనే అటువేపు పైనుంచి షట్టర్ కిందికి జారింది. దారి మూసుకు పోయింది.

"డామిట్!" అనుకున్నాడు విజయ్. ఆ కారు ననుసరించాలంటే ఆవరణ దాటి రోడ్డుమీద కెళ్ళి అటు తిరిగి రావాలి. ఈ కాస్త వ్యవధి చాలు అది తప్పించుకు పోవటానికి....

కార్లు వరసగా తప్పించుకోటానికి వీల్లేనంత చిన్న ద్వారం గనక దాని గురించి అతనంత జాగర్త తీసుకో లేదు.

అయినా.... గదుల్లో వాళ్ళంతా పట్టు బడ్డారు. ఈమె నెటువేపు నుంచి తెచ్చారు?!

భరించలేని ఆశాభంగంతో తిరిగి వచ్చి జీప్ ఎక్కాడు విజయ్.

ఆమె.... ఆమె వైజయంతి.

ఎంతాశ్చర్యం!!

ఆమె చ.... ని.... పో.... లే....దా!

ఇదెలా సాధ్యం?

ఆమె రంగారావు చేతి కెలా చిక్కింది?

ఇంత రహస్య జీవిత మెందుకు గడుపుతోంది.

తను పొరపాటు పడలేదు.

ఆమె వైజయంతే.

ఆ కళ్ళు.... తనను చూడగానే ఆ కళ్ళలో తళుక్కుమనే ఆ మెరుపు తనకు బాగా తెలుసు.

ఆమె రంగారావు చేతిలో ....

ఆమె నక్కడ చూసి విచలితు డవుతున్నాడు విజయ్....

ఆవేశంతో మండిపడు తున్నాడు....

"రేయ్ రంగారావ్! ఈ డి. ఎస్. పి. సింహం లాంటివాడు. సింహస్వప్నమై నిన్ను వెంటాడుతాడు. నా ప్రాణా లొడ్డి అయినాసరే వైజయంతిని కాపాడు కుంటాను. ఇహనుంచి అనుక్షణం నీ వెంట నీడలా ఉంటాను." దృఢంగా అనుకున్నాడు విజయ్.

"వీడి మొహం. ఇంతకన్నా కొమ్ములు తిరిగిన వాళ్ళని... "నిజాయితీ.... కార్యదీక్ష" అంటూ ఇంతకన్నా ఎక్కువగా గొంతులు చించుకున్న వాళ్ళ నోళ్ళే మూయించి పారేశాను.

ఇది నీ విజయమనీ.... నిలకడగా నీ దగ్గరే ఉంటుందనీ భ్రమపడకు. ఇరవై నాలుగ్గంటలు దాటకుండానే.... నువ్వు అరెస్ట్ చేసిన వాళ్ళందర్నీ సురక్షితంగా ఇళ్ళకి ఎలా చేర్చాలో నాకు తెలుసు.

కాకపోతే.... నీకు చావుమూడి నాతో తలపడ్డావు. గుర్తుంచుకుంటాను!" అనుకున్నాడు రంగారావు.

* * * * *

ఆలోచిస్తూ తన ముందున్న ఫైల్‌లోకి చూస్తున్నాడు విజయ్. ఫోన్ మోగింది. చెయ్యి చాపి రిసీవర్ చెవి దగ్గరానించుకుని, "యస్... డి. ఎస్. పి. స్పీకింగ్..." అన్నాడు క్యాజువల్‌గా.

"రాగానే బ్లూస్టార్ మీద విరుచుకుపడ్డ మీ సాహసానికి నా అభినందనలు మీరొచ్చాక.... చెట్లకింద, గుడి అరుగులమీద జోరుగాసాగే మూడు ముక్కలాటలు, పట్టపగలే పుస్తెల తాళ్ళు తెంపుకు పోవటాలు, తెగ తాగి, రోడ్డున పడి గొడవ చెయ్యటాలు వగైరాలన్నీ చాలావరకూ కంట్రోలవటం చూసి, పర్లేదు, కొత్త డి. ఎస్. పి కాస్త ఉత్సాహవంతుడే అనుకున్నాను. బ్లూస్టార్ మీద దాడి జరిపాక మాత్రం మీ గురించి ఎక్కువగా ఆలోచించకుండా ఉండలేక పోతున్నాను. మీవాళ్ళే ఉప్పందిస్తున్నారనే విషయం రాగానే కనిపెట్టేశారో!"

"మీరెవరు?" యధాలాపంగా అడిగాడు విజయ్.

"నేనా? ప్రస్తుతం.... మిస్. ఎక్స్ అనుకోండి." ఆమె స్వరంలో కొద్దిగా నవ్వు తొంగి చూసింది.

"సరే, నన్ను పొగడటం విషయం పక్కకుపెడితే.... వేరే ఏదైనా చెప్పాలనుకుంటున్నారా? అభినందనలకు థాంక్స్."

"మిస్. ఎక్స్ అనగానే కుతూహలంగా లేదూ నేనెవరో తెలుసుకోవాలని?"

"లేదు."

"తరవాత ఆ కుతూహలం దానంతటదే వస్తుంది."

"ఇది చెప్పటానికే ఫోన్ చేశారా? పెట్టేస్తున్నాను."

"ఆగండి. ప్లీజ్. ఆ రంగారావు విషయం...."

ఆమె చెప్పుకు పోతోంది. అతను వింటున్నాడు. అతనిలో విసుగు మాయమయి కుతూహలం చోటు చేసుకుంది....

"మీరు రంగారావు తాలూకు మనిషి కదూ?" అన్నాడు విజయ్.

"ఎందుకలా ఊహిస్తున్నారు?" అన్నదామె ఆశ్చర్యంగా.

"ఇప్పుడు కాదు. ఈసారెప్పుడయినా సమయ మొస్తే చెపుతాను. కాస్త బిజీగా ఉన్నాను. సారీ!"

"పర్లేదు. ఫోన్ పెట్టేస్తున్నాను."

"ఓ. కే."

* * * * *



## డి. ఎస్. పి. విజయ్

విజయ్ అరెస్ట్ చేసిన వాళ్ళలో ధర్మారావు, నాగూ ప్రముఖులు. ధర్మారావు శాసన సభ్యుడు. అధికార పార్టీకి చెందిన వాడు.

నాగూ పచ్చి రౌడీ. రంగారావు. ధర్మారావు లాంటి అనేక మందికి కుడి భుజం లాంటివాడు. రైడింగ్ జరిపేటప్పుడు ప్రతిఘటించి... పోలీసుల్ని గాయపరిచినందుకు పట్టుబడ్డాడు....

వాళ్ళకు జామీను దొరక్కుండా విజయ్ చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఫలించవని అతనికి తెలుసు. అయినా అతను నిరుత్సాహపడలేదు.

బయటకొచ్చేసినా అసలు అరెస్ట్ కావటమనేదాన్ని ప్రిస్టేజ్ ఇష్యూగా తీసుకున్నాడు ధర్మారావు. అవసరమైతే వాళ్ళకు బదులుగా నాగూస్టేషన్ కెళ్ళేవాడు కానీ సరాసరి తామే స్టేషన్‌కెళ్ళటం అనేది ఇదే మొదటిసారి.

"ఇందుకు కారకుడైన విజయ్‌గాడి అంతం చూడాలి." కసిగా అన్నాడు ధర్మారావు.

"వాడి విషయం నేను చూసుకుంటాను." నిశ్చలంగా అన్నాడు రంగారావు.

తాచుపాములాంటి రంగారావు తోక తొక్కాడు విజయ్. పడగ్గొపైకెత్తి ఆడిస్తూ కాటియ్యటానికి అదునుకోసం చూస్తోందది.

"సమయంకోసం పొంచి ఉండి, ఈ సారి తిరుగులేని దెబ్బకొట్టాలి. ఇలా అరెస్టయి అలా విడుదలయే అవకాశం వాళ్ళకివ్వకూడదు. ఇందువల్ల అనవసరమైన శ్రమతప్ప ఇంకేం మిగలదు." అనుకున్నాడు విజయ్. రంగారావు నాగూలమీద నిఘా ఎక్కువ చేశాడు. రంగారావును వీలైనంత వరకూతనే.. ప్రతిఅనుమానాస్పద పరిస్థితిలోనూ వెంటాడాలని నిశ్చయించుకున్నాడు. మొత్తం సమాచారమంతా సేకరించాడు.

రంగారావుకు గోగినేనిపల్లిలో పురాతనమైన భవనం వుంది. రాజమహల్ లాంటి ఆ భవనాన్ని 'గడీ' అంటారు. రంగారావు పూర్వీకులు ఆ పరగణాను ఏలేవారు.

అక్కడి భూములు వ్యవహారాలు చూడ్డానికి ఆ గడీలో ఒక మేనేజరు... గూర్ఖా, వంటాడు, తోటమాలి కుటుంబం ఇంకో ముగ్గురు నౌకర్లు ఉన్నారు. ఒకప్పుడు రంగారావుకూడా అక్కడ రాజులాగే వ్యవహరించాడు. కాలంమారి చట్టాలు సడలి ప్రజలు తెలివిమీరటంతోపాటు పట్నంలో ఉండే ఆకర్షణలు కూడా తోడుకావటంతో అక్కడి వ్యవహారాలు నమ్మకస్తుడైన మేనేజరు కప్పగించి పట్నానికొచ్చాడతను.

ఆ పట్నంపేరు ఇంద్రాపూర్.

అక్కడ మయూరా టెక్స్‌టయిల్స్, మయూరా ధాల్‌మిల్, ఆయిల్‌మిల్లు, మయూరా టాకీస్, బ్లూస్టార్ హోటల్‌లాంటి సంస్థలు క్రమక్రమంగా స్థాపించి, నగరంలో పెద్ద ప్రముఖుడుగా మారాడు. రాజకీయాల్లోకి దిగి చదరంగమాడి గెలుపు తనవేపే ఉండేలా చూసుకంటాడెప్పుడు.

అతని అంగరక్షకుల్లో అతిముఖ్యమైనవాడు నాగూ.ఎందుకూ.. ఏమిటి అనే చచ్చుప్రశ్న లియ్యకుండా ఒక్కరోజులో ఎన్ని మర్డర్‌లయినా అవలీలగా చేసి చేతులు దులుపుకోగల సమర్థుడు.

అతను సేకరించిన సమాచారంతోపాటు మిస్ ఎక్స్ చెప్పిన విషయాలు కూడా నోట్ చేసుకున్నాడు విజయ్.

* * * * * *

తెల్లని లుంగీ, సన్నటి, లైట్ కలర్ గళ్ళున్న షర్ట్ వేసుకుని టీ తాగుతూ వాలు కుర్చీలో కూర్చున్నాడు విజయ్. బయట వర్షం పడుతోంది.

పచ్చని ప్రకృతి నీటిధారల్లో తడుస్తూ ఆహ్లాదాన్ని కలిగిస్తోంది. గాలిచల్లబడింది. పక్షులు గూళ్ళలో ముడుచుకు కూర్చున్నాయి. సపోటా చెట్టుకున్న బంగారు పిచిక గూళ్ళు అటూ ఇటూ ఊగుతున్నాయి. విజయ్‌కి అసహనంగా ఉంది.

అతనీ ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించే మూడ్‌లో లేడు. అతని మనసు వైజయంతి చుట్టూ పరిభ్రమిస్తూ అతన్ని టెన్షన్‌కు గురి చేస్తోంది.

రంగారావు ప్రతిచర్యనూ ఎలర్ట్‌గా గమనిస్తున్నాడు తను. అతని వెనుక పసికట్టలేనంత జాగరూకతతో జాగిలంలా తిరుగుతున్నాడు.

అయినా వైజయంతి జాడ తెలియటంలేదు. అంటే?

తను ఆమెకోసం తహ తహలాడడాన్ని రంగారావు గమనించాడా?

ఆమెను ఇక్కడనుంచి తప్పించేశాడా?

వాడెంత క్రూరుడో తనకు తెలుసు. అమాయకురాలైన వైజయంతి వాడి చేతుల్లో ఎలాపడింది?!

ఆమె బ్రతికే ఉంది! అదే పెద్ద ఆశ్చర్యం!

ఆ బ్లూ స్టార్ హోటల్లో ఆమె!

విజయ్ మనసు అర్థంగా అయింది.

ఇది తనకొక సవాల్.

పోలీసాఫీసర్‌గా తనకున్న బాధ్యతతో పాటు ఆమెను రక్షించుకోవాల్సిన బాధ్యతకూడా తనమీదుంది....

బాదంపూడిలో బందిపోటు దొంగలు ఒకమినిస్టర్ కొడుకును హత్య చేసి, దోపిడీ చేశారు. వెంటనే అక్కడికెళ్ళి కేసు టేకప్‌చేసి అక్కడి పోలీస్ బలగానికి సహకరించమని మెసేజ్ వచ్చింది విజయ్‌కి.

ఒకప్పుడయితే రాకెట్‌లా దూసుకెళ్ళేవాడే! కానీ ఇప్పుడు తను ఇక్కడినుంచి వెళ్ళిపోతే ఆ కేసు పరిష్కరించటానికెన్ని రోజులు పడుతుందో, తను వచ్చేలోపల ఇక్కడెలాంటి పరిణామాలేర్పడతాయో. వాటి పొరపడిలో వైజయంతి కొట్టుకుపోతే?? తను ఇక్కడే ఉండి ఆమె నాదుకోవాలి.

కానీ ఎలా?

తను డ్యూటీ మైండెడ్ పర్సన్. అదీకాక ఆదేశాలు వచ్చింది ఐ.జి నుంచి వెంటనే బయల్దేరక తప్పదు.

ఈ ఘర్షణ భరించలేకపోతున్నాడతను.

ఫోన్ మోగింది. చెయ్యిచాపి అందుకున్న విజయ్ ఉద్వేగంగా ముందుకు ఒంగి "మీరు... మిస్ ఎక్స్!!" అన్నాడు.

"గుర్తు పట్టారే!" అన్నదామె.

ఎప్పటిలాగే ఆమె గొంతులో అదే సన్నని నవ్వు జీర.

"ఒకసారి విన్న కంఠస్వరం.. మాటతీరు నాకెప్పటికీ గుర్తుండిపోతాయి."

"తెలివైనవారే"

"ఇదీ ఒక తెలివేనా??"

"కాదా??"

"కాస్త చురుదనమున్న ఏదో తరగతి కుర్రాడిక్కూడా ఈ తెలివి తేటలుంటాయి."

"ఐ సీ."

"చెప్పండి. ఎందుకు ఫోన్ చేశారు?"

"వైజయంతి విషయం..."

'వాట్! మీకు తెలుసా?? ఆమె.. ఎక్కడుంది?? ఎలా ఉంది?" ఆతృతగా అడిగాడు విజయ్.

"ఎక్కడుందో తెలుసు. ఎలా ఉందో తెలీదు." అన్నదామె.

"ఎక్కడుందో నాకూ తెలుసు. ఎలా ఉందో కావాలి."

"ఎక్కడుందో తెలుసా?"

"రంగారావు స్థావరంలో."

"అదెక్కడుందో తెలుసుకున్నారా??"

"మీకు తెలుసా?"

"తెలీదు. రంగారావు అంత తేలికగా ఆ క్లూ ఎవరికీ దొరకనివ్వడు."

"వైజయంతిని మీరెప్పుడు కలుసుకున్నారు?"

"చాలా రోజుల క్రితం... ఒకే ఒక్కసారి కలుసుకున్నాను. ఇంకోసారలాంటి అవకాశం నాకు దొరక్కుండా కట్టుదిట్టం చేశాడు రంగారావు."

"తరవాత??"

"అంతే తరవాతింకేంలేదు."

"ఎందుకు ఫోన్ చేశారు మరి?"

"ఎందుకోగానీ.... రంగారావు వైజయంతి విషయంలో ప్రత్యేకమైన జాగ్రత్తలు తీసుకుంటాడు. ఆమె ప్రాణాలు చాలా విలువైనవిగా భావిస్తాడు. ఈ విషయం చెప్పాలనే ఫోన్ చేశాను. మీరు నిశ్చింతగా బాదంపూడి వెళ్ళి రావచ్చు. వాళ్ళు వైజయంతి నెక్కడో జాగర్తగా దాచారు. ప్రస్తుతం ఆమె ప్రాణానికేం అపాయంలేదు."

"థాంక్స్"

"నేనెవర్నో తెలుసుకున్నారా?"

'మీరు రంగారావు మనిషి. అతనికి కాస్త దగ్గరవారు. కొన్ని అధికారాలు మీకున్నాయి. అయితే అవి చిన్న చిన్న సంఘటనల మీద ప్రయోగించటానికి మాత్రమే. అతి ముఖ్యమనుకున్న విషయాల్లో అతను మిమ్మల్నికూడా నమ్మడు.

మీ రెలాగో అతనికి దగ్గరయారు. కానీ. అతను చేసే ఘోరాలు, అకృత్యాలు మీకు సరిపడవు. అతన్ని మార్చాలని ప్రయత్నిస్తుంటారు. ఈ ప్రయత్నాలే మిమ్మల్నతనికి మానసికంగా దూరం చేస్తున్నాయి. అందులో ఒక భాగంగానే అతని గురించి మీకు తెలిసిన సమాచారాన్ని నాకందించటానికి ప్రయత్నిస్తున్నారు. ఇది అతనికి తెలిస్తే మీ ప్రాణాలు దక్కవు. మీరిక్కడి కొచ్చెయ్యండి. మీకు నేను రక్షణ కల్పిస్తాను."

"థాంక్స్ గుర్తుంచుకుంటాను. ఒక చిన్న సందేహం"

"చెప్పండి"

"మీ దగ్గరకొచ్చినట్టేవచ్చి, మీ విషయాలన్నీ రంగారావుకు చేరవేస్తే?? నేను రంగారావు మనిషినిగదా"

"నేనలాంటి ఫూల్‌నికాదు. మీరలా ద్విపాత్రాభినయం చేసే మనిషికూడా



కారు."

"ఎలా తెలుసు??"

"తెలుసు. అంతే. కొన్ని కొన్ని అభిప్రాయా లేర్పడటానికి కారణాలుండవు. అయినా అవి నూటికి నూరుపాళ్ళు కరెక్ట్‌గానే ఉంటాయి."

"నామీదున్న నమ్మకానికి కృతజ్ఞతలు. మళ్ళీ ఇలాగే ఎప్పుడో ఫోన్ చేస్తాను."

"ఓ.కే."

* * * * * * * * * * *

ఐ. జి తన కప్పగించిన కేసును పరిష్కరించేసరికి పదిహేను రోజులు పట్టింది విజయ్‌కి.

దొంగల ముఠా మొత్తం పట్టుబడింది.

వాళ్ళకు తప్పకుండా శిక్షలు పడతాయి

కానీ రంగారావు లాంటి పెద్ద మనిషి మార్కు బందిపోట్లే చట్టానికి దొరకరు. న్యాయదేవత కూడా వాళ్ళని చూసి భయపడి కళ్ళు మూసుకుంటుంది...

ఇంద్రాపూర్ వచ్చాక బ్లూస్టార్ మీద అకస్మాత్తుగా మరోసారి దాడి చేసినా ఫలితం కనిపించలేదు విజయ్‌కి.

వైజయంతి జాడ దొరకలేదు. అనుమానమున్న చోటునల్లా గాలిస్తూ సమయం కోసం పొంచి ఉన్నాడు విజయ్. (ఇంకా ఉంది)




**జి. ఆర్. హెచ్. – జిల్లేడుపల్లి**

★ మిమ్మల్ని అవ్వా అనీ బామ్మా అనీ సంబోధించవచ్చు. అడిగానని అనుకోవద్దు. చెప్పకుండా దాటియ్యొద్దు.

● అరె, నాకు తెలియనే లేదే- తల పండితే తాత అవుతారనీ, అవ్వ అవుతారనీ! నన్ను నా మనుమలతో పాటు నా పనిపిల్ల కూడా ముద్దుగా అమ్మమ్మా అంటుంది. మీరడిగితే చెప్పకుండా దాటియ్యడాని కిదేమైనా సిగ్గు పడవలసిన విషయమా?! కాదే.

★ కలిమి లేములు కావడి కుండలు. ఇదెలా వర్తిస్తుంది?

● కావడి భుజాన సరిగా తూగాలంటే రెండు వైపులా సరైన భారం వుండాలి. ఎటు తగ్గితే అటు తేలిపోతుంది. ఇదే "కారీయింగ్ యువర్ ఓన్ క్రాస్" అనడం.

★ మీ కెంతమంది అమ్మాయిలు? ఎంతమంది అబ్బాయిలు?

● కన్నవాళ్ళు ముగ్గురు. పెంచిన వాళ్ళు ముగ్గురు. అంతా ఆడపిల్లలే.

**ఎల్. జి. ఆర్., ఎల్. ఎస్. ఎన్., పి. ఆర్. కె., డి. ఎస్. టి., ఎస్. ఎస్. ఆర్. –కోటబొమ్మాళి**

★ విద్య గొప్పదా? వృత్తి గొప్పదా?

● పొట్ట నింపే వృత్తే గొప్పది.

★ రాజకీయాలలో చేరడంపై మీ అభిప్రాయం ఏమిటి? చేరాలా? వద్దా?

● అది మీ మీ ప్రవృత్తిని పట్టి వుంటుంది బ్రదర్స్! చేరడాని కిదేమైనా కాలేజీయా? పిచ్చాసుపత్రా?

★ విద్యార్థులు భవిష్యత్తు దృష్టిలో ఎలా కృషి చేయాలి?

● కట్నాలు వస్తే భర్తీ అయిపోతుందని- డొనేషన్లు యిచ్చి కాలేజీల్లో చేరడానికి సిద్ధ పడకూడదు. చదివే చదువు పై దృష్టి వుంచి పరీక్షలు (సిల్లీయే అయినా) స్వంతంగా రాయడానికి కృషి చెయ్యాలి. గుడ్డిగా చదువు కుంటూ పోకూడదు – ఏం చేద్దామన్న 'గోల్' దృష్టిలో పెట్టుకోవాలి.

★ ఆస్తికుడు గొప్పవాడా? నాస్తికుడా?

● ఆస్తికుడే . అతగాని వద్ద డబ్బు వుంది, దేవుని తోడు వుంది. అంతకంటే కావలసిన దేమిటి?

**ఎన్. ఆర్. ఆర్. – భీమవరం**

★ ఈ సృష్టి.........

● దేనికో ఫలితం కాదు రాజుగారూ, అనంతమైన భవిష్యత్తు శూన్యంగా గోచరిస్తూనే వుంటుంది. అలాగే అనంతంగా భూతకాలం విస్తరించ లేదూ? అందుకే- సృష్టి అద్భుతం అర్థం చేసుకోవడం – అసాధ్యమే అంటారు.

**ఎ. పి. ఎస్. వి. –అనంతపురం**

★ మేం మీ ప్రశ్నావళి ఎప్పుడూ మిస్ కాము. అది మాకెంతో యిష్టం. నిర్మొహమాటంగా మీరిచ్చే సమాధానాలు మాకు బాగా నచ్చుతాయి. 'సోప్ బాక్సు హీరోలు' అన్నారు. అంటే అర్థం కాలేదు.

● కడిగిన ముత్యంలా వుండే ఘనులని అర్థం. సాదాసీదా కుటుంబ సభ్యులని కృత్రిమమైన సన్నివేశాలతో, నటనతో – ఏడిపించే వారని అర్థం చెప్పకోండి – అమ్మాయిలూ–

**రోశయ్య, – పాల్వంచ**

★ దేవుడంటే మీకు సరైన అభిప్రాయం లేదు. రామకృష్ణుల యుగం పోయి అయ్యప్ప యుగం వచ్చింది. మీరు ఆశ- అవకాశ వాదులు కనుక సంతోషి మాత భక్తులో అయ్యప్ప భక్తులో అయి వుంటారు. నిజమేనా?

● ఎవరి భక్తి భావాలు – వారి వారి బ్యాంకు ఎకౌంట్లు. మీ లాంటి 'దేన్నీ నమ్మని' వారికి చెప్ప వలసిన అవసరం లేదు!

**బి. ఎల్., రాజమండ్రి**

★ శోభనం గదిలో కట్టే తెల్ల చీరకు, భర్త చనిపోయేప్పుడు కట్టే తెల్ల చీరకు తేడా ఏమిటి?

● ఏంలేదు. ఒకటి ఆరంభానికీ, మరొకటి అంతానికీ - సూచన అని ఛాందసుల నమ్మకం.

**ఎ. జి. ఆర్., తెనాలి**

★ స్నేహం నేటి సమాజాన్ని పట్టి ఎక్కువ మందితో చేయడం మంచిదా?

● స్నేహం ఎంతమందితో చేశామన్నది కాదు స్వామి, ముఖ్యం. ఎందర్ని నిలబెట్టుకుంటాం - అన్నది. అంచేత - మంచి స్నేహితులు ఎవరికేనా ఎప్పుడేనా వేళ్ళపై లెక్కపెట్ట కల్గినంత మందే వుంటుంటారు.

★ రుద్ర రూపంతో మీరు ఎలా పరిచయం అయ్యారు?

● సాటి రచయితగా! ఏం? నమ్మలేకుండా వున్నారా?

★ మీవారు పాటలు రాస్తారు కదా మీరు డాన్సు చేయకపోయారా?

● ఏం? మీ ఆవిడ వండి పడేస్తుంటే మీరు తింటూ కూర్చుంటారా?! నాకు ఎవరి ట్యూన్‌కీ - ఆడే అవసరమే లేదు - నాకు నచ్చిన పని, నాకు చేయాలనుకున్న పని, నా మనసుకి తప్పుకాదని తోచిన పని - నేను నిర్భయంగా- చేస్తాను. అంతేగాని వారు పాటలు రాస్తారని నేనెక్కడ తైతక్కలాడగలను? ఆడవలసిన అవసరం ఏమిటి? (మీకు కాస్త యింగితం తక్కువ అనుకుంటా! అడిగే ముందు ఆలోచించడం కూడా అవసరం!)

**బి. వి. ఆర్., రాయగడ**

★ నేటి హిందూమతం రోజు రోజుకూ క్షీణిస్తున్నది. దీనికి కారణం ఏమిటి?

● ముక్కోటి దేవతలు! ఎవర్నని పూజించమంటారు? ఏ పరమాచార్యుల వారో - "ప్రతి హిందు వయిన వ్యక్తి వారంలో ఒక రోజు - అది శుక్రో, శనో ఏదో ఒకటి - దేవాలయానికి వెళ్ళి తీరాల"ని శాసించాలి. అప్పుడొక క్రమశిక్షణ ఏర్పడి హిందువుల ఐక్యతకి దోహదం చేస్తుందని నా గట్టి నమ్మకం.

**కె. ఎస్.హైదరాబాద్**

★ ఏభయి ఏళ్ళ క్రిందట దేశంలో 'వెధవ ముండల'తాకిడి ఎక్కువ. ఇటీవల వృద్ధ కన్యల తాకిడి ఎక్కువయింది. దీనికి పరిష్కారం?

● మీబోటి శాస్త్రుల్లు మారక పోవడమే! ఆడదాన్ని ముండనీ నీచంగా సంబోధించ డానికి మీకు సిగ్గు వేయడం లేదూ?! □





# లాహిరి లాహిరి లాహిరిలో.

'పైడిపాల'

ఎన్నికల కార్యాలయం దగ్గర కోలాహలంలా వుంది - థియేటర్ శైలూషి దగ్గర చేరిన జనం కలకలం.

శీతకాలం యెండ అలస్యంగా నిద్ర లేచిన కాలేజీ కుర్రాడి బద్ధకంలా వుంది.

కుబుసం విడవబోతున్న పాముల్లా... ఇంకా యింజన్ను తగిలించని రైలుబళ్ళలా వున్న క్యూలలో స్తబ్దత ఆవరించింది.

క్యూల్లో కదలిక లేదు - ఈ దేశంలో సగటు మానవుడి మెదడులా.

ఉన్నట్టుండి మగాళ్ళ క్యూలో దబ్ మన్న చప్పుడు - వెనువెంటనే కలవరం వినిపించాయి. అదే అదనుగా తీసుకొని వెనకనున్న వాళ్ళు తొక్కిసలాడి కొంత మంది ముందుకు తోసుకొచ్చారు. చాలా మంది మాత్రం మంత్రి పదవులంత భద్రంగా కాపాడుకొంటున్న తమ చోటులు యెక్కడికిపోతె యోనని ఆ కలవరం చెలరేగిన స్థానానికి వెళ్ళకుండా బిగిసి నిల్చున్నారు. జనం గుమిగూడిన దృశ్యంక్యూలో ప్రశ్నలను రేపింది.

"ఆ - ఎవరో కుర్రాడు కళ్ళు తిరిగి పడిపోయాట్ట. పడడూ మరి? సినిమా టిక్కెట్టు ఎక్కడ దొరకదోనని పరగడుపున పరిగెత్తుకొని రావడం" అంటూ భాను ముందు తల మీద జేబు రుమాలు వేసుకొని నిల్చున్న బట్ట తలాయన వ్యాఖ్యానించాడు.

"బాగా చెప్పారు. ఉదయమే లేచి చదువుకోమంటే ఈ కాలం కుర్రాళ్ళకు పది గంటలకు కాని తెల్లారదు. కాని తొమ్మిది గంటలకు మార్నింగ్‌షో అంటే అరింటి కొచ్చి క్యూలో నిల్చుంటారు" ముందు వంకె కర్ర సాయంతో వణుకుతూ నిల్చున్న ముసిలాయన బట్టతల పెద్దమనిషి కామెంటును సమర్థించాడు.

"కుర్రాళ్ళే కాదు సార్. లేడీస్ చూడండి. మన కంటి పెద్ద క్యూ వుంది. సినిమాలకు, సినిమా పత్రికలకు ఆడాళ్ళే మహారాణీ పోషకులంటే నమ్మండి. ఆ ఫోర్తు క్లాస్ జనాన్ని చూడండి - ఒక పూట పస్తుండడానికైనా సిద్ధపడతారు కాని అభిమాన హీరో సినిమా మాత్రం మొదటాట చూసి తీరాల్సిందే.." ముసిలాయన వత్తాసుతో పులయిపోయిన పెద్దమనిషి చిన్నసైజు ఉపన్యాసం ప్రారంభించాడు. అంతలోనే నాలుక కరుచుకొని క్యూ వెనకా - ముందూ పరికించి చూశాడు - తెలిసిన వాళ్ళెవరైనా ఉన్నారేమోనని. అతగాడి భయం అతడిది - పీత కష్టాలు పీతవిలా ఆఫీసుకి ఒక పూట సి. యల్. పెట్టి తన అభిమాన హీరో సంజీవి నటించిన 'పోటుగాడు' సినిమా మార్నింగ్ షోకి వచ్చిన తన గుట్టు కాస్తా కనిపెట్టి ఎవరైనా 'బాస్' కి మోసేస్తే ... అమ్మో! షోకాజ్ నోటీసు థైవయిపోతుంది!

బట్ట తలాయన వెనక నిల్చున్న భానుకి కడుపులో ఎలకలు గంతులేస్తున్నాయి. నోరు తడారి పోతోంది. అంతకంతకీ సహనం సన్నగిలిపోతోంది. రేషన్ డిపో దగ్గిర క్యూలో పావు గంట నిల్చునే ఓపిక లేని తను దాదాపు రెండు గంటలుగా సినిమా క్యూలో పచ్చి మంచినీళ్ళు ముట్టకుండా ఎలా నిల్చోగలిగాడో - తనకే ఆశ్చర్యంగా వుంది. 'అంతా గురువు సంజీవి మహిమ' అనుకున్నాడు భాను.

'కడుపులో కాస్త టిఫిన్ పడేసి - కాసిన్ని టీనీళ్ళు తాగి వస్తే ప్రాణం కుదుట పడుతుంది. కాని తీరా బయటికి వెళ్తే తన చోటు? క్యూలో వున్న వాళ్ళకు నచ్చ చెప్పొచ్చు. అవసరమయితే స్టూడెంటు ప్రివిలేజ్ అడ్డెట్టి దబాయించెయ్యొచ్చు. కాని పోలీసులు బయటికి లాగేస్తారే - వాళ్ళ దగ్గర తన ఆటలు సాగవు...' అనుమానం భానుని

# లాహిరి లాహిరి లాహిరిలో

కదలనివ్వడం లేదు. ఆకలి అతన్ని అక్కడ నిలవనివ్వడం లేదు. !

ఆకలిని తట్టుకోలేక తన సీటు చూస్తుండమని చెపుదామని వెనకనే నిల్చున్న శీను కేసి తిరిగాడు భాను అంతలో హడావిడి. కౌంటర్ దగ్గర లైటు వెలిగిందట. టిక్కెట్టివ్వడం ప్రారంభిం చారట! చేసేది లేక భాను ఆత్మారాముడి నోరుమూయించాడు.

ఇంతలో స్త్రీ క్యూలో పెద్ద అలజడి యస్. ఐ వచ్చి భాను ముందు అయిదారుగురి తర్వాత వున్న ఓ నడి వయసు వ్యక్తిని ఆ స్త్రీల క్యూ దగ్గరకు లాక్కెళ్ళాడు అతను గొణుక్కొంటూ వెళ్ళడం వల్ల మగాళ్ళ వరసకి విషయం అర్ధం కాలేదు కాని – ఒక చోటు ఖాళీ అయినందుకు సంతోషించారు అంతలో నే దానికి సంబంధించిన సమాచారం బట్ట తలాయనకు అందింది

"చెప్పాను గదండీ. ఈ ఆడాళ్ళ సినిమా వ్యామోహానికి అంతు లేదు ఆ పెద్దమనిషి భార్యకు నెలలు నిండాయట వద్దన్నా కూడా సినిమాకు తయ్యారయ్యిందట. రెండు గంటలు క్యూలో నిల్చునే సరికి కాళ్ళ నొప్పులు కాదు – పురుటి నొప్పులు మొదలయ్యాయట. ఆవిడ కేమో – ఈ సినిమా కాస్తా అయిన తర్వాత ఆ నొప్పులు రాకూడదా అని దిగులు . ఈయనకేమో యింత కష్టపడి నిల్చుని కూడా మార్నింగ్ షో చూసే అవకాశం మిస్ అయిపోతున్నానని బాధ బిడ్డ మీద అంత మక్కువేం వుంటుంది? – ఏడో కాన్పో ఎనిమిదో కాన్పో అట. " క్యూలో ముసి ముసి నవ్వులు.

"ఆవిడకు బుద్ధి లేకపోతే పోయింది. ఆ నెలలు నిండిన యిల్లాల్ని ఈయనెలా తీసుకొచ్చాడు? తీసుకొస్తే తీసుకొచ్చాడు – క్యూలో నిల్చోబెట్టడమెందుకు?"

"తప్పదుగా. మనిషికి ఒక టిక్కెట్టే" ముసిలాయన హాలు వారి షరతు జ్ఞాపకం చేశాడు.

"ఆడాళ్ళకి మాత్రం రెండేసి యిస్తారట" పక్కనున్నాయన సవరణ కూడా చెప్పాడు.

"అది మరీ అన్యాయం. ఆడది తీసుకొచ్చే మగాడి మీద నమ్మకం వుంది గానీ – మగాడు తీసుకొచ్చే ఆడదాని మీద నమ్మకం లేదన్న మాట – ఈ హాలు వాళ్ళకి ఇది చాలా అవమానకరమైన విషయం ఉయ్ మడ్ ప్రొటెస్ట్ " బట్ట తలాయన వాక్ప్రవాహాని కంతరాయం కలిగింది. 'క్యూ' సడన్ బ్రేక్ పడింది వెనక వున్న వాళ్ళందరికీ క్షణం గుండె కొట్టుకోవడం మానేసింది – టిక్కెట్టు అయిపోయాయేమోనని!

"ఆడాళ్ళకి రెండు – మగాడికి ఒక టిక్కెట్టు ఏమిటి? నా లైఫ్‌లో క్యూలో నిల్చోలేదు. నీరసం. అందుకని నాకు రెండు టిక్కెట్టు యివ్వాల్సిందే. కావాలంటే మనుషుల్ని చూసి యివ్వండి. మేం ఎంప్లాయిస్ మే కాని బ్లాక్‌లో టిక్కెట్టు అమ్ముకొనే వాళ్ళం కాదు" అని కౌంటర్ దగ్గర ఎవరో వీరోచితంగా పోరాడుతున్నారట పోలీసులు ఆ గొడవని సర్దుబాటు చేస్తున్నారట, అందుకని 'క్యూ' తాత్కాలికంగా ఆగింది కాని టిక్కెట్టు అయిపోలేదు – ఈ వార్త అంచెలంచెలుగా వచ్చేసరికి అందరూ 'అమ్మయ్య' అని ఊపిరి పీల్చుకున్నారు

క్యూలో మళ్ళీ కదలిక.. లాభం లేదనుకొన్న పేషంట్‌లో చలనం కనిపిస్తే ఆనందించే అప్తుల్లా – జనం..

భానుని మెల్లగా గోకాడు శీను. ఉలికి పడి చూశాడు భాను.

"అటు చూడు" ఆడాళ్ళ క్యూకి ఒక పక్కగా ఒత్తిగిలి నిల్చున్న యిద్దరమ్మాయిల కేసి చూపించాడు శీను.

"ఓహ్! మన కాలేజీ బ్యూటీ లకుమ – వాళ్ళ ఫ్రెండ్ వసుధ. ఆలస్యంగా వచ్చినట్టున్నారు పాపం "

"అయ్యో! మనకు రెండేసి టిక్కెట్టిస్తే సాయం చేసి వుండే వాళ్ళం."

"పాపం, జీవకారుణ్య సంఘంలో వుండాల్సిన వాడివి. ఎంత జాలో ..."

భాను, శీను కౌంటర్ సమీపించే సరికి తోపుడు ఎక్కువయింది. ఎలాగో ఆ హింసను భరించి టిక్కెట్టు తీసుకొని ఎవరెస్టు శిఖరారోహణ చేసినంత గర్వంగా కాలర్లు సర్దుకొంటూ బయట పడ్డారు మిత్రులిద్దరూ. 'షో' ప్రారంభం కావడాని కింకా టైముంది. కావాలని లకుమ పక్క నుంచి గేటు వైపుకి దారి తీశారు భాను

"హాయ్! బావున్నారా? సినిమా కొచ్చారా?" లకుమ

లకుమే పలకరించింది ఆ పన్నెండు అక్షరాలూ తేనెలో ముంచినంత తియ్యగా రాలాయి.. భాను ఆశ్చర్యానందాలతో తల మునకలయ్యాడు కాలేజీలో లకుమ పెదవి విప్పి పలకరిస్తే అదృష్టంగా భావిస్తారు హీరోలు అలాంటి లకుమ తనని యింత ఆప్యాయంగా. . కలా. నిజమా?

"అవునండి . మరి మీరు. .?" తేరుకొని అక్షరాల్ని కూడ దీసుకొన్నాడు భాను.

'సినిమా అనుకొని రాలేదు ఇటు వచ్చేసరికి 'మార్నింగ్ షో' వుందని తెలిసింది చూద్దామని లోపలకు వచ్చాం కాని ఈ కొండవీటి చాంతాడంత క్యూని చూసి – నిల్చున్నా లాభం లేదని వెళ్ళి పోదామనుకుంటున్నాం

"నో నో. మీలాంటి వాళ్ళు వెళ్ళిపోవడం మాకు .. మా గురువు సంజీవి గార్కి కూడా అవమానం మీరు ఆయన ఫాన్ అనుకుంటాను

'యా

"మరింకేవండి వెళ్ళననడానికి మీకు నోరెలా వచ్చిందండీ మా టిక్కెట్టు తీసుకోండి "

థాంక్స్ మరి మీకెలా?"

"మే మెలాగో సంపాయిస్తాం లెండి "

'అలా ఎందుకండీ మీరు ట్రై చేసి దొరికిన తర్వాతే మా కివ్వండి' వసుధ మొహమాట పడింది

వసూ. వాట్ డుయు థింక్ ఆఫ్ హిమ్? ఈయన నిజంగా తల్చుకొంటే టిక్కెట్టు కాళ్ళ దగ్గర కొచ్చి పడతాయి" లకుమ ప్రశంసకి భానుని అమాంతం భోళాశంకరుడు ఆవహించాడు

"అవునండీ అంతా మాకు తెలిసినోళ్ళే చిటికలో సంపాయించుకొని వస్తాం ముందు మీరు వెళ్ళి కూర్చోండి' లకుమ చేతిని తాకుతూ టిక్కెట్టు అందించాడు భాను

థాంక్యూ వెరీమచ్ మిమ్మల్ని శ్రమ పెడుతున్నాం" హేండ్‌బాగ్‌లో నుంచి ఇరవై నోటు తీసి అందించింది లకుమ

ఉంచండి భలేవారే ఇలా ఇన్సల్ట్ చేస్తున్నారన్న మాట"

అలా క్కాదు ప్లీజ్ ' నోటు అతని చేతుల్లో పెట్టబోయింది లకుమ

'నో ప్లీజ్ వుంచండి' నోట్ ఆమె కిచ్చే ప్రయత్నంలో ఆమె చేతిని తాకిన భాను వళ్ళంతా వైకం

ఈ సారి లకుమ పోట్లాడ లేదు. మరోసారి



'కవిరాజు' త్రిపురనేని రామస్వామి చౌదరి శత జయంతి ఉత్సవాల సందర్భంగా కొత్తఢిల్లీలో 60 పైసల తపాలా బిళ్ళని విడుదల చేసిన భారత రాష్ట్రపతి జ్ఞానీ జైల్‌సింగ్ వద్ద నుంచి 'స్టాంపు ఆల్బం'ని అందుకున్న రామస్వామి చౌదరి గారి కుమార్తె శ్రీమతి అట్లూరి చౌదరాణిని చిత్రంలో చూడవచ్చు

కృతజ్ఞత చెప్పి లకుమ, వసుధ సెలవు తీసుకొన్నారు.

"గొప్ప పని చేశావు - ఇప్పుడెలా?" శీను కోప్పడ్డాడు.

"ఏం చెయ్యను? లకుమ లాంటి బ్యూటీ క్వీన్‌ని పట్టే అవకాశం మళ్ళీ మళ్ళీ వస్తుందా? లకుమ మనతో సినిమాకి వచ్చిందని కాలేజీలో చెప్పుకొంటే ఎంత ప్రిస్టేజ్?"

"ఏం లాభం? ఎలాగో టిక్కెట్లు సంపాదించినా నెంబరింగ్ సిస్టమ్ వల్ల - పక్కన కూర్చొని సినిమా చూసే అదృష్టం కూడా వుండదు"

"లో పలకంటూ వెళ్తే ఎలాగో ఎడ్జస్టు చేద్దాం లే"

"త్యాగరాజులా డబ్బులు కూడా వద్దన్నావు. మళ్ళీ మనకు పెట్టుబడి..."

"సరిపోతుందిలే. అదిగో... కౌంటర్ దగ్గర ఏదో గలాటా జరుగుతుంది. ఇదే ఛాన్స్. ఎలాగో ప్లేస్ సంపాయిద్దాం... పద."

ఇద్దరూ కౌంటర్ దగ్గరకు పరిగెత్తారు. కౌంటర్ చుట్టూ జనం గుమిగూడారు. పాత సమస్యే. మగాళ్ళకు కూడా రెండు టిక్కెట్లు యివ్వాలని యెవరో డిమాండ్ చేస్తున్నారు. యస్. ఐ. సర్ది చెపుతున్నాడు. అతని పక్కనే హాల్ ప్రొప్రయిటరు కూడా వున్నాడు. ఇంతలో వెనక నుంచి ఎవరో గట్టిగా తోశారు. పెద్ద అలజడి... తొక్కిసలాట... భాను, శీను క్యూలో కలిసి పోయినట్టే... ఇంతలో కానిస్టేబుల్స్ గమనించి లాఠీలు ఝళిపించారు.

'టప్.. టప్.. టప్..' లాఠీలు స్వైరవిహారం చేస్తున్నాయి. శీను తప్పించుకొని క్యూలో ఒదిగిపోయాడు. భాను దొరికిపోయాడు. వంటి మీద అయిదారు దెబ్బలు. కాలి మీద మరీ బలంగా లాఠీ దెబ్బ తగిలింది. ఎముక విరిగినంత బాధ... అయినా సంజీవి సినిమా చూడాలని... లకుమ పక్కన కూర్చోవాలని భాను ఆశ... ఆత్రుత. కాని పోలీసులు రాక్షసుల్లా అతని కాలరు పట్టుకొని బయటకు లాగేశారు. కుంటుతూ బయట పడ్డాడు భాను.

గాయపడిన సైనికుడిలా రోడ్డెక్కిన భానుకి క్యూలో నుండే శీను వీడ్కోలు చెప్పాడు. నడవలేక నడుస్తున్న భానుని ఒంటి చేత్తో వంద మందిని చిత్తు చేస్తున్న పోటుగాడి నిలువెత్తు కటౌట్ వెక్కిరిస్తున్నట్టనిపించింది. 'క్షమించుగురూ... సమయం వచ్చినపుడు ఈ పోలీసుల మీద కసి తీర్చుకుంటాను' అని సంజీవికి మనసులోనే క్షమాపణ చెప్పుకొన్నాడు భాను... నడక మారిన భాను జేబులు తడుముకొని రిక్షా యెక్కాడు.

★ ★ ★ ★

"అయితే యింతకీ టిక్కెట్లు యిచ్చిన ఆ దానకర్ణు డెవరో తెలియదంటావ్? మరి అంత చనువుగా పలకరించావు కదే?" ఏస్తుపోతూ లకుమ నడిగింది వసుధ.

"అబద్ధం చెప్పాల్సిన అవసరం నాకేముందే! మొత్తానికి ఆ కర్ణుడెవరో మన కాలేజీ స్టూడెంటని మాత్రం తెలుసు. అవసరం మనది కనుక అప్యాయంగా పలకరించాను - దాంతో

చూసావా.... మనరంగం ఎంత ప్రగతి సాధించిందో!

ఐసయిపోయాడు మానవుడు" చిరునవ్వు చిందిస్తోంది లకుమ.

"లకుమా, యు ఆర్ రియల్లీ గ్రేట్. జనాన్ని కవ్వించి బోల్తా కొట్టించే నీ టిక్నిక్ అద్భుతం. పాపం... ఆ అమాయక జీవులకు తిరిగి టిక్కెట్లు దొరికాయో - లేదో"

"పోన్లే బాగా డబ్బున్న వాళ్ళలా వున్నారు. టిక్కెట్లకు డబ్బిస్తుంటే కూడా వద్దని స్టైల్ కొట్టాడుగా... దొరక్కపోతే బ్లాకులో కొనుక్కుంటాడులే"

"పాపం అతణ్ణి చూస్తే జాలేసిందే .."

"అమ్మాయి పలకరిస్తే చాలు - పులకరించిపోయే వెధవల మీద జాలెందుకే. ఐ హేట్ దెమ్"

"చాల్లే. వాళ్ళు కాని రావచ్చు... టైటిల్సు వేస్తున్నాడు కూడా... ఇక బుద్ధిగా నోర్మూసుకొని కూర్చోకపోతే పక్కవాళ్ళు బయటకు గెంటేస్తారు."

★ ★ ★ ★

దాదాపు స్పృహ తప్పుతున్న అవస్థలో యింటికి చేర్చబడిన భానుమూర్తిని చూసి అరుగు మీద బట్టలు కుడుతున్న తండ్రి కంగారు పడిపోయాడు.

ఆత్రంగా రిక్షా దగ్గర కొచ్చి 'ఏమైంది?' అని అడిగిన దర్జీ అప్పారావుకి రిక్షావాడు సమాధానం చెప్పలేకపోయాడు.

"ఫ్రెండింటికి వెళ్తుంటే వెనక నుంచి స్కూటరు వచ్చి గుద్దేసింది. పడిపోయాను" లేని ఓపిక తెచ్చుకొని కథ అల్లి, దెబ్బలు చూపించడంతో భాను మాటల్ని చుట్టూ మూగిన వాళ్ళు నమ్మారు. ఆడాళ్ళు హాస్పిటల్‌కి తీసుకెళ్ళమని హడావిడి చేస్తే భానూయే వద్దన్నాడు

తల్లి పక్కింటి నుంచి అప్పు తెచ్చిన టీ పొడితో వేడిగా టీ కలిపి యివ్వడంతో భాను తేరుకున్నాడు.. తల్లి మరుగుతున్న యెసరునీళ్ళు దించేసి - పక్క మీద కూర్చొని ఆ నీళ్ళతో కాపడం పెడుతుంటే భానుకి కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి.

అమ్మ గాయాలకు 'సైబాలు' రాసి, కవుకు దెబ్బలకు సున్నం బెల్లం పట్టు వేస్తుంటే - ఆమెను మోసగించిన భాను మనసు శరీరం కంటే ఎక్కువ బాధతో మెలికలు తిరుగుతోంది. ఆ మలుపుల్లోంచి మనస్సు గతంలోకి జారుతోంది....

★ ★ ★ ★ ★

తన అభిమాన నటుడు సంజీవి నటించిన ప్రతి సినిమా మొదటి రోజు మార్నింగ్ షో చూడ్డం తన కలవాటు. ఆ అలవాటును మిత్రులంతా గొప్పగా చెప్పుకోవడంతో - అది పరువుగా మారిపోయింది. సంజీవి అభిమాన సంఘంవారు అధ్యక్షుడిగా, అధమం ఆఫీసు బేరర్‌గా అయినా వుండమన్నారు. కాని అందుకు ఆర్థిక పరిస్థితి అనుకూలించక, తండ్రి తిడతాడనే భయం వల్ల కేవలం అభిమానిగానే మిగిలి పోయాడు.

'పోటుగాడు' సంజీవి మొట్ట మొదటి సారి ద్విపాత్రాభినయం చేస్తున్న భారీ చిత్రం. కాని, గత వారం రోజులుగా తండ్రి జ్వరం పడ్డంతో కుటుంబం గడవడమే కష్టంగా వుంది. ఆ పరిస్థితుల్లో సినిమాకు డబ్బులడగడానికి మనస్కరించక, మిత్రులకు మొహం చూపించలేక - ఇంట్లోనే వుండి పోవాలని నిశ్చయించు కొన్నాడు. కాలేజీకి సెలవు కావడం వల్ల, తండ్రి కుట్టిన బట్టలకు కాజాలు వేస్తున్న తన బుద్ధిని చూసి యింట్లో వాళ్ళంతా ఆశ్చర్య పడిపోయారు. పదయ్యే సరికి శీను గాడు వెతుక్కుంటూ వచ్చి బయటకు పిల్చాడు. పోటుగాడు సిన్మా సంగతి గుర్తు చేసి - డబ్బుల్లేవంటే తన అహాన్ని రెచ్చగొట్టి వాడికి పెట్టుబడి పెట్టే బాధ్యతను సైతం అప్పగించి మరీ వెళ్ళాడు. వాడు యిలా పాడిదేసి, ముందుకీ సినిమాలకు స్నేహితుల మీద వాలిపోతుంటాడు.

శీను గాడితో మాట్లాడి వస్తుంటే మెడికల్ షాపు కెళ్ళి టాబ్లెట్లు తెచ్చిపెట్టమని తండ్రి పిల్చాడు.

"డాక్టరు గారు రెండు రకాల బిళ్ళలు ఇరవయ్యేసి రాశారు. అన్ని రోజులు రోగం వుంటే మన మెక్కడ బతగ్గలం? నాలుగేసి పట్రారా బాబూ" పది రూపాయల కాగితం చేతిలో పెట్టాడు.

"మరి నిన్న నోట్‌బుక్ కొనుక్కోడానికి

# ఈ వేమన పద్యాలు




జాతి మతము విడిచి చనను యోగికామేలు
జాతి తోడనున్న నీతి లెస్స
మతములన్ని బాపు మనుజుడొక్కడు లేడు
విశ్వదాభిరామ వినుర వేమ.

డబ్బులేవన్నావ్?"

"ఇపుడే రెడ్డిగారొచ్చి యిచ్చారు– ఈ పదీ. ఈ పూట పత్యం పుచ్చుకుని సాయంకాలం లోగా వాళ్ళ పని పూర్తి చేసి యివ్వాలి"

ప్రభుత్వాసుపత్రి పక్కనే వున్న మెడికల్ షాపులో టాబ్లెట్స్ కొనుక్కొని వస్తుంటే పోటుగాడు పోస్టర్లు తనలో కొత్త ఆలోచనల్ని కలిగించాయి. టాబ్లెట్స్ ఖరీదు మూడున్నర. ఏ తొమ్మిదో అయిందని చెపితే మాత్రం తండ్రికేం తెలుస్తుంది? కాని తండ్రిని యిలా మోసగించడం కంటే పుస్తకాలు కొనాలని అయిదు రూపాయలు అడిగి తీసుకోవడం మంచిది... ఈ నిర్ణయంతో యింటిదారి పట్టిన తనకు యింటికి పది గజాల దూరంలో వుండగా తండ్రితో ఘర్షణ పడుతున్న

## లాహిరి లాహిరి లాహిరిలో

చెట్టు చీటీ జగన్నాధం కనిపించాడు.

తను వెళ్ళీ వెళ్ళగానే – తండ్రి టాబ్లెట్లు, చిల్లర తీసుకొని, అయిదు రూపాయల కాగితం జగన్నాధం చేతిలో పెట్టి "ఈసారికి దీనితో సరిపెట్టండి" అంటూ చేతులు పట్టుకొని ప్రాధేయపడ్డాడు

'సరే... ఏదో ఆపదలో వున్నారని వూరుకుంటున్నాను. వచ్చే వాయిదాకి బాకీ మొత్తం యివ్వకపోతే, మిషన్ పట్టించుకు పోతాను" హెచ్చరించి వెళ్ళాడు జగన్నాథం.

తన గుండె బాధతో బరువెక్కి పోయింది– తండ్రిని జగన్నాధం కర్కశంగా హెచ్చరించినందుక్కాదు– ఆ అయిదు రూపాయలూ చేజారి పోయినందుకు!

'డబ్బు.... డబ్బు.. డబ్బు.... కనీసం పది రూపాయలు ఎలాగోలా సాయంత్రంలోగా సంపాయించాలి' తనకు పిచ్చెక్కి పోతోంది. డబ్బులేక చేతులు తీటెక్కిన జూదగాడిలా... నాలుక పీక్కు పోతున్న మందుదాసుడిలా.....

రకరకాల ఆలోచనలు – మురికి వాడలో దోమల్లా... సెకండ్ హాండ్ బుక్‌షాపు వాడికి పుస్తకాలు అమ్మేస్తే? ఎలక్షన్‌లో ప్రచారానికి వెళ్తే?.... ఇంట్లో ఏ వస్తువో కాజేస్తే....

సినిమాలో అయితే హీరోకి డబ్బు సంపాదించాల్సిన అవసరం వస్తే– కుస్తీ పోటీలోనో, సైకిలు పందెంలోనో, జూదంలోనో.... కారు డ్రైవింగ్‌లోనో... నెగ్గేసి డబ్బుతో పాటు హీరోయిన్ ప్రేమను కూడా దక్కించుకుంటాడు– మరి ఇదేం లోకం? ముష్టి పది రూపాయలకు కష్టమై పోతోంది.

ఆలోచిస్తూ మళ్ళీ కాజాలు కుడుతూ కూర్చున్నాడు– సాయంత్రంలోగా యింకెవరయినా వచ్చి డబ్బిస్తే తండ్రిని అడిగే అవకాశం వుంటుందని. చురుక్కు మనడంతో వేలి వైపు చూసుకున్నాడు– రక్తం! సూది లోతుగా గుచ్చుకొని బొటన వేలి నుంచి రక్తం స్రవిస్తోంది. ఎర్రని చిక్కని రక్తం... రక్తం...

మెరపు లాంటి ఆలోచన... మెడికల్ షాపుకి వెళ్ళినప్పుడు ప్రభుత్వాసుపత్రి దగ్గర బ్లడ్ బాంకు బోర్డు చూశాడు. రక్తం యిస్తే ప్రతిఫలం ముడుతుంది– అవును.... రక్తం అమ్మి తన అవసరం....

ఆలోచనని ఆచరణలో పెట్టడానికి అరగంట పట్టలేదు. హాస్పిటల్ గుమ్మం దగ్గర బెదురుతూ తచ్చాడుతున్న తనను ఒక తోటీ పసికట్టి ఏం కావాలని అడిగాడు. తను నసుగుతూ వచ్చిన పని చెప్పాడు. తోటీ ఎవరితోనో మాట్లాడి వచ్చి ఆప్యాయంగా లోనికి తీసుకెళ్ళి, దగ్గరుండి పని పూర్తి చేయించి – వచ్చేటప్పుడు పాతిక రూపాయలు చేతిలో పెట్టాడు.

"ఇంతేనా?"

"ఇంకానయం. గవర్నమెంటోడు యిచ్చేది పద్నాలుగే. అదురుట్టం బావుంది పార్టీ తగిలింది కాబట్టి" కసిరి పంపేశాడు బ్రోకర్‌గా వున్న తోటీ.

"కొందరికి వేలూ లక్షలూ ఖర్చు పెట్టినా పట్టని సీసా రక్తం ఖరీదు ప్రభుత్వం దృష్టిలో పద్నాలుగు..... కేవలం పద్నాలుగు రూపాయలా?" కసిగా రక్త మోడ్చిన డబ్బును జేబులో కుక్కుకొని బయట పడ్డాడు. ..

★ ★ ★ ★ ★

భాను కళ్ళలో గతం కరిగి కన్నీరుగా జారింది. మూలుగుతూ ముక్కుతూ మగతలోకి జారుకుంటున్న భాను చెవుల్లో అభిమాన హీరో సంజీవి, ఆకాశ కుసుమంలకుమ, అవకాశ వాది శీను– ల అవహేళనలు మార్మోగుతున్నాయి... కళ్ళు మూతలు పడుతున్న భాను రకరకాల మత్తులకు బానిసలయిన యువలోకం ప్రతినిధిలా నిస్త్రాణగా పక్క మీద తల వాల్చాడు....! □

1వ వారం

2వ వారం

3వ వారం

4వ వారం

5వ వారం

6వ వారం

# చూడండి! కేవలం 6 వారాల్లో త్వరగా మీ చాయ మెరుగవుతుంది

## క్లియర్•టోన్

### ద్వారా చాయ మెరుగయ్యే పథకం

మీ ముఖంపైన చాయ మరింత మెరుగ్గా మిలమిల మెరిసేలా, ప్రకృతి మీకిచ్చిన వరంలా. క్లియర్•టోన్• చాయను మెరుగు పరిచే క్రీమ్, చేస్తుందిది నిజం.

క్లియర్•టోన్‌ని రోజుకి రెండుసార్లు మృదువుగా రాయండి. దానిలోని మృదుత్వాన్ని మీ చర్మంలో లోపలికి యింకుతూన్న అనుభవాన్ని పొందండి —మిగిలేదిక కేవలం అద్భుతమైన ఆ ఫ్రెంచి సుగంధం. క్లియర్•టోన్ యొక్క 4 విధాల చర్య యిక మొదలు.

**అద్వితీయమైన తీరులో చర్మపు చాయని మెరుగు పరిచే పదార్థం** (మరే క్రీములోనూ లేదు యిది). మీ చర్మం లోపలనుంచి ప్రకృతి సహజమైన ఆ మెరుగు మెరుపును పునరుజ్జీవితం చేస్తుంది.

**సూర్యకిరణాలను వడగట్టగల ప్రత్యేకమైన పొర మీకు** రోజంతా రక్షనిస్తుంది, సూర్యకిరణాల నుంచి నల్లబడకుండా.

**సమృద్ధవంతమైన మాయిశ్చరైజర్ మీ చర్మాన్ని అలా** కోమలంగా యవ్వనంలోని నేవళంగా వుండే ఆ లక్షణాన్ని తీసుకొస్తుంది.

**వారాలు తిరిగే సరికల్లా చర్మంపైన మచ్చలలా మాసిపోతాయి.** అలా చూస్తూచూస్తూ ఆరు వారాలు తిరిగేసరికల్లా క్లియర్•టోన్ తెచ్చే ఆ తేడాని మీరే చూస్తారిక - దేశమంతట్లోని వేలకి వేల స్త్రీలూ యిప్పటికే వాడి అనుభవంలోకి తెచ్చుకున్న ఆ అనుభవాన్ని.

క్లియర్•టోన్ తెచ్చే మెరుగైన చాయను మీరూ చేజిక్కించుకోవాలిక కదూ?




లండన్•ప్యారిస్•న్యూయార్క్

సీరియల్

(గత సంచిక తరువాయి)

రేడియోలో వార్తలొచ్చే సమయానికి రైతు జనమంతా పంచాయితీ రేడియో దగ్గరకు చేరారు– వారిని ఆకర్షించిన వార్త ఆ ముందు రోజే వెలువడింది– అన్ని వార్తా పత్రికలూ ఆ వార్తను ప్రముఖంగా ప్రచురించాయి– ఆ వార్త ప్రభుత్వం భూమి శిస్తును రద్దు చేసిందని!

ఆ వార్త దావానలంలా వూరంతా వ్యాపించింది– రైతుల ముఖాలు ఆనందంతో ఒక్కమారు వెలిగి పోయాయి

ఇది నిజమా? ఎవరిమట్టుకు వారికే సందేహం

అదే నిజమైతే సగం కష్టాలు గట్టెక్కినట్టే అని ఆనందించారు కొందరు

భూమి శిస్తు రద్దువల్ల భూమి మీద తమకు హక్కు పోతుందని మరికొందరు ఆందోళన చెందారు

శిస్తును అప్పటికే చెల్లించిన రైతులు మరి కొందరు తాము చెల్లించిన డబ్బు వాపసు యిస్తారో లేదోనని సందిగ్ధావస్తలో పడ్డారు–

రోజులు గడుస్తున్న కొద్దీ అందరిలోనూ కొద్దో గొప్పో అనుమానాలు మొలకెత్తాయి ఎన్నో సందేహాలు మరెన్నో బయాలు!

భూమిశిస్తు ఏ మేరకు రద్దయిందో అదిపోను యికమీదట రైతులు చెల్లించాల్సిన సెస్సులు వగైరాలు ఏమేరకు వున్నాయో ప్రభుత్వం పత్రికాముఖంగా వివరించనందున శిస్తుతో పాటు సెస్సులు నీటి తీరువా రద్దు కాలేదని తెలియటంతో రైతులు నిరుత్సాహం చెందేరు సరిగ్గా అదే సమయంలో గ్రామాదికార వ్యవస్థను కూడ ప్రభుత్వం రద్దు చేసింది అది చాల మంది రైతులకు ఆనందదాయకం కాగా రెవెన్యూ అదికారులకు మాత్రం తల నెప్పిగా తయారైంది– ఒక వంక పదవులను పోగొట్టుకున్న గ్రామాధికారులు ముఖ్యమైన రికార్డులను అప్పగించడం లేదు– మరొకప్రక్క శిస్తులతో పాటు సెస్సులు, నీటి తీరువా మొత్తం రద్దయ్యాయని బావించిన చాల మంది రైతులు అదికారులతో ఘర్షణకు దిగుతున్నారు–

ఈలోగా ప్రభుత్వం మెట్ట శిస్తును మాత్రమే రద్దు చేసినట్టు ఉత్తరువులు అందాయి–

అప్పటికి గాని అధికారులకు ఓ మార్గం తోచలేదు– వెను వెంటనే మెట్ట భూములకు శిస్తు వసూలును నిలిపి వేశారు– మాగాణి భూముల విషయంలో 80 శాతం నీటి తీరువాగానూ 20 శాతం సెస్సుగాను వసూలు చేయడం మొదలు పెట్టారు–

అయితే తాము స్వంత వనరులను ఏర్పరచుకున్న భూములకు కూడ కొంత మాత్రమే శిస్తు రద్దు చేయడం పట్ల రైతులు చాల చోట్ల అసంతృప్తిని వ్యక్త పరచారు– భూమిశిస్తు రద్దు వల్ల తమకు మేలు చేశామంటూ చెప్పుకోడం బూటకమని మరి కొందరు రైతులు ప్రభుత్వాన్ని దుయ్యబట్టడం మొదలు పెట్టారు– ఏమైనా ఆ పరిస్థితి రైతుల్లోని ఉత్సాహాన్ని చల్లబరచిందనే చెప్పాలి

* * * * * *

చీకట్లు ముసురుకునే వేళ–

పంచాయితీ ఆఫీసు అరుగు మీద, రామ కోవిల దగ్గరా రైతు జనం ఒకరూ ఒకరూ చేరుతున్నారు కొందరు దేశంలో జరుగుతూన్న రాజకీయాలను తెల్సుకునేందుకు పంచాయితీ రేడియో వినడానికి వస్తే మరి కొంత మంది వయసు మళ్ళిన వారు రామా క్రిష్ణా అంటూ కోవిల ముందు కాస్సేపు కూర్చుని కష్టసుఖాలు చెప్పుకోడానికి వస్తున్నారు–

సరిగ్గా ఆ సమయంలో అడ్డ రోడ్డు దగ్గర బస్సు దిగిన ఓ ఆసామీ కాలిబాట గుండా ఆ వూరి వైపు రావడం అరుగుమీద కూర్చున్న ఒకరిద్దరు చూశారు– అతగాడు ఆ వూరికి కొత్తగా అన్పించాడు వారి దృష్టికి– అదే అక్కడి వారితో అన్నారు–

సత్యం అటువంక చూశాడు–

ఆ ఆసామీ అప్పుడే దగ్గర కొచ్చేశాడు తెల్లని ఖద్దరు పంచ, ఖద్దరు లాల్చీ,

జరిగిన కథ –7 ఊళ్ళో పేదల తలలో నాలుకగా ఉండి హత్యకు గురైన దేవుడి కొడుకు సత్యం తండ్రి గుణాలనే పుణికిపుచ్చుకుంటాడు పంచదార కార్మ్డల విషయంలో ఫీల్డ్‌మెన్ అన్యాయాన్ని ప్రతిఘటించి అతనికి గ్రామస్తుల శక్తిని తెలియజెపుతాడు బుచ్చిశెట్టి బావ మరిది ప్రతాప్ పద్మకు చేసిన అన్యాయాన్ని గ్రామస్తుల ముందు పెట్టి బుచ్చిశెట్టిని నిలదీస్తాడు పద్మ కుటుంబాన్ని బెదిరించి బుచ్చిశెట్టి వాళ్ళను ఊరి నుంచి పంపిస్తాడు గ్రామ ఎన్నికల్లో ప్రతాప్ నిలబడుతున్నాడని తెలిసి పోటీగా మాధవయ్య నిలబడాలని గ్రామస్తులు కోరుకుంటారు మాధవయ్య గెలుస్తాడు

పైమీద ఖండువా, బొద్దు మీసాలూ– మనిషి కాస్త ఒత్తుగా ఎత్తుగా వున్నాడు.

ఆ ఆసామీ తిన్నగా అక్కడికే వచ్చి ఎవర్నో ఏదో అడిగాడు. వారు సత్యం వైపు వేలుపెట్టి చూపించారు.

వచ్చిన పని అయినట్టుగా సంతృప్తిగా నిట్టూర్చి అతను సత్యం దగ్గరకు వచ్చాడు– తనెవరో, ఎక్కడ్నించి వచ్చాడో, వచ్చిన కారణ మేమిటో సత్యానికి విన్నవించాడు– రైతులందర్నీ ఒక దగ్గరకు చేరిస్తే తన ఉద్దేశాలూ తదుపరి కార్యక్రమాలూ' వివరంగా చెబుతానన్నాడు...

సత్యం ఎవరెవర్నో పిలిచి ఏమేమో చెప్పాడు– బోగేసుని పిలిచి చాటుగా ఏవేవో మాట్లాడేడు–

అంతే. అరగంటలో రామకోవెల దగ్గరి రైతులూ యింకా యింటి వద్దే వుండిపోయిన వారూ అందరూ అక్కడికి హాజరయ్యారు.

అంతా వచ్చారనుకున్నాక ఆ ఎత్తైన అరుగుమీద ఆ ఆసామీ కూర్చున్నాడు– అతని ప్రక్కన సత్యం, బోగేసూ, మరి కొంత మంది ముఖ్యులనుకున్న వాళ్ళూ, వయసుచేత పెద్దవాళ్ళూ కూర్చున్నారు– తతిమ్మా జనమంతా నేల మీద సావధానంగా కూర్చుని కొత్తాయన చెప్పే దేమిటో వినడానికి ఉపక్రమించారు–

ముందుగా ఆ వచ్చిన కొత్త ఆసామీని అక్కడివారికి పరిచయం చేశాడు సత్యం– ఆ తర్వాత ఆ కొత్తాసామీ గొంతు విప్పేడు.

"సాటి రైతు సోదరు లందరికీ నా నమస్కారాలు– సత్యంగారు నన్ను మీకు గొప్పగా పరిచయం చేశారు– కానీ నేనేం గొప్పవాణ్ణి కాదు– మీలాగే నేనూ ఒక రైతుని. చిన్నతనంలో నాలుగు అక్షరం ముక్కలు నేర్చుకోవడంతో పేపర్లు చదవడం, రాజకీయాల్ని అర్థం చేసుకోడం వచ్చింది– దాంతో మనం... అంటే మన రైతులం ఏ స్థితిలో వున్నామో.... మన సమస్య లేమిటో .... సమస్యల్ని ఎలా పరిష్కరించాలో కాస్తంత ఆలోచించే జ్ఞానం వచ్చింది. అందుచేత మొట్ట మొదటిగా నే చెప్పే దేమిటంటే ఎంత వ్యవసాయం చేసుకుంటున్నా మనం కూడ కొంత చదువు కోవాలి– మనం చేసే పనికీ చదువుకీ సంబంధం లేకపోయినా; మనం కూడ సంఘంలోని మనుషులమే కాబట్టి; సంఘంలోని లోటుపాటులతో మనకు సంబంధ ముంది గాబట్టి మనం ఎప్పటికప్పుడు మన చుట్టూ ఏం జరుగుతోందో తెల్సుకోవాలి– దానికి చదువు ముఖ్యమని నా అభిప్రాయం–

పోతే– నేనూ యీ ప్రాంతానికి చెందిన వాడినే– ఇక్కడ చాల మందికి జీవనోపాధి వ్యవసాయమే. అందులోనూ చెరుకు పండించే రైతులే ఎక్కువ. మన రైతుల బతుకులు సజావుగా లేవు– ఎన్నో సమస్యలు నిత్యం మన చుట్టూ తిరుగు తున్నాయి– కానీ ఎవరికీ చెప్పుకోలేని స్థితిలో వుండిపోయాం. ఐతే యిలా నోళ్ళులేని వాళ్ళలా ఎన్నాళ్ళుంటాం? అంచేత మన సమస్యల్ని ప్రభుత్వం దృష్టికి తీసుకు వెళ్ళి కొన్ని సమస్యల్ని పరిష్కరించమని కోరాలను కుంటున్నాం– కొన్ని సదుపాయాల్ని కల్పించమని అడగాలను కుంటున్నాం– అడగందే అమ్మయినా పెట్టదంటారు గదా– అంచేత, అందరి తరపునా ఏ ఒక్కరో ఇద్దరో వెళ్ళి అడిగితే అందులో బలం వుండదు– నలుగురూ కలిస్తేనే ఏదైనా సాధించగలం– ఇప్పుడు మనం సంవత్సరం పొడుగునా కష్టపడుతున్నా పండించిన పంటకు తగిన గిట్టుబాటు వుండటం లేదు– అన్నపూర్ణ దేశంలో రైతు అన్యాయమై పోకూడదు– అంచేత ప్రతి గ్రామంనించీ ఒక రైతు యీ ఉద్యమంలో పాల్గొవాలనీ ఆ వూరి రైతుల కష్టసుఖాల్నీ, సమస్యల్నీ వివరంగా చర్చించాలనీ అభిప్రాయపడ్డాం. ఇంతవరకూ నేను పాతిక గ్రామాలకు పైగానే తిరిగాను– మనుషుల్ని పోగు చేశాను. మీ ఊరినించి కూడ ఒక రైతును ఎన్నుకుని మీ సమస్యల్ని చర్చించేందుకు మా ఉద్యమంలో పాల్గొనవలసిందిగా కోరుతున్నాను– అయితే మీరు ఎన్నుకునే వ్యక్తి మీ గురించి మీ సమస్యల గురించీ క్షుణ్ణంగా తెలిసిన వాడూ; నిస్వార్థంగా మీ కోసం, మన ఉద్యమం కోసం పాటుబడ గలిగినవాడూ అయితే మంచిది– వచ్చే నెలలో మన జిల్లా కేంద్రంలో తొలిసారిగా చెరకు రైతుల సదస్సు ఏర్పాటు చేస్తున్నాం. అందులో మీరు పంపే వ్యక్తి పాల్గొనవలసి



# తీపిగురుతులు

వుంటుంది. మీరంతా ఆలోచించుకుని ఒకర్ని ఎంపిక చేసి చెబితే బావుంటుంది" అంటూ  ఉపన్యాసాన్ని ముగించేడు–

కూర్చున్న రైతుల్లో కలకలం మొదలయింది– ఎవరంటే ఎవరన్న ప్రశ్న తలెత్తింది– అయితే అందరూ కల్సి ఒక్క పేరునే సమర్ధించారు.

అతను సత్యం'

"మాలో వయసు మీరినోళ్ళు; ఎక్కువ భూమి ఉన్నోళ్ళు; అచ్చరం ముక్క లొచ్చినోళ్ళు శానా మందే వున్నా అందరికంటే కాస్త ఎక్కువ చదువూ, ఆలోచనా వుండి మాకోసం పాటుబడే వాడు ఒక్క సత్తెమే– అయన్నే మాం ఎన్నుకున్నాం" అన్నాడు సంగమయ్య లేచి నిలబడి–

అంతా చప్పట్లు కొట్టేరు–

సత్యం కూడ ముందు మరెవరి పేర్లో సూచించినా అక్కడి వారి అభిప్రాయం మేరకు తనే ఒప్పుకోక తప్పలేదు.

* * * * * *

ఆ రోజు రానే వచ్చింది.

తన గ్రామ రైతుల తరపున జిల్లా రైతు సదస్సులో పాల్గొనడానికి సత్యం బయల్దేరేడు–

బయల్దేరే ముందు బాధ్యతగా తన గ్రామ రైతుల సమస్యలను కనుక్కున్నాడు– ముఖ్యులనుకున్న అందరితోనూ చర్చించాడు– తను సేకరించ గలిగినంత సమాచారాన్ని సేకరించాడు–

ఇప్పుడతనికి చాల ధైర్యం కలిగింది. ఇందరి రైతుల తరపున వెళ్తున్నందుకు గర్వంగానూ వుంది– ఏదో చెయ్యాలనే తలంపూ, పట్టుదలా వున్నాయి

జిల్లా కేంద్రానికి ఆ రోజు చాలమంది రైతులే తరలి వచ్చారు– వారి నందర్నీ చూస్తుంటే సత్యంలో ఎక్కడలేని ఆనందమూ పుట్టుకొచ్చింది– ఇంత మంది తమలాగే సమస్యలతో బాధపడు తున్నారా అన్పించింది. ఇంత మంది ఐక్యంగా వుండి పోరాడితే ప్రభుత్వం తమ సమస్యల్ని తప్పక పరిష్కరిస్తుంది అన్పించింది.

జిల్లా చెరకు రైతుల సదస్సును ప్రారంభిస్తూ రైతు సంఘ నాయకుడు రైతుల నుద్దేశించి ప్రసంగించారు–

ఆయన తన ప్రసంగంలో చెరకు పండించే రైతులు దేశానికి తీపి నందిస్తున్నా తమ జీవితాల్లో ఎదురైన– చేదు అనుభవాల్ని పోగొట్టుకోలేక పోతున్నారనీ; రైతులకు ఉత్పత్తులకు తగిన గిట్టుబాటు ధర రాకపోవ డానికి కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న అవకతవక విధానాలే కారణమనీ, ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు రాబట్టడానికి రైతు లంతా ఐక్యంగా పోరాడాలనీ పేర్కొన్నారు– స్వాతంత్ర్య మొచ్చి మూడు పుష్కరాలు దాటిపోయినా చెరకు రైతుల స్థితి హృదయ విదారకంగానే వుందనీ; పారిశ్రామిక వేత్తల ఆస్తులు మాత్రం కొండల్లా పెరిగి పోతున్నాయనీ ఆయన తన ఆవేదనను వ్యక్తం చేశారు–

ఆ తర్వాత మరి కొందరు వక్తలు మాట్లాడుతూ చెరకు ధరను పెంచడానికి కేంద్ర ప్రభుత్వం చూపుతూన్న కారణాలు సరియైనవి కావనీ; పంచదార పెద్ద ఎత్తున నిల్వ వుండి పోయిందని కేంద్రం చేస్తున్న ప్రచారం అభూత కల్పన మాత్రమేననీ చెప్పారు.

ఉత్పత్తి అవుతున్న పంచదారను విదేశాలకి ఎగుమతి చేయటానికి అవకాశం లభిస్తున్నప్పటికీ కేంద్రం అనుమతి యివ్వక పోవడం వల్ల రైతులకు గిట్టుబాటు ధర లభించడం లేదనీ, మనం ఎన్నుకున్న నాయకులు రాజకీయాల కతీతంగా రైతు సమస్యల పరిష్కారానికి పాటుపడాలనీ, కొన్ని సుగర్స్‌ను జాతీయం చేయటం ద్వారా కొన్ని సమస్యలకు పరిష్కారం ఉండగలదనీ ఆ సభకు అధ్యక్షత వహించిన చెరకు ఉత్పత్తిదారుల రాష్ట్ర సంఘ కార్యదర్శి పేర్కొన్నారు

ఒక పూరి సమితి అధ్యక్షులు మాట్లాడుతూ గత ఐదారేళ్ళుగా ఎరువులు, సిమ్మెంటు, ఇనుము, బట్టలు తదితర వస్తువుల ధరలు ఎన్నో రెట్లు పెరిగి పోయినా చెరకుపై టన్నుకు ఐదు రూపాయల ధర మాత్రమే పెంచి రైతుల కన్నీళ్ళకు ప్రభుత్వం కారణమైందని ఆరోపించారు–

ఆ వివరాలన్నీ విని తెల్సుకుంటూంటే ఒక రైతుగా తనెంత అజ్ఞానంలో పడి వున్నాడో సత్యానికి అర్థమైంది– రైతుల ఐక్య పోరాటానికిచ్చిన యీ పిలుపు అతనిలో నూతనోత్సాహాన్నీ, ఆవేశాన్నీ కలిగించింది.

* * * * *

సత్యం బస్సు దిగేసరికి బాగా చీకటి పోయింది. అలవాటైన మార్గం కాబట్టి, వడివడిగా నడుచుకు వస్తున్నాడు– అతని మనసులో యిప్పుడు ధైర్యంతో కూడిన సంతోషం! ఎంత బలహీనులైనా ఐకమత్యంగా దేనినైనా సాధించ వచ్చున్న నమ్మకం కలిగిం దతనిలో –

చీకటిలో కల్సిపోయి మసగమసగ్గా కన్పించే వూరు ఆ క్షణాన అతనికి అజ్ఞానంలో కూరుకు పోయినట్లని పించింది–

పట్నంలో జరిగిన సంగతులన్నీ అక్కడి రైతాంగానికి వివరించాలి– వారిలో నూతనోత్సాహాన్నీ, ధైర్యాన్నీ తేవాలి అనుకున్నాడు.

గుడిసె అల్లంత దూరం వుందనగానే అతని చూపుల్లో ఏదో సంశయం. గుడిసె ముందు చిన్నా పెద్దా చాల మంది గుమికూడి వున్నారు–

అక్కడేదో జరిగింది. ఏం జరిగింది?

సత్యం కాళ్ళలో ఎన్నడూ లేని వణుకు. నాలుగంగల్లో అక్కడికి జేరేడు– అతన్ని చూసి చాల మంది తప్పుకుని దోవిచ్చారు. సంగమయ్య, బోగేమా కూడ తల లొంచుకుని నేలమీద కూర్చుని వున్నారు–

గుడిసె లోపల గుడ్డి వెలుగు– ఒకరిద్దరు ఆడాళ్ళు లోపలా వున్నారు– ఆతృతగా లోపలికి అడుగు పెట్టేడు సత్యం. నులక మంచం మీద పడుకున్న భార్య వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఆమె ముఖంమీద, చేతుల మీదా రక్కులు– రవిక భుజం మీద చిరిగి వుంది. భర్తను చూసేసరికి ఎక్కడలేని దుఃఖమూ పొంగు కొచ్చిందామెలో– ఏడుపు తప్ప ఒక్కమాట కూడ ఆమె నోటి వెంట రాలేదు– నిండు గర్భిణీ ఆమె– ఎవరు చేశారీ కిరాతక చర్య? అసలేం జరిగింది?

సత్యాన్ని నెమ్మదిగా బయటకు పిల్చి ఉదంతాన్ని వివరంగా విన్నవించేడు సంగమయ్య.

ఒంటిగా వస్తున్న ఆమెను సంత బయల్ని ఎవరో యిద్దరు దుండగులు అడ్డుకుని అల్లరి చెయ్యబోయారట– ఆమె అరుపులు విన్న సంగమయ్య నలుగుర్నీ కేకేసి అటువైపు వెళ్ళేడు– అప్పటికే ఆమె పెనుగులాడుతోంది– కర్రలతో వచ్చే మనుషుల్ని చూసి వాళ్ళు చీకట్లోకి పరుగులు తీశారట–

అంతే! అదే జరిగింది–

జరిగి అరగంటైనా కాలేదు అప్పటికి.

"అదా బుచ్చిశెట్టి చేయించిన పనే అయుంటుంది– రైతులికి వెన్నెముకగా నిల్చి అడ్డి ఎదిరిస్తున్నావని ఎప్పట్నించో నీ మీద నిగా వుంది– దానికితోడు అనసూయమ్మ కూతుర్ని ఎంటేసుకు రాడంతో యింకాడి మనసు నిలవలేక పోయింది." అన్నాడు బోగేసు

సత్యం ఆలోచనలో పడ్డాడు– అతనికా సమయంలో ఎవరిపైనా ద్వేషంగాని కోపంగాని కలగ లేదు– పరిస్థితులలా మారడానికి కారణా లేమిటని ఆలోచిస్తున్నాడు–

ఎదిరించిన తనంటే బుచ్చిశెట్టికి కోపం వుండొచ్చు– కానీ నిండు గర్భిణీ తన భార్య ఏం చేసింది?? "న్యాయాన్ని న్యాయంగా ఎదుర్కోలేక పిరికిగా ఆడాళ్ళమీద పడుతున్నాడన్న మాట!"

అక్కడ కూడిన జనం ఒక్కోరూ ఒక్కో మాటా అన్నారు– బుచ్చిశెట్టిని నిలేసి అడగాలన్నారు కొందరు– ఇలా వూరుకుంటే రేపు వూళ్ళో ఆడాళ్ళపై అక్రమాలకి లోటుండదు అన్నారింకొందరు–

ఏమైనా సత్యం మాట్లాడ లేదు– సహనం, ముందు చూపు అతన్ని బందీ చేసేశాయి.

(ఇంకావుంది)

# This is not just another reference book




THE PATRIKA YEAR BOOK is of course full of Facts and Figures!

It gives plenty of them

Important and up-to-date information about the countries of the world

* Populations
* Natural Resources
* Industrial Production
* Per Capita Income
* Life Expectancy
* Brief Histories
* Flags of the Nations

There are simple and clear maps

All this information makes it a useful reference book

But the PATRIKA YEAR BOOK OF FACTS AND FIGURES 1987 AND STUDENTS GUIDE gives much more!

Candidates preparing for examinations – IAS Preliminary, Bank Services, Service Commissions etc, will find in it concise but informative essays on a variety of topics

Social Sciences
* Economics
* History
* Geography
* Political Science

Also on
* Computers
* Pollution
* Nobel Prizes
* Labour & Industrial Law
* Rural Development
* Sports and Games

Physical Sciences
* Chemistry
* Physics

Natural Sciences
* Botany
* Forestry
* Zoology

A useful section on General Knowledge is also included

This is not all!

There are representative Model Question Papers which candidates appearing for various examinations will find quite helpful

It is priced moderately at Rs 25

All you have to do is to fill up the coupon in this advertisement and send it with your remittance

**Andhra Patrika**
Gandhinagar
Vijayawada 520 003

The Patrika Year Book will be delivered by post or through our agents

**RUSH YOUR ORDER NOW!**

I want the 1987 Patrika Year Book of Facts and Figures
Send me copies @ Rs 25/- each I enclose DD/IPO/MO for Rs

Name________________________

Address________________________

Send this coupon to Andhra Patrika, Gandhinagar, Vijayawada 520 003



శంఖారావం లో కృష్ణ రజని

# సినిమా

## విశేషాలు - జి.వి.జి.

బాధ్యతలు వహిస్తున్నారు రేలంగి నరసింహారావు దర్శకుడు

"అగ్నిపుత్రుడు"

'సనాతన వర్గానికి ప్రతీకగా పీఠాధిపతి పాత్రలో

"మన్మథలీల - కామరాజు గోల"లో ఒక దృశ్యం



### రేలంగి దర్శకత్వంలో వెంకన్నబాబు చిత్రం భలే మొగుడు

ప్రేమ సెంటిమెంట్ హాస్యం కూడుకున్న చిత్రం జూన్ జూలైలలో [illegible] 21వ తేదీ నుంచి పక్షం రోజుల పాటు [illegible] ప్రావీణ్యం గల ఒక కొత్త నటిని పరిచయం చేస్తున్నాం" అన్నారు మహేశ్వరీ మూవీస్ అధినేత ఎస్ పి వెంకన్నబాబు ఈయన నిర్మించే పై చిత్రంలో రాజేంద్రప్రసాద్. రజని సత్యనారాయణ గొల్లపూడి మారుతీరావు, శుభలేఖ సుధాకర్ రాళ్ళపల్లి వై విజయ, అన్నపూర్ణ పాత్రధారులు రమణి కథకు సత్యానంద్ సంభాషణలు కర్త సీతారామ శాస్త్రి గీతాలకు సత్యం స్వరకర్త బి కోటేశ్వరరావు ఛాయ బి నాగేశ్వరరావు సంయుక్త దర్శకత్వం సత్యం ప్రొడక్షన్ మాలి- బి ఆర్ మోహన్ నిర్వహణ

నాగేశ్వరరావుగారు యువతరానికి ప్రతీకగా ఆయన కుమారుడు నాగార్జున ఇరువురి ప్రవృత్తుల మధ్య నతమతమయ్యే తల్లిగా శారద ఒక గంభీరమైన పాత్రలో శివాజీగణేశన్ పోటీపడి నటించారు అన్నారు కె. రాఘవేంద్రరావు ఈయన దర్శకత్వంలో శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించే అన్నపూర్ణా స్టూడియోస్ వారి పై 70 ఎం ఎం స్టీరియోఫోనిక్ సౌండ్ సిస్టమ్ చిత్రంలో రజని సత్యనారాయణ గొల్లపూడి మారుతీరావు నూతన్‌ప్రసాద్ చాట్ల శ్రీరాములు రాళ్ళపల్లి వేలు పి ఎల్ నారాయణ చలపతిరావు బాలాజీ విద్యాసాగర్ అరుణ వై విజయ జ్యోతి జానకి రజిత తదితరమా నటవర్గం పరుచూరి సోదరులు వేటూరి చక్రవర్తి కె ఎస్



భక్త కబీర్‌దాస్ లో చాముండేశ్వరి

ప్రకాష్ భాస్కరరాజు రఘు విజయన్ కోటగిరి వెంకటేశ్వరరావు ప్రభృత సాంకేతిక వర్గంతో వెంకట్ అక్కినేని నిర్మాత

## ఎ కోదండరామి రెడ్డి దర్శకత్వంలో ఎ ఎం సి ప్రొడక్షన్స్ చిత్రం

జాల్– హిందీ చిత్రం మాతృక నాగార్జున సరసన అమల ఖుష్బూ నాయికలు గౌరవ పాత్రలలో కృష్ణంరాజు సరసన జయసుధ మరో కీలకమైన పాత్రలో మురళీమోహన్ కనిపిస్తారు జూలై 11 నుంచి 16 వరకు జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయి పోతుంది అన్నారు ఎ కోదండరామి రెడ్డి ఈయన దర్శకత్వంలో ఎ దొరస్వామి రాజు నిర్మిస్తున్న ఎ ఎం ఎ ప్రొడక్షన్స్ చిత్రంలో రావు గోపాలరావు గొల్లపూడి మారుతీరావు సుధాకర్ మాడా అన్నపూర్ణ ఇతర పాత్రధారులు సత్యానంద్ వేటూరి జొన్నవిత్తుల సుధాకర్ శ్రీనివాసరాజు సదాశివరావు ఆనంద్ బి ఎ సుబ్బారావు రామారావు డి వెంకటరత్నం తెర వెనుక కృషి చేస్తున్నారు


"రెండు తోకల పిట్ట"

రమేష్- ముక్కిలాతో ప్రొడక్షన్, తమ్ముడు సత్యం నిర్వహణలో రవికిశోర్ సమర్పించే ఈ చిత్రానికి కె శారదాదేవి నిర్మాత జూలై విడుదల

## "చిన్న రాజా"

"దిగ్విజయంగా ప్రదర్శింపబడుతూన్న "ఎంగళ్ సిన్న రాజా" తెలుగు పరివర్తనం," అన్నారు తివాలీలోని ప్రముఖ పారిశ్రామికవేత్త అయిన పి. మధు ఈయన లోగడ ప్రేమ సాగరం, ప్రేమ సామ్రాజ్యం, మైథిలీ నా ప్రేయసి" చిత్రాలను అందించారు. ఈయన నిర్వహణలో విజయ ఆదిత్య క్రియేషన్స్ బానర్‌లో పి. స్వర్ణసుందరి నిర్మిస్తున్న "చిన్నరాజా" చిత్రానికి కె భాగ్యరాజా కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంతో పాటు ప్రధాన పాత్రను నిర్వహించారు. రాధ నాయిక. రాజశ్రీ రచన, శంకర్ గణేష్ సంగీతం, రాజ్‌భరత్ ఛాయ, సూపర్ సుబ్బరాయన్ సాహసాలు తెర వెనుక హంగులు


రాధ "చిన్నరాజా"

## బాలు మహేంద్ర రూపొందించిన "రెండు తోకల పిట్ట"

"పిల్లల పట్ల ఎంతో వాత్సల్యం గల ఒక గృహస్థుడు విధి వైపరీత్యం వల్ల భార్యకు దూరంగా ఉండవలసి వస్తుంది ఈ తరుణంలో అతనికొక ప్రేయసి తారస పడుతుంది ఈ నారీమణు లిద్దరి మధ్య ఆ యువకుడు ఎదుర్కొనే సమస్యలు కడుపుబ్బ నవ్వించే రీతిలో ప్రముఖ ఛాయాగ్రాహకుడు, దర్శకుడు బాలు మహేంద్ర రూపొందించారు," అన్నారు స్రవంతి మూవీస్ వారి పై చిత్రం ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ వేమూరి సత్యనారాయణ రాధిక, అర్చన, మోహన్ ప్రధాన భూమికలు నిర్వహించారు. రాజశ్రీ రచన, ఇళయరాజా సంగీతం,

## చిరంజీవితో గీతా ఆర్ట్స్ చిత్రం

### "ప్రాణానికి ప్రాణం"

"తన ప్రాణానికి ప్రాణంగా అల్లారు ముద్దుగా చూసుకునే ఓ పాపకు దుర్మార్గులు అపకారం చేయబోతే తన ప్రాణాన్ని సైతం, ఖాతరు చేయకుండా ఆ పాపను కాపాడిన ఓ విశిష్టమైన పాత్రలో చిరంజీవి అద్వితీయంగా నటించారు, అన్నారు ఎ కోదండరామి రెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అల్లు రామలింగయ్య సమర్పించే గీతా ఆర్ట్స్ వారి పై చిత్రంలో విజయశాంతి, సుమలత, జగ్గయ్య, గుమ్మడి, గిరిబాబు, ప్రసాద్‌బాబు, కన్నడ ప్రభాకర్, రఘువరన్, మమత, బేబీ సుజిత నటించారు. జంధ్యాల, వేటూరి, చక్రవర్తి, లోక్‌సింగ్, బి చలం, తార, చలసాని రామారావు, బాబూరావు, మోహన్ తెర వెనుక కృషి చేశారు. 'జూలై విడుదల" అన్నారు నిర్మాత అల్లు అరవింద్

## జంధ్యాల దర్శకత్వంలో సురేష వారి "అహ నాపెళ్ళంట"

సంపూర్ణ వినోదాత్మక చిత్రం మొదటి షెడ్యూల్ జూలై 1 నుంచి 20, తదుపరి షెడ్యూల్ ఆగస్టు 1 నుంచి 15,' అన్నారు సురేష ప్రొడక్షన్ ప్రైవేట్ లిమిటెడ్ అధినేత డి రామానాయుడు ఈయన నిర్మించే పై చిత్రంలో రాజేంద్రప్రసాద్, నూతన్ ప్రసాద్, కోట శ్రీనివాసరావు, వేలు, వీరభద్రరావు, రజని, డబ్బింగ్ జానకి వగైరా నటవర్గం ఆదివిష్ణు కథ, రమేష్ నాయుడు సంగీతం, గోపాల రెడ్డి ఛాయతో జంధ్యాల సంభాషణల రచన, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

---

రోజుకొక్క సినిమా అయినా చూడందే బ్రతకలేనో ఇక్కడెట్లా జీవితాన్ని గడపటం?





"విజయ్" షూటింగ్ సందర్భంలో టి. సుబ్బరామిరెడ్డి మీనాక్షి శేషాద్రి

హిందీ కబురు...

## స్విట్జర్లాండ్ వెళ్తున్న టి. సుబ్బరామి రెడ్డి యూనిట్!

హిందీ చలనచిత్ర రంగంలో ఒక సంచలనం సృష్టించిన భారీ చిత్ర దర్శక నిర్మాత యాష్‌చోప్రాతో కలసి టి సుబ్బరామి రెడ్డి నిర్మిస్తున్న మల్టీస్టారర్ చిత్రం 'విజయ్" (విజయం) శరవేగంతో తయారవుతోంది –

ఇటీవల బెంగుళూర్‌లో 'మెర్సియర్' హోటల్‌లో 15 రోజుల పాటు ఒక షెడ్యూల్ జరిగింది. ఈ హోటల్ ఇంగ్లాండ్‌లోని ఒక పురాతన రాజభవనం మోడల్‌లో నిర్మించినది కావడం వల్ల... ఈ భవనం అనుపమ్ ఖేర్ భవంతిగా చిత్రీకరించారు– అనుపమ్ ఖేర్ యీ చిత్రంలో కోటీశ్వరుడు ప్రముఖ పారిశ్రామికవేత్త, అందువల్ల ఈ లొకేషన్ తీసుకొన్నారు

### జూలైలో స్విట్జర్లాండ్

జూలై 1 నుండి 12 వరకు స్విట్జర్లాండ్‌లో మరో షెడ్యూల్ జరుగుతుంది ఈ షూటింగ్‌లో అనిల్‌కపూర్ మీనాక్షి శేషాద్రి రిషికపూర్... సోనం . రాజ్ బబ్బర్... మౌసమీ ఛటర్జీ హేమమాలిని మొదలైన ప్రముఖ తారలంతా పాల్గొంటారు

స్విట్జర్లాండ్‌లో జెనీవాకి 200 కిలో మీటర్ల దూరంలో గల పరిసర పర్వత ప్రాంతంలో మూడు పాటలు . కొన్ని సన్నివేశాలు చిత్రీకరిస్తారు.

అగస్టులో 10 నుంచి 30 వరకు. .. ఢిల్లీ పరిసర ప్రాంతాలలో . సెప్టెంబర్ 19 నుంచి 30 వరకూ – హైదరాబాద్‌లో క్రొత్తగా నిర్మిస్తున్న హోటల్ క్రిష్ణా ఓబెరాయ్‌లో ఆఖరి షెడ్యూలు జరుగుతుంది

అక్టోబర్‌లో ఎడిటింగ్ . రీ రికార్డింగ్ మొదలైనవి పూర్తి చేసుకొని – నవంబర్‌లో యీ చిత్రం విడుదల అవుతుంది–

ఈ చిత్రంలో రాజేష్‌ఖన్నా, రిషికపూర్, అనిల్ కపూర్, రాజ్ బబ్బర్, హేమమాలిని, మిస్ ఇండియా సోనం, మీనాక్షి శేషాద్రి, మౌసమీ ఛటర్జీ ముఖ్య భూమికలను పోషిస్తున్నారు వీరితో పాటు అనుపమ్ ఖేర్, శక్తి కపూర్, సయద్ జఫరీ, గుల్షన్ గ్రోవార్, దేవేన్‌వర్మ మొదలగు వారు నటిస్తున్నారు ఇందులో అనుపమ్ ఖేర్ కూతురిగా హేమమాలిని, కొడుకుగా రాజ్‌బబ్బర్, హేమమాలిని కొడుకుగా రిషికపూర్ నటిస్తున్నారు ఈ చిత్రానికి సంగీతం శివ్‌హరి దర్శకత్వం యాష్‌చోప్రా

–సుధ

## మహాశక్తి ఫిలిమ్స్ చిత్రానికి జంధ్యాల దర్శకత్వం

'రాజేంద్రప్రసాద్ హీరో. నవంబర్ నుంచి షూటింగ్," అన్నారు జంధ్యాల. ఈయన స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంతో అంగళ్ళ ఆనందరావు సమర్పించే మహాశక్తి ఫిలిమ్స్ చిత్రానికి కె వి మహదేవన్ సంగీత దర్శకుడు ఎం వి. రఘు ఛాయాగ్రాహకుడు. అంగళ్ళ కస్తూరిరావు నిర్మాణంలో డి. విజయకుమార్ రూపొందిస్తారీ చిత్రాన్ని



"ప్రళయం"లో సాయిచంద్, చిత్ర

## సినిమా



"కృష్ణలీల"లో కళ్యాణచక్రవర్తి, శ్రీదుర్గ

### "కృష్ణలీల"

"రొమాంటిక్ కామెడీ. జూన్ 1 నుంచి 12 వరకు జరిగిన మూడవ షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయింది." అన్నారు రవిరాజా పినిశెట్టి. ఈయన రచన, దర్శకత్వంలో ప్రసాద్ ఆర్ట్స్ క్రియేషన్స్ అధినేతలు పొట్లూరి దుర్గా నాగేశ్వరరావు, ఎస్ సూరిబాబు నిర్మించిన పై చిత్రంలో కల్యాణ చక్రవర్తి, రమ్యకృష్ణ, మోహన్‌బాబు, సత్యనారాయణ, శుభలేఖ సుధాకర్, సాక్షి రంగారావు, చిట్టిబాబు, అప్పారావు, శ్యాంబాబు, ఎస్ వరలక్ష్మి, శ్రీదుర్గ పాత్రధారులు వేములపల్లి మోహన్‌రావు మాటలు, వేటూరి గీతాలు, రాజ్–కోటి సంగీతం, రమణ ఛాయ, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం, సాహుల్ సాహసాలు, శివశంకర్ నృత్యాలు, కనగాల జయకుమార్ సంయుక్త దర్శకత్వం, వెంకటేశ్వరరావు– శాయి ప్రొడక్షన్, రవి కూర్పు నిర్వహిస్తున్నారు

### "నేటి స్వతంత్రం"

"హైదరాబాద్‌లో ఆగస్టు 19 నుంచి ఒకే షెడ్యూల్‌లో సెప్టెంబర్ 25కి షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు టి గోపాలకృష్ణ. ఈయన కథ, దర్శకత్వంలో కె. సూర్యనారాయణ నిర్మించే శాలివాహనా ఫిలిమ్స్ వారి పై తొలిచిత్రంలో దగ్గుబాటి రాజా, షావుకారుజానకి, వై. విజయ, అన్నపూర్ణ, రమ, పొట్టిప్రసాద్, షూడా నటవర్గం. కాశర్ల మాటలు, సి నారాయణరెడ్డి పాటలు, ఎస్. హరనాథ్ ఛాయ, వాసుబాబు సహకార దర్శకత్వం, పి. హెచ్ నారాయణ ప్రొడక్షన్, మోహనరావు కూర్పు నిర్వహిస్తున్నారు. బి. శంకర్ సంగీత దర్శకుడు.

### హీరో కృష్ణ దర్శకత్వంలో తృతీయ చిత్రం

"సింహాసనం, శంఖారావం" అనంతరం హీరో కృష్ణ శ్రీ వెంకట పద్మావతి పిక్చర్స్ భారీ చిత్రానికి దర్శకత్వం వహించబోతున్నారు. విజయవాడ అప్సర థియేటర్ అధినేత డి. కాశీ విశ్వనాథరావు నిర్మాత. ఈయన ఇంతకు ముందు కృష్ణ హీరోగా "బ్రహ్మాస్త్రం" చిత్రం తీశారు. "మా రమేష్, నేను అన్నదమ్ములుగా నటిస్తాం మా ఇద్దరి కాంబినేషన్‌లో ఇదే తొలి చిత్రమవుతుంది ఆగస్టు 20న షూటింగ్ ప్రారంభమై, సెప్టెంబర్ నెలాఖరుకు పూర్తయిపోతుంది" అన్నారు కృష్ణ. ఈ చిత్రంలో జయప్రద, మోహన్‌బాబు, రావు గోపాలరావు, నూతన్‌ప్రసాద్ ఆదిగా గలవారు పాల్గొంటారు వియత్నాం వీడు సుందరం కథకు పరుచూరి సోదరులు స్క్రిప్టు రాస్తున్నారు బప్పీలహరి సంగీత దర్శకుడు. □



కృష్ణ సమర్పించు
పద్మావతి ఫిలింస్
శంఖారావం
ఎడిటింగ్-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: కృష్ణ
నిర్మాత: యు.సూర్యనారాయణబాబు




ఈ తరం యువతరం కోసం
యువనాయకుడు
అందించిన
సమకాలీన జన జీవన
చిత్రం!
వంగవీటి మోహనరంగా సారథ్యంలో
రాధా మిత్రమండలి వారి
చైతన్యరథం
UA
చూడండి!
నిర్మాత:
శ్రీమతి వంగవీటి రత్నకుమారి
దర్శకత్వం: ధవళ సత్యం

# అభిమాన తారలపై అభిప్రాయం

'వేవేల గోపెమ్మల మువ్వగోపాలుడే మా ముద్దు గోవిందుడే " అని ముచ్చటైన ముద్దు గుమ్మల మురిపాల మాటల్లో తడిసి ముద్దయిన అందగాడు కమలహాసన్ నా అభిమాన నటుడు

సంగీత సాహిత్యాల సరిగమలు పలికించినా . నృత్యామృతాన్ని నటనా పాత్రలో ఒలికించినా అమాయకత్వాన్ని అందరి హృదయాలలో



అమర్చినా.... హాస్యరసాన్ని ప్రతి ఎదలో కురిపించినా సూపర్ ఫైట్‌లతో యువకుల్ని ఆనందింప జేసిన కమలహాసన్‌కు సాటి కమలహాసనే

నవరసాలను నటనలో వట్టి ప్రేక్షకులకు అందించి వారి గుండెల్లో అభిమాన సంచలనం సృష్టిస్తూ జాతీయ, అంతర్జాతీయ అవార్డుల 'సాగర సంగమం లో అంతర్లీన మవుతున్న నా అభిమాన స్వాతిముత్యా నికి ఓ చిన్న సలహా

మంచి కథ, హాస్యం, ప్రేమ, నృత్యం కలబోసి రంగరించిన చిత్రాలలో ఎక్కువగా నటించాలని

–ఎస్. వెంకటేశ్వర్లు, విజయవాడ

★ ★ ★

నా అభిమాన నటి విజయశాంతి నటనలో తన ప్రతిభను నేటి భారతం , దేశంలో దొంగలు పడ్డారు , ప్రతిఘటన , "వందేమాతరం" చిత్రాలలో నిరూపించుకొన్నారు ఒక్కొక్క చిత్రం లో ఒక్కొక్క రకం గా దేశంలో దొంగలు పడ్డారులో శాంతియుతం గా. వందే మాతరం లో ఆవేశం గా ప్రతిఘటనలో ఆలోచన. ఆవేశాల



కలయికతో అద్భుతం గా నటించారు అగ్ని పర్వతం చిత్రం చూస్తే ఆమెను విమర్శించక తప్పదు కారణం ఆ చిత్రంలో దుస్తుల అలంకరణ ఓవర్ మేకప్‌ల వల్ల ఆ "శాంతి" ఈ శాంతి' ఒకరేనా అని ఆశ్చర్యపోతాం ఆమె లాయర్‌గా వేయాలని నా ఆశ

-సి. శారద, కలికిరి (చిత్తూరు)

నా అభిమాన నటి సినిహాసిని, సుమధుర భాషిణి, అవార్డుల సుహాసిని నటనతో నవరసాలను చిలికించగల, ముఖ కవళికలు. హావభావాలు ప్రస్ఫుటముగ ప్రదర్శించగల, ప్రేక్షక హృదయాలను స్పందింప చేయగల నేటి మేటినటి నటనకు బాషాబేదాలు అడ్డురావని తెలియజేసిన నటి సున్నితమైనటు వంటి పాత్రలను అవలీలగా మెప్పించుట ఈమెకు వెన్నతో పెట్టిన విద్య. అవార్డులను గైకొనడంలో అందె వేసినచేయి. ఈ ఏడు ఎన్నో విజయాలను సాధించి ప్రేక్షక హృదయాలలో ప్రత్యేకమైన స్థానాన్ని సంతరించు కొంది. ఇంకనూ కథా బలమున్న విభిన్నతరహా పాత్రలను పోషించి తన నటనతో ప్రేక్షకులను మెప్పించి ఎన్నో జాతీయ అవార్డులను గైకొనాలని



నా ఆశ. ఆకాంక్ష.

–సి. ఉమ, భవానీ నగర్, తిరుపతి

★ ★ ★

"రెబల్‌స్టార్" కృష్ణంరాజుగారు నా అభిమాన నటుడు. భక్త కన్నప్ప చిత్రం చూసినప్పటి నుండి



నేను ఆయన అభిమానినయినాను. కటకటాల రుద్రయ్య. మన వూరి పాండవులు, ధర్మాత్ముడు, రావణబ్రహ్మ, బొబ్బిలి బ్రహ్మన్న. తాండ్ర పాపారాయుడు చిత్రాలను చూసిన ప్రేక్షకులు ఆయనను ఆయన నటనాచాతుర్యమును ఎన్నడూ మరచిపోలేరు. ఈ మధ్యన కొన్ని కథాబలం లేని సినిమాలలో నటించి క్రేజ్ పోగొట్టుకొంటున్నారు. అలా కాకుండా మంచి కథాబలం గల సినిమాలలో నటించి ఆంధ్రుల హృదయాలలో చిరకాలం నిలిచిపోవాలని నా అభిలాష

- ఏ. గోపి, విజయవాడ

★ ★ ★

తెలుగు చలన చిత్రరంగంలో దేదీప్యమానంగా వెలుగొందుచున్న అఖండ జ్యోతి, కృషితో, క్రమశిక్షణతో అగ్రస్థాయికి చేరుకున్న నటనా చక్రవర్తి అయిన సుప్రీం హీరో చిరంజీవి నా అభిమాన నటుడు అనతి కాలంలోనే అగ్ర కథా నాయకుడిగా పేరు ప్రఖ్యాతులు సంపాదించి చలన చిత్రసీమలో సంచలన రికార్డులను సృష్టిస్తున్నాడు నాటి ప్రాణం ఖరీదు చిత్రం నుండి నేటి చక్రవర్తి వరకు ఎన్నో వైవిధ్యమైన పాత్రలు ధరించి అఖిలాంధ్ర ప్రేక్షకుల ఆదరాభిమానాలను



చూరగొన్న మహోన్నత నటుడు చిరంజీవి. ఎంత క్లిష్టతరమైన పాత్రనైనా తన అద్భుత నటనా చాతుర్యంతో అత్యంత సమర్థవంతంగా పోషించగలిగే చిరంజీవి అభినందనీయుడు చిరంజీవి నటించిన ప్రతి చిత్రం విజయవంతం కావాలని నా కోరిక నేడు ఆయన నట జీవితం విభిన్న తరహా పాత్రలతో విలసిల్లుతోంది రాబోవు స్వయంకృషి చిత్రంతో చిరంజీవి కీర్తి ప్రతిష్టలు మరింత పెరగాలని ఆశిస్తున్నాను

-కె. పైడినాయుడు, విజయనగరం

★ ★ ★

కుమారి సుహాసిని నా అభిమాన తార మంచు పల్లకి చిత్రంలో మందహాసం తోటి అందరిని ఆకర్షించిన సుహాసిని గారంటే నా కెంతో ఇష్టం కుమారి సుహాసిని నటించనక్కర లేదు ఆమె నవ్వితే చాలు నిర్మాతలకు నవరత్నాలు కురిసినట్లే జాతీయ స్థాయిలో అవార్డు అందుకొని సినీ ప్రపంచంలోనే ఒక అందాల ధృవతారగా వెలుగు చున్నది ఆమె ఫలానా చిత్రంలో బాగా చేసింది ఫలానా చిత్రంలో బాగా నటించలేదు అని చెప్పడానికి వీలుపడదు ఎందుకంటే ఆమె ప్రతి చిత్రం లోనూ నవరసాలు



ఒలికిస్తుంది కీర్తి శేషులు శ్రీమతి సావిత్రి గారి తరువాత కుమారి సుహాసిని గారే సాటి లేని మేటినటి అందుకే ఆమే నా అభిమాన నేటి నటి . ఇలాగే ఎప్పటికి చిత్రపరిశ్రమ వినీలాకాశంలో ఒక ధృవతారగా వెలుగుచూ వుండాలని కోరుకుంటు న్నాను

–మల్లేపల్లి పురుషోత్తమరెడ్డి, శ్రీరామరంగాపురం, (బళ్ళారి) □



కొత్త శీర్షిక ప్రారంభం!

# శతచిత్ర నటి సుమలత సమాధానాలు!

**మేకా శ్రీధర్‌కుమార్, మండపేట**

ప్ర: మన సమాజంలో మార్పు తేవడానికి సినిమాలు ఎంతవరకు ఉపయోగపడతాయి సుమలతగారూ?

జ: చాలావరకు సినిమా శక్తివంతమైన సాధనం. 'శుభలేఖ' చిత్రం చూశాక కట్నం తీసుకోకూడదనే దీక్ష బూనినట్లు ఎందరో యువకులు నాకు లేఖలు రాశారు.

**రాగతి వెంకటరావు, రెడ్డికంచెరపాలెం**

ప్ర: మహాత్ములను బ్రతికుండగా గుర్తించని ఈ సమాజం చనిపోయాక గుర్తిస్తుంది. ఎందువల్ల?

జ: చచ్చిన మనిషి కళ్ళు చేరడేసి - అనడం సమాజానికి సహజమేగా!

**సి. హెచ్. వెంకటేశ్వరస్వామి, వరంగల్**

ప్ర: (1) మొట్టమొదట సినిమాలో నటించినప్పుడు (2) అదే సినిమా 100 రోజులు ఆడినప్పుడు, (3) ఆ సినిమాకు జాతీయ అవార్డు వచ్చినప్పుడు కలిగే సంతోషాలలో ఏ సంతోషం గొప్పది?

జ: (1) ఆనందం (2) పరమానందం (3) మహదానందం

**టి. కృష్ణాజీ, పుంగనూరు**

ప్ర: ఆడది అలంకరించుకోవడంలో కాలాన్ని వ్యర్థం చేస్తుంది. మరి, మగవారు ...?

జ: ఆ అలంకరణను చూడడంలో.

**చోడవరపు నాగేశ్వరరావు, సికిందరాబాదు-25**

ప్ర: అన్ని అర్హతలూ ఉన్నా కొంతమంది అభివృద్ధిలోకి రాకపోవడానికి కారణం చెప్పగలరా?

జ: అవకాశంతో పాటు అదృష్టమూ కలిసి రావాలి.

**రేమని శంకరయ్య, కావలి**

ప్ర: నా కాబోయే భార్య నా పుట్టిన రోజ పండుగనాడు కాస్ట్లీగా కోటు, బూట్లు పంపింది. దీనిని బట్టి నేనేమనుకోవాలి?

జ: ఆమె మిమ్మల్ని ఆపాదమస్తకం ప్రేమిస్తోందన్న మాట!

**పులిపర్తి రవిరాజా, పెద్దపులిపర్రు**

ప్ర: కొన్ని సినిమాలలో స్త్రీల సమస్యలకు ఆత్మహత్యే పరిష్కార మార్గంలా చూపిస్తారు. అదినాకు నచ్చలేదు. మరి, మీకు?

జ: నాకూనూ.

## ఉత్తమ ప్రశ్న

**డి. వసంతలక్ష్మి, బెంగుళూరు**

ప్ర: "శృతిలయలు" చిత్రంలో మీరు అంత అద్భుతంగా ఎలా నటించగలిగారు?

జ: అదంతా కళాతపస్వి డైరెక్టర్ కె. విశ్వనాథ్‌గారి ప్రతిభ.

**బి. చంద్రలేఖ, జమ్మికుంట**

ప్ర: జ్ఞాపకశక్తిని పెంపొందించుకోడానికి ఏం చేయాలి, సుమలతగారూ?

జ: మరపును సాధ్యమైనంత వరకు మరచిపోవడానికి ప్రయత్నించాలి.

**కౌతా కమలకుమారి, హుజూరాబాద్**

ప్ర: డాక్టర్లు రాసే ప్రిస్క్రిప్షన్ చీటీలో దస్తూరీ గజిబిజిగా ఉంటుందేమండీ!

జ: వాళ్ళిచ్చే బిల్లులో మాత్రం దస్తూరీ చక్కగా ఉంటుంది మరి.

**కె. కమలకుమారి, కర్నూలు**

ప్ర: స్త్రీ తప్పు చేస్తే ఏడుస్తుంది. పురుషుడు తప్పు చేస్తే ...!

జ: స్త్రీయే ఏడుస్తుంది.

**జి. వ్యాఘ్రేశ్వరరావు, హనుమకొండ**

ప్ర: మన చేతిలోని ఐదు వేళ్ళూ ఒకే సైజులో ఉంటే?

జ: అన్నం నోట్లో పెట్టుకోడానికి కష్టపడాలి.

**వి. తిరుమలరావు, గరివిడి**

ప్ర: సుమలతగారూ! మీరు కృష్ణతో ఏ కొత్త చిత్రములో నటించుచున్నారు?

జ: "జమదగ్ని"

**ఎన్. ఆర్. స్వామి, హైదరాబాద్-16**

ప్ర: శ్రీ విశ్వనాథ్‌గారి "శుభలేఖ", "శృతిలయలు" సినిమాల్లో మీ నటనా చాతుర్యం ఉన్నత స్థాయికి చేరుకోవటం మీ అదృష్టం. అది కాపాడుకోవడానికి మున్ముందు కూడా అటువంటి కళాత్మక సినిమాల్లోనే నటిస్తే బావుంటుందని నా మనవి. మీరేమంటారు?

జ: మీది మనవి కాదు; హితవు.

**పరుచూరి ఉదయలక్ష్మి, బేతపూడి**

ప్ర: మీరు ఇంత పెద్ద నటి అవడానికి కారణము మీ తల్లి అంటాను. అవునా?

జ: ఏమండోయ్, ఉదయలక్ష్మిగారూ! మమ్మల్నంతా బాగా ఎరిగిన మీకు ఈ విషయం తెలీదా? (మీరంతా ఖులాసాగా ఉన్నారా?) □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న.............................................................

.....................................................................

.....................................................................

పంపినవారి పేరు...............................................

పూర్తి చిరునామా...............................................

# సమదృష్టి

కంచుమర్తి వెంకటేశ్వరరావు

తను కోరుకున్నది సాధించడంలో మనిషి ఎంత కష్టపడతాడో ఆ వచ్చిందానిని కలకాలం నిలబెట్టుకోవడంలో కూడా నిరంతరం శ్రమిస్తాడు డాక్టర్ ప్రభు, అతని మంచితనంను చూసిన వారెవరైనా సరే ఇలాగే అనుకుంటారు మంచి డాక్టరుగా, మంచి మనిషిగా పేరు సంపాదించాడు

తన చదువుకు తండ్రి ఆస్తి మూడు వంతులు కరిగిపోగా ఆ మిగిలిన నాలుగో వంతు కూడా ఇచ్చి ఈ లోకంలో బాధ్యత తీరిపోయినట్లు వెళ్ళిపోయాడు అక్కా చెల్లెలు అన్నా దమ్ములు ఎవరూ లేక పోవడంతో ఉన్నదంతా తన డాక్టర్ కోర్సుకు ఖర్చు పెట్ట గలిగాడు తండ్రి అయితే అతని ఆశలకు ప్రతి రూపమైన తన అభివృద్ధిని ఏమాత్రం కూడా చూడ లేక పోయినందుకు బాధగా ఉంది

సర్జన్ అయింతర్వాత మిత్రులు గవర్నమెంట్ హాస్పిటల్‌కు ప్రయత్నం చేయమన్నారు మెరిట్ కేండేట్ కదా తొందరగా వస్తుందని

ప్రభు ఆలోచనలు వేరు

తండ్రి పేరు మీద చిన్నదైనా సరే ఆసుపత్రిని తెరవాలని అనుకోవడం తరువాయి మిత్రుల సహాయంతో తండ్రి ఇచ్చి వెళ్ళిన నాలుగో వంతు ఆస్తితో ఎనిమిది గదులున్న ఇల్లును అద్దెకు తీసుకుని హాస్పిటలుగా తీర్చి దిద్దేడు అతని హస్త వాసి మంచిదనే పేరు అతి కొద్ది రోజులకే రావడంతో పేదలు మొదలు డబ్బున్న వాళ్ళు కూడా అతని దగ్గర ట్రీట్ మెంటు తీసుకోవడంతో పేరుకు పేరు డబ్బుకు డబ్బు సంపాదించాడు



డాక్టర్ ప్రభు జీవితంలో వెన్నెల పూలు కురిపించడానికి ఇల్లాలుగా రేవతి అడుగు పెట్టింది రేవతి ఎంత అందగత్తో అంత మంచి మనసున్నది ప్రభు నుదుటి చెమటను తన చీర కొంగుతో అద్ది రిలీఫ్ నిచ్చేది గౌరవించేది

డాక్టర్ ప్రభుకు లోటు ఏముంది?

హాస్పిటల్ బిల్డింగ్ సొంతంగా కట్టించాడు

రేవతి కోరిక మీద చిన్న ఇల్లును సింపుల్‌గా, అందంగా కట్టించాడు

ఐదు సంవత్సరాలకు నగరంలో పలుకుబడి గల డాక్టరుగా ఇద్దరు పిల్లల తండ్రిగా ఉన్నత శిఖరం చేరుకున్నాడు

ఆరోజు డాక్టర్ ప్రభు ఇంటికి రాగానే మంచం మీద వాలిపోయాడు అసహనంగా అశాంతిగా ఉంది ప్రభుకు భర్తను ఆస్థితిలో ఎప్పుడూ చూడని రేవతి నెమ్మదిగా అతని ప్రక్కన చేరింది

ఈరోజు కొత్తగా ఉన్నారు

ఆ ఒక్క ముక్కే అంది రేవతి

ప్రభు మరేం మాట్లాడకుండా రేవతిని దగ్గరగా తీసుకుని ఆమె ఒడిలో తల పెట్టాడు ఎంతో రిలాక్స్‌గా ఉంది ప్రభుకు రేవతి భర్తను లాలిస్తున్నట్లుగా అతని తలను నిమురుతూ అలాగే ఉండి పోయింది

ప్రభు మనసంతా ఆందోళా ఉంది

సాయంత్రం హాస్పిటల్‌లో జరిగిన సంఘటన విశ్వనాథం మాటలు ఇంకా కళ్ళముందు మెదులుతున్నాయి

డాక్టర్ మీ ట్రీట్ మెంట్‌లో లోపం చూపించ లేనుగానీ అందరినీ సమదృష్టితో చూసే మీ మంచితనంతో ఏకీభవించ లేక పోతున్నాను మాలాంటి డబ్బున్న వాళ్ళు వందలకు వందలు ఇస్తారు అటువంటి మాకు ప్రత్యేకమైన గదులుంచ కుండా పేదలతో సమానంగా వారి గదులు ప్రక్కనే మావీ ఉంచారు అన్ని గదులూ

ఒకేలా ఉంటే వాళ్ళకూ, మాకూ తేడా ఏముంది?

ఊరులో వ్యాపారస్తుడిగా పేరున్న విశ్వనాథం అలా అనగానే ఖంగు తిన్నాడు ప్రభు

ప్రభు హాస్పిటల్‌లోని పన్నెండు బెడ్‌ల గదులు ఒకేలా ఉంటాయి శుభ్రంగా ఉంటాయి పేదవాడైనా సరే డబ్బున్న వాడైనా సరే ప్రభు దృష్టిలో తేడాలు లేవు అందరినీ సమానంగా చూస్తాడు ఒకే ట్రీట్ మెంటు అందరికీ ఫీజు తక్కువిచ్చే పేదలను చులకనగా చూడడం వందలు, వేలు ఇచ్చే ధనికులకు అట్టహాసాలు చేయడం ప్రభుకు ఇష్టం ఉండదు ఎవరు ఎంత ఫీజు ఇచ్చినా తీసుకుంటాడే తప్ప తక్కువయిందని మళ్ళీ అడగడు అందుకే డాక్టర్ ప్రభు అంటే అందరికీ ఇష్టం

డాక్టర్ ప్రభుకు తోడుగా ఉండే డాక్టర్ మూర్తి కూడా ప్రభు పద్ధతిలానే నడుస్తాడు

జరిగింది నెమ్మదిగా రేవతికి చెప్పాడు

రేవతి చిన్నగా నవ్వి వేదాంత ధోరణిలో నచ్చ చెప్పి ప్రభు చేత నవ్వించింది

అందరూ ఒకేలా ఉంటే సృష్టిలో తేడాలెందుకుంటాయి

* * * * *

పేషంట్లిద్దరికి సీరియస్‌గా ఉండడంతో డాక్టర్ ప్రభు మూర్తి ఆ రాత్రంతా హాస్పిటల్‌లోనే ఉండిపోయారు ఒక రూంలో ఖరీదైన జబ్బుతో విశ్వనాథం మూలుగుతున్నాడు మరో రూంలో కష్టాలతో కన్నీళ్ళతో మగ్గిపోయిన అస్థిపంజరం లాంటి పరందామయ్య తను పోతే ఇద్దరమ్మాయిలు ఏమై పోతారు ఒక్క కొడుకు భుజం మీద అన్ని బాధ్యతలు ఎలా పెట్టగలను అనే బెంగతో మూలుగుతున్నాడు

డాక్టర్ ఎంత డబ్బయినా ఫరవాలేదు మా డాడీని బ్రతికించండి డబ్బు కట్టలు పైకి కనిపించేలా హడావిడిగా తిరుగుతున్నాడు విశ్వనాథం కొడుకు ప్రభుకు తెలుసు అతనెందుకు హైరానా పడుతున్నాడో వీలునామా ఇంకా రాయలేదు విశ్వనాదం

డాక్టరు గారూ మానాన్నను మానుండి దూరం చేయకండి నాన్న లేకపోతే నేనూ, అక్కా చెల్లి అనాథలవుతాం కన్నీళ్ళతో చేతులు పట్టుకుని ప్రాధేయ పడుతున్నాడు పరంధామయ్య కొడుకు

డాక్టర్ ప్రభుకు తెలుసు పరంధామయ్య పరిస్థితి

పరంధామయ్య ఓ ప్రైవేటు కంపెనీలో గుమస్తా ఇద్దరమ్మాయిలు ఒక కొడుకు చాలీ చాలని జీతం భార్య పోయినప్పటి నుండి పిల్లలను కంటికి రెప్పలా చూసుకుంటున్నాడు ఒక్కగా నొక్క కొడుకును డిగ్రీ వరకూ చదివించాడు డిగ్రీలంటే యూనివర్సిటీలు ఇస్తాయి గానీ ఉద్యోగాలు ఇవ్వవు కదా! తండ్రికి తోడుగా ఉండడానికి ఒక బట్టల షాపు నుండి నమ్మకం మీద చీరలు షర్టు, పేంటు గుడ్డలు తీసుకుని సైకిలు మీద పెట్టుకుని ఇంటింటికి తిరిగి అమ్మి కొంత సంపాదిస్తున్నాడు కొడుకు

డబ్బు మనుష్యులను వేరు చేస్తుంది గానీ తన సమక్షంలో ఉన్నంత వరకూ తనకు ఇద్దరూ సమానమే ఇద్దరూ కోలుకోవాలి అనుకున్నాడు డాక్టర్ ప్రభు

ఆ మర్నాడు ఉదయం పది గంటలకు విశ్వనాథం పరంధామయ్యలు కళ్ళు తెరిచారు గండం గడిచింది ఓ వారం రోజుల్లో పూర్తిగా కోలుకుంటారు అన్చెప్పాడు డాక్టర్ ప్రభు

ఫ్లాస్కు పట్టుకుని వచ్చింది రేవతి

డాక్టర్లు ఈ పూటైనా భోజనం చేస్తారా

అని ఇద్దరికీ కాఫీ ఇచ్చింది

చెల్లెమ్మా డాక్టర్ ప్రభు శిష్యరికంలో బాగా పైనవుతున్నాను ఎటువంటి జబ్బయినా సరే అతని చేయి తాకగానే మాయమవుతుంది అన్నాడు డాక్టర్ మూర్తి

ఇంతలో లోపలకు వచ్చాడు విశ్వనాథం కొడుకు

మీ ట్రీట్ మెంట్ సూపర్బ్ అని వందరూపాయల నోట్లు కొన్ని టేబిల్ మీద పెట్టాడు

డాక్టర్ ఇంత డబ్బు ఇస్తున్నందుకు మా లాంటి వాళ్ళకు ముందు ముందు సపరేట్ రూంలు ఏర్పాటు చేయండి

ఎంత నిర్లక్ష్యం ఆ మాటల్లో

లోపలకు కంగారుగా పరుగెత్తు కొచ్చాడు పరంధామయ్య కొడుకు

రావడం తరువాయి ప్రభు పాదాలను పట్టుకోబోయేడు ప్రభు వారించాడు

అతని కళ్ళల్లో నీళ్ళు

డాక్టరుగారూ! మీ మేలు ఈ జన్మలో మరువలేము మా నాన్నకు పునర్జన్మ ఇచ్చారు అన్నాడు

పరంధామయ్య కొడుకు బాగ్‌లోంచి పేకెట్ తీసి దానికి వందరూపాయల నోటు జత చేసి ఇచ్చాడు

డాక్టరు గారూ! మీరిచ్చిన ట్రీట్ మెంట్ ఖరీదైనది కానీ అంత డబ్బు ఇవ్వలేను మా కుటుంబ పరిస్థితులు మీకు తెలిసినవే మీ మంచితనం తెలిసే నాన్నను మీ దగ్గర ఉంచాను డబ్బు ఇవ్వక పోయినా మీ పేరు చెప్పుకుంటాం

డాక్టర్ ప్రభు భుజం తట్టేడు

పేకెట్ విప్పి చూసాడు

ఓ నేత చీర ఖరీదు యాభై రూపాయలు

రేవతీ ఈ చీర కట్టుకో అన్నాడు ప్రభు

రేవతి చిన్నగా నవ్వి గదిలోకి వెళ్ళింది

ఐదు నిముషాల తర్వాత బయటకు వచ్చింది

పరంధామయ్య కొడుకు కళ్ళల్లో కన్నీళ్ళు అవి కొండంత తృప్తితో వచ్చాయి

డాక్టర్ ప్రభు విశ్వనాదం కొడుకుతో చూడు మిష్టర్ డాక్టర్లందరూ డబ్బుకు దాసోహమని నీ నమ్మకం డబ్బు కంటే ముఖ్యమైంది నమ్మకం సమదృష్టితో చూడడం డాక్టరుగా నా ధర్మం మీ డాడీని పరందామయ్యను ఒకేలా చూడడం వలన ఇద్దరూ ఒకేసారి కోలుకో గలిగారు డబ్బును చూసుకుంటే ఇంకో నెల రోజులు మీ డాడీని ఇక్కడే ఉంచగలను డబ్బుకు తగిన ప్రత్యేకమైన ఏర్పాట్లు కావాలంటే మరోసారి నాదగ్గరకు రావొద్దు

అని ఖచ్చితంగా చెప్పి మూర్తి నేను ఇంటికి వెళ్ళి వస్తాను నేను వచ్చిం తర్వాత నీవు వెళ్ళు అని రేవతితో బయటకు నడిచాడు

పరంధామయ్య కొడుకు చేతులెత్తి నమస్కరించాడు

విశ్వనాథం కొడుకు తప్పు చేసిన వాడిలా తల వంచేడు □






సీరియల్

# ప్రత్యూష పవనాలు

జి. భవానీ కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

పట్టుమని పది అడుగులు ఎత్తు అయినా లేని రేకుల ఇంటినీ, కాస్త కండపుష్టి కలవాడు గట్టిగా తలుపు తడితే విరిగి పడిపోతాయేమో అన్నట్టున్న చెక్క తలుపుల్నీ చూస్తూనే ముఖముఖాలు చూసుకున్నారు ప్రహ్లాద్ మనోజ్ లిద్దరూ

కళ్ళు నులుముకుంటూ ఏడుస్తోంది దీపిక ముక్కులో నుంచి నోట్లోకి కాలువలు ప్రవహిస్తున్నాయి జుట్టంతా చెల్లాచెదురై ముఖమ్మీద వీపుమీద పర్చుకుంది చిన్న డ్రాయరు తప్ప ఒంటిమీద మరే ఆచ్ఛాదనాలేదు

పాపా! రెండోసారి పిలిచాక అప్పుడు స్విచ్ నొక్కేసినట్టు ఏడుపు ఆపేసి చూసింది

పాపా! నాన్నగారున్నారామ్మా?

అమ్మా అంటూ లోపలికి నడిచింది మళ్ళీ ఏడుపుని కంటిన్యూ చేస్తూ

ఏడవడం తప్ప తమ రాకని గురించి లోపల చెప్పనట్టు గ్రహించి తలుపు చిన్నగాశబ్దంచేస్తూ దీరజ్! పిలిచాడు

ఎవరూ? బయటికి తొంగిచూసిన లక్ష్మి పైట భుజాల చుట్టూ కప్పుకుని మీరా? లోపలికి రండి ఆహ్వానించింది ఆమె వెనుకే దీరజ్ అన్న రామారావు లుంగీ తప్ప వేరే ఆచ్ఛాదన లేని ఒంటిమీద టవల్ కప్పుకుంటూ హడావిడిపడుతూ బయటికివచ్చి బయటే నిలబడిపోయారు లోపలికి దయచేయండి అంటూ రంగు వెలిసిపోయిన రెండు గాద్రెజ్ కుర్చీలని వేశాడు

ఒక పక్క బట్టల పెట్టెలు మరో ప్రక్క పక్క బట్టలు, పైనుంచి వేలాడుతున్న పేంటులు షర్టులు ఇంకోపక్క బల్లమీద చిందరవందరగా ఉన్న పుస్తకాలు ఆ రెండు కుర్చీలు వేశాక మరో మనిషి నిలబడడానికి కూడా ఇబ్బంది పడాల్సిందేనని గ్రహించి -

బయట కూర్చుందాం రామారావుగారూ! హాయిగా చల్లగా ఉంది అంటూ తనే కుర్చీ అందుకుని బయటికి నడిచాడు ప్రహ్లాద్ మరో కుర్చీని కూడా రామారావు బయటికి తెచ్చివేశాడు ఇంటి ముందు కొంత మేర పేడనీళ్ళు జల్లి అలికినట్టుంది నేల దానిమీద తెల్లగా అందంగా తీర్చి దిద్దినట్టు ఉన్న ముగ్గు

ధీరు స్నానం చేస్తున్నాడు జారిపోతున్న టవల్‌ని భుజాలమీదికి సరి చేసుకుంటూ అన్నాడు రామారావు

రానివ్వండి పరవాలేదు ప్రొద్దుటేవచ్చి మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నట్టున్నాము అతని అవస్థ గమనించి జాలిపడ్డాడు ప్రహ్లాద్

అయ్యయ్యో ఎంత మాట మీ వంటివారు మా యింటికి రావడమే మాకు పండుగ కబురుచేస్తే మేమే వచ్చేవాళ్ళం కదా?

స్నానం ముగించుకుని వచ్చిన దీరజ్‌ని చూసి నవ్వుతూ అదిగో! ఆయనగారు రప్పించాడు మరి అన్నాడు ప్రహ్లాద్

పరిపూర్ణ యవ్వనంతో పుష్టిగా, బలంగా ఉన్న బాహువులు విశాలమైన ఛాతీ మీద నల్లగా నిగనిగలాడుతున్న రోమ సముదాయంతో చూడగానే డాషింగ్ హీరోలా అనిపిస్తున్న దీరజ్‌ని చూసి తృప్తిగా నిట్టూర్చాడు

మా దీరు ఏమైనా పొరపాటుగా ప్రవర్తించాడా సార్? వాడికి తొందరపాటు ఎక్కువ నేను, వాళ్ళ వదిన చెవిన్నిల్లుకట్టుకుని పోరుతూనే ఉంటాము అయినా వాడిదారి వాడిదే అన్నాడు రామారావు గాబరాపడుతూ

రామారావుగారు అనవసరంగా గాబరా పడుతున్నారు వచ్చిన పనేమిటో సూటిగా చెప్పరా నాన్నక అన్నాడు మనోజ్

వీడు మా బావ మా పెద్ద చెల్లెలికి కాబోయే భర్త మనోజ్ అంటూ పరిచయం చేశాడు మనోజ్‌ని

నమస్కారమండి ఇలా మీరిరువురూ మా యింటికి దయచేయడం చాలా సంతోషంగా ఉంది అన్నాడు రామారావు

కాఫీలు తీసుకొచ్చి ఇద్దరికీ ఇచ్చింది లక్ష్మి

ఆకాసేపట్లోనే ఆమె చీర మార్చుకుని తల దువ్వుకుని నీట్‌గా తయారైవచ్చి, చిరునవ్వుతో పలకరించింది ఇద్దరినీ మళ్ళీ లోపలికి వెళ్ళి మరో రెండు గ్లాసులు తెచ్చి భర్తకీ, మరిదికీ కూడా ఇచ్చింది

రామారావుగారూ! మా చెల్లెలు మీ తమ్ముడు ఒకరినొకరు ఇష్టపడుతున్నట్టు తెలిసింది మనసులు కలిసిన ఆ ఇద్దరినీ వివాహ బంధంతో ఏకం చేస్తే బాగుంటుందని మీ అనుమతి కోసం ఇలా వచ్చాము అన్నాడు లక్ష్మినీ, రామారావునీ మార్చి మార్చి చూస్తూ

వారి వెనుక గోడని ఆనుకుని నిలబడి కాఫీ సిప్ చేస్తున్నాడు దీరజ్ ప్రహ్లాద్ మాటలు విని లోపలికి పోబోతూంటే ఏవయ్యా పెళ్ళి కొడుకా! అలా లోపలికి పారిపోతున్నావేమిటి? ఆగు అన్నాడు మనోజ్ నవ్వుతూ

సిగ్గుపడ్డాడు దీరజ్

వాళ్ళిద్దరూ ఇష్టపడుతున్నప్పుడు మాకు అభ్యంతరం ఏముంటుంది సార్? చాలా సంతోషం అన్నాడు రామారావు

ఏమ్మా! మా చెల్లెలు మీకు బాగా తెలుసు మీరు, రామారావుగారు బాగా

జరిగిన కథ – 17 తీర్థయాత్రలకు వెళ్ళిన మారుతీరావు గంగలో ఆత్మత్యాగం చేసుకుంటాడు ఆయన భార్య దుర్గమ్మలో క్రమక్రమంగా మార్పు వస్తుంది ఆమె ఒక కూతురిని కని మరణిస్తుంది పాపను మిగిలిన వాళ్ళు నిరాదరించగా మాలతి తన కూతురితో సమానంగా పెంచుతుంది ప్రకాశరావు వేణుగోపాల్ చనిపోతారు మాలతి ఒంటరిగా పిల్లల్ని పెంచి పెద్ద చేస్తుంది మనోజ్ తల్లిదండ్రుల ముందు నాటకం ఆడి వాళ్ళను పెళ్ళికి ఒప్పిస్తాడు వాళ్ళ తప్పులను గుర్తింప జేస్తాడు ప్రత్యూష – మనోజ్ ప్రఫుల్ల – దీరజ్‌ల పెళ్ళిళ్ళకు మాలతి అంగీకరిస్తుంది



ఆలోచించుకుని ఏవిషయం చెప్తే మిగిలిన ఏర్పాట్లు చూసుకుంటాను" అన్నాడు లక్ష్మితో.

"మేము ఆలోచించుకోడానికేముందండీ. నిజానికి ఇలా రావడానికి మీరు ఎంతో ఆలోచించుకోవాల్సింది. ఇది మేము ఊహించని శుభవార్త. అదృష్టం ఆడపిల్ల రూపంలో మాయింటికి తరలి వస్తానంటూంటే కాదనేంత మూర్ఖులమా? మా ధీరు ఇష్టపడితే మాకు అంతకంటే కావల్సింది ఏముంది?" అంది లక్ష్మి మనస్ఫూర్తిగా.

"ఏవయ్యా ధీరజ్! నువ్వు కూడా ఒక మాట చెప్పేస్తే సెటిల్ చేసుకోవచ్చు." ధీరజ్‌ని అడిగాడు.

"ఈ సంతోష సమయంలో ఏం చెప్పాలో నాకు తెలియడం లేదుసార్. ప్రఫుల్లని నా ప్రాణ సమానంగా ప్రేమిస్తున్నాను. కానీ...... అలాంటి ఇంట్లో అల్లారు ముద్దుగా పెరిగిన మీ చెల్లెల్ని ..... ఇలాంటి ఇంట్లో, చాలీ చాలని సంపాదనతో..... అందుకే మరో ఉద్యోగం ఏదైనా దొరికే వరకూ ఈ విషయం ఎవరితో చెప్పొద్దని ప్రఫుల్లని రిక్వెస్టు చేశాను." అన్నాడు ధీరజ్ తడబాటుతో, గిల్టీగా ఫీలవుతూ.

"చూడు ధీరజ్! నీకు తన చెల్లెల్ని ఇవ్వడానికి వచ్చిన ప్రహ్లాద్ ఆ

# ప్రత్యూష పవనాలు

విషయాలన్నీ ఆలోచించడని ఎందుకనుకుంటున్నావు? ఇన్నాళ్ళ నుంచి అతని దగ్గర పని చేస్తున్నావు నీ గురించి తెలియదుటయ్యా వాడికి. నీ కోసం కాకపోయినా తన చెల్లెలి కోసమైనా ఆ మాత్రం ఆలోచించలేదంటావా?" మనోజ్ అనేసరికి "సారీ సార్! నా ఉద్దేశ్యం అదికాదు….."

"చూడు ధీరజ్! మా చిన్నిని నువ్వు మన స్ఫూర్తిగా ఇష్టపడుతున్నట్లే కదా?" సూటిగా అడిగాడు ప్రహ్లాద్ అతని మాటలకి అడ్డుపడి.

"నిస్సంశయంగా." సిన్సియర్‌గా చెప్పాడు.

"మొన్నటి దాకా దానితో పార్కుల్లో కబుర్లు చెప్పడం, షికార్లకి, సినిమాలకీ తిరగడం నిజమే కదా?"

"నిజమే సార్"!

"దానిని పెళ్ళి చేసుకోడానికి నీకు ఎలాంటి అభ్యంతరం లేదు కదా?"

"ముమ్మాటికీ లేదు"

"మీ అన్నయ్య గారు, వదినగారూ కూడా మీ పెళ్ళికి అంగీకరించినట్లే కదా?"

తల తిప్పి ఇద్దరినీ ఒకసారి చూసి "ఆ మాట వాళ్ళనే అడగాలి సార్" అన్నాడు ధీరజ్.

"మా అభిప్రాయం ఇందాకే చెప్పాము. ఎలాంటి అభ్యంతరం లేదు మాకు" అన్నారిద్దరు ఏక కంఠంతో.

"సంతోషం! ధీరజ్! మనూ కూడా ఈ ఊరికి మకాం మార్చేస్తున్నాడు

ఇద్దరం కలసి ఒక ప్లాన్ తయారు చేస్తున్నాము. దానికి ఇంకా ఒక రూపం రాకపోవడం వల్ల ఆవిషయం ఇప్పుడే నీకు చెప్పలేక పోతున్నాను. నాలుగు రోజులు కాస్త ఓపిక పట్టు. ముహూర్తాలు నిశ్చయం అయ్యే నాటికి నా ఆలోచనలు ఒక కొలిక్కి వచ్చేస్తాయనే అనుకుంటున్నాను. నా చెల్లెలు సుఖంగా, సంతోషంగా ఉండేందుకు నాకు చేతనైంది చేస్తున్నానే తప్ప నీ గురించి నేనేదో రిస్కు తీసుకుంటున్నానని అనుకోవద్దు. ఒక అన్నగా నేను చెయ్యాల్సింది చేస్తానే తప్ప అనవసరంగా మీకుటుంబ విషయాల్లో జోక్యం చేసుకుంటానని కూడా మీరు భావించవద్దు. చిన్ని నీఅభిప్రాయాలు, ఆలోచనలు అన్నీ నాకు చెప్పింది. వాటిని దృష్టిలో పెట్టుకునే నేను అన్నీ సెటిల్ చేస్తాను. అందుకే కట్నాలు, కానుకలు అంటూ మీకు అనవసరంగా ఆశలు కల్పించడం లేదు. అన్నీ మీకు సంతృప్తి కలిగే విధంగా చేస్తానని మాత్రం చెప్పగలను". చెప్పాడు స్పష్టంగా.

"ఎంతమాట అన్నయ్య గారూ! అమ్మాయే మాకు లక్షలు విలువ చేసే కట్నం" అంది లక్ష్మి.

"అవును సార్! నేను కట్న కానుకలని ఆశించి ప్రఫుల్లని ప్రేమించ లేదు. మీరు మీ చెల్లెలికి ఏమిచ్చుకున్నా ఇవ్వకున్నా నాకు సంతోషమే." అన్నాడు ధీరజ్.

"వెరీగుడ్ ధీరజ్! ఇకనేను నా ఏర్పాట్లలో ఉంటాను" ధీరజ్‌తో కరచాలనం చేసి, రామారావుకీ, లక్ష్మికీ చేతులు జోడించి నమస్కరించాడు ప్రహ్లాద్ లేచి నిలబడి.

"థ్యాంక్యూ వెరీమచ్ సార్! మీతాహతుకి తగనని మీరు కోపంతో మండి పడతారేమో నని మీ ఎదుట పడి ఈ మాట చెప్పడానికి ఇన్నాళ్ళు సంకోచించాను. అప్పుడే ఎవరికీ చెప్ప వద్దని ప్రఫుల్లకి కూడా అందుకే చెప్పాను".

"భలేవాడవేనయ్యా! ప్రేమకి అవసరం లేని తాహతు, హోదా పెళ్ళికి మాత్రం ఎందుకయ్యా. అవన్నీ మనం కల్పించుకున్నవే. నీ కంటే గొప్ప హోదాలో వున్నవాడిని తీసుకొచ్చి నాచెల్లెలికి పెళ్ళి చెయ్య గలను. కానీ, నా చెల్లెలి మనసులో ప్రేమ పుట్టించగలనా? దానికళ్ళల్లో తృప్తిని, సంతోషాన్ని నింపగలనా? మనసుకి మనిషికి శాంతిని, సుఖాన్ని తృప్తిని, ఇవ్వని అంతస్థులు, హోదాలు ఎందుకు చెప్పు! కాకపోతే నీకు ఒక విషయం మాత్రం చెప్పాలనిపిస్తోంది. ఏదో మంచి ఉద్యోగం వస్తుంది. అంతవరకూ పెళ్ళి వాయిదా వెయ్యాలని అనుకున్నావు. అలాంటి ఉద్యోగం ఏదీ నువ్వనుకున్నంత తేలికగా దొరకదనీ నీకు తెలుసు. దానిని సంపాదించడానికి ఏ ఉత్తర దక్షిణాలనో ఆశ్రయించక తప్పని దుస్థితిలో ఉంది మనసమాజం అనీ తెలుసు. అన్నీ తెలుసు. కానీ, ఏమీ చేయలేక ….. అవకాశాన్ని కాలానికి వదిలేసి, దైవం మీద భారం వేసి చూస్తూ ఊరుకున్నావు. గతంలో నీకు ఏవో ఎదురు దెబ్బలు తగిలితే తగిలి ఉండవచ్చు. నువ్వు చేసిన ప్రయత్నాలు నువ్వాశించిన ఫలితాన్ని ఇచ్చి వుండకపోవచ్చు . అంత మాత్రం చేత నిన్ను నువ్వే చిన్న బుచ్చుకుంటూ కూర్చుంటే ఎలా? నువ్వనుకున్నట్లు ఏదో మంచి ఉద్యోగం దొరికి పెళ్ళి చేసుకుందాం అని నువ్వు అనుకునే సరికి నీకు షష్ఠిపూర్తి వయస్సు దాటి పోయినా దాటి పోవచ్చు. ఇదంతా చెప్పేది నిన్ను చిన్న బుచ్చాలని కాదు. నీ పొరపాటు ఏమిటో తెలుసుకుంటావని 'ఎనీహౌ! నా చేతుల్లో వచ్చి పడ్డావు కదా? నీ బ్రెయిన్‌ని షార్ప్ చేసి వదిలి పెడతా చూడు. కొన్నాళ్ళలో నన్ను మించి పోతావు" అన్నాడు ధీరజ్ భుజంతడుతూ.

తనపట్ల అతను చూపిస్తున్న అభిమానానికి ధీరజ్ కళ్ళు చమర్చాయి. నోట మాట రాక చేతులు జోడించి నమస్కరించాడు.

"ధీరజ్! మరీ అంత ఒబీడియంట్‌గా వంగి వంగి సలాములు చెయ్యకు. వాడిప్పుడు నీ బాస్ కాదు. బావ. నీ కాళ్ళు కడిగి కన్యాదానం చెయ్యబోతున్నాడు. కాస్త హుందాతనం ప్రదర్శించవయ్యా" అన్నాడు మనోజ్ నవ్వుతూ.

అందరూ శృతి కలిపారు.

* * * * * * * * *

పెళ్ళి అలంకరణలో అపర రతీదేవిలా మెరిసిపోతున్న కూతుళ్ళిద్దరినీ చూడడానికి రెండు కళ్ళు చాలడంలేదు మాలతీదేవికి. ఆనందాశ్రువులతో కళ్ళు నీటి మడుగులవుతున్నాయి.

పీటల మీద కూర్చుని కన్యాదానం చేసే అదృష్టం తనకి లేదు. దూరమైన భర్తని తలుచుకుని లోలోపలే కుమిలిపోసాగింది.

పెద్దరికం నెత్తిన వేసుకుని సతీసమేతంగా పీటల మీద కూర్చుని ఇంచుమించుగా తన వయస్సే వున్న ధీరజ్, మనోజ్‌లకి కన్యాదానం చేశారు ప్రహ్లాద్.

భర్తల వెంట తడబడే అడుగులతో తల్లి దగ్గరకి వచ్చి పాదాభివందనం చేశారు చిన్ని, మున్నిలు.

కూతుళ్ళిద్దరినీ అక్కున చేర్చుకొని ఆనందాశ్రువు లక్షింతలు కాగా మనసారా ఆశీర్వదించింది మాలతీదేవి. చూపరుల కళ్ళు చమ్మగిల్లాయి.

"తల్లి నాకంటే ముందుగా మిమ్మల్ని ఆశీర్వదించవలసిన పెద్దలు ఇంకా ఉన్నారు" అంటూ నూతన దంపతులని తన గదిలోకి తీసుకెళ్ళింది.

మారుతీరావు, దుర్గమ్మ, ప్రకాశరావు, వేణుగోపాలరావుల ఫోటోలు కర్పూరపు దండలు, అగరువత్తుల పొగ మధ్య నుంచి కనిపిస్తున్నాయి.

నలుగురూ వినమ్రులై నమస్కరిస్తుంటే మాలతీదేవి పైట చెంగులో ముఖం దాచుకుంది.






# సుప్రీమ్ వక్కలు

# సుప్రీమ్ సుగంధ ద్రవ్యాలు







# సుప్రీమ్ ఫార్ముల

మేలు రకములైన పీటి వక్కలు. విలువైన యాలుక్కాయలు,లవంగాలు, జాజికాయ, జాపత్రి, మెంథాలు, పచ్చ కర్పూరం మొదలైన సుగంధ ద్రవ్యాలు, వక్కపొడి తయారిలో మాకున్న అనుభవం, మీకు అత్యుత్తమమైన వక్కపొడి అందించాలనే మా 30 సంవత్సరముల అహర్నిశ కృషి, అన్నిటికి మించిన మీ అభిమానం, వీటి అన్నిటి కలయికల ఫలితమే.




# క్రేన్

## వక్కపొడి
## సుప్రీమ్ క్వాలిటీ

దీనికి సాటి మరొకటి లేదు.

TARA-CBNP-768

# ప్రత్యూష పవనాలు

ప్రహ్లాద్ తల్లి పక్కకి చేరి అమ్మా ఊరుకో, నిన్నటి దాకా వాళ్ళకి పెళ్ళిళ్ళు చెయ్యాలని ఆరాటపడ్డావు వాళ్ళు కోరుకున్న వరుళ్ళతో అయిపోయాయి నీ బాధ్యత తీరినందుకు సంతోషించాలిగానీ బాధపడితే ఎలా? ఆడపిల్ల అన్న తరువాత ఎప్పటికైనా అత్తవారింటికి పంపక తప్పదు కదా!" తల్లిని అనునయించాడు.

"ఈ ఇల్లు విడిచి వెడతారన్న మాటేగానీ ఎంత దూరమని? పక్క వీధేగా! పది నిముషాలు రాకపోక. నీ పిల్లలు నీ కంటి ముందున్నట్లే కదా వదినా" అంది సావిత్రి

"నీకు తెలియదు సావిత్రీ! వాళ్ళని విడిచి నేనెప్పుడు ఒక్క రోజు కూడా ఉండలేదు. ఇప్పటికీ పసిపిల్లల్లా వచ్చి నా పక్కలో పడుకుంటే తప్ప నిద్ర పట్టదు వాళ్ళకి"

అనగానే, "ఇంక ఇప్పుడు నీ పక్కలో పడుకున్నా నిద్రపట్టదు వాళ్ళకో తోడు కుదర్చావుగా" ఎవరో వేళాకోళం చేసేసరికి అందరూ పక్కున నవ్వారు.

ప్రఫుల్ల, ప్రత్యూష సిగ్గుతో తలలు దించుకున్నారు.

అందరూ భోజనాల హడావిడిలో ఉండగా మాలతీదేవి ప్రఫుల్లని పిలిచి ఆమె వాటాకి వచ్చిన దుర్గమ్మ బంగారాన్ని తీసి యిచ్చింది

"నాకేయిస్తున్నావు అక్కకి ఏవమ్మా?" అడిగింది తెల్లబోతూ

"తల్లీ! నీ కన్నతల్లి గుర్తుగా నీ కోసం ఇవి దాచిపెట్టాను"

"క్షమించమ్మా నువ్వే నాకు, అక్కకి కూడా తల్లివి ఏమి ఇచ్చినా ఇద్దరికీ సమానంగా ఇవ్వు' అని, మాలతీదేవి చేతుల్లో పెట్టేసింది

అది కాదమ్మా "

అమ్మా! దయచేసి నన్నేడిపించవద్దు కాస్త ఇద్దరికీ ఇవ్వు లేకుంటే లాకర్లో అలాగే ఉండనీ కొన్నాళ్ళు పోయాక ఇవి చెరిపించి వేరే నగలు చేయించి తాతమ్మ బంగారం అని చెప్పి పాపలిద్దరికీ ఇచ్చెయ్యి" అంది

గత్యంతరంలేక "మున్నీ ఇలా రామ్మా' పిలిచింది

ప్రత్యూష దగ్గరికి రాగానే ప్రఫుల్ల ఆ నగలలో నుంచి చంద్రహారం గొలుసు తీసి తన మెడలో వేసుకొని, తెల్లరాళ్ళ నెక్లెస్ తీసి ప్రత్యూష మెడలో వేసింది. గాజుల జతలు రెండు తీసి ఇద్దరి చేతులకీ తొడిగి 'అమ్మా! మిగిలినవన్నీ మోటుగా ఉన్నాయి మెల్లగా వాటిని చెరిపించి పాపలిద్దరికీ ఏదయినా చేయించు" అని చెప్పి మాలతీదేవి నోటికి తాళం వేసింది

ప్రఫుల్ల ఒంటరిగా ఉన్న సమయం చూసి సావిత్రి ఆహ్వానంతో పెళ్ళికి వచ్చిన సుగుణ - సుశీల సావిత్రితో పాటు లోపలికి వచ్చి "చెల్లాయ్!" అంటూ పలకరించబోయారు

చేతులు జోడించి నమస్కరించి 'క్షమించండి ఆంటీ అక్క అత్తగారుగా మీపట్ల నాకెంతో గౌరవం ఉంది దయచేసి ఆ గౌరవాన్ని పోగొట్టుకుని నలుగురిలో నన్ను చెడ్డదాన్ని చెయ్యొద్దు' అంది మృదువుగా.

"పోనీలేమ్మా అక్కలుగా కాకపోయినా మేనత్తలం అని అయినా అంగీకరిస్తున్నావు కదా!' అంది సుగుణ.

"నేను అంగీకరించేది ఏమిటి ఆంటీ నాన్నగారికి చెల్లెళ్ళు అయినప్పుడు మేము ఒప్పుకోకపోయినా మాకు అత్తలే" అంది చిన్నగా నవ్వుతూ.

"సంతోషం చిన్నీ అప్పుడు మేమేదో పొరపాటుగా ప్రవర్తించిన మాట నిజమే నువ్వు కలకాలం పిల్లా పాపలతో సుఖంగా ఉండాలని ఇప్పుడు మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తున్నాము"

వారి ముగ్గురికీ పాదాభివందనం చేసి "థాంక్యూ ఆంటీ" అంది, వారి పట్ల ఉన్న ద్వేష భావాన్ని పూర్తిగా విస్మరించి

ఆ సాయంకాలం గుంటూరులోని ఇల్లు, మిల్లు అమ్మిన తాలూకు డబ్బు తీసుకొచ్చి ప్రహ్లాద్ ఇవ్వబోతూంటే కూడా నిరాకరించింది ప్రఫుల్ల







"అన్నయ్యా! నువ్వు ఏమివ్వదల్చుకున్నా అక్కకీ నాకు సమానంగా ఇవ్వు" అని స్పష్టంగా చెప్పింది.

"అదికాదు చిన్నీ. ఇది అన్నయ్య, నేను నీకు బహుమతిగా ఇస్తున్న డబ్బు ..." అంటూ నచ్చచెప్పబోయింది ప్రత్యూష.

"ఇంత ఖర్చు చేసి నాకిష్టమయిన వారితో నా పెళ్ళి చేశారు అదే నాకు పెద్ద బహుమతి. అక్కా! అంతగా నీకు ఇవ్వాలనిపిస్తే ఏదైనా చీర కొనిపెట్టు. లేదా నాకిష్టమయిన పిండి వంట ఏదయినా చేసి పెట్టు. తింటాను. అంతేగానీ, వేలకి వేలు గుమ్మరించాల్సిన పనిలేదు. మీరిచ్చే డబ్బు నామీద మీకున్న అభిమానానికి కొలబద్ద కాదు. మీరిద్దరూ నన్ను ఇలా ప్రత్యేకంగా చూస్తున్నారంటే నేను మీ చెల్లెల్ని అనే భావం మీ మనస్సులో నుంచి తుడిచిపెట్టుకు పోయిందని నేను అనుకోవాల్సి వస్తుంది".

"చిన్నీ" ప్రఫుల్ల నోరు మూసి గట్టిగా కౌగలించుకుంది ప్రత్యూష.

"చాలక్కా! ఆత్మీయమైన ఈ పిలుపు ఆ డబ్బు కంటే ఎన్నో లక్షల విలువైనది. అన్నయ్యా! మీ బావమరుదులు ముగ్గురూ కలిసి ప్రారంభించబోయే మారుతీ ఇంజినీరింగ్ వర్క్స్‌కి పెట్టుబడిగా తాతయ్య ఇచ్చాడనుకుని ఈ డబ్బు ఉపయోగించు. తాతయ్య ఆశీర్వాదంతో ఆ సంస్థ దినదినాభివృద్ధి చెందితే దాని ఫలితాన్ని నువ్వు, అక్క, నేను కూడా అనుభవిస్తాము."

"దానికి గవర్నమెంటు నుంచి 'లోను' తీసుకుంటున్నాము కదా"

"అయినాసరే. అలాంటి పన్లు మొదలుపెడితే ఎంత డబ్బూ చాలదు మధ్యలో ఇబ్బంది పడాల్సిన పనుండదు. మా పెళ్ళిళ్ల పేరుతో నువ్విప్పుడు బోలెడు డబ్బు ఖర్చు చేశావు. ఇద్దరి కోసం మూడేసి వేలు అడ్వాన్సు ఇచ్చి పెద్ద పెద్ద ఇళ్ళు అద్దెకి తీసుకున్నావు. ఆ ఇళ్ళకి తగ్గట్టు అవసరమైన ఫర్నిచరు ఇంకా ఏవేవో కొని ఇళ్ళు నింపావు".

"బాగుందమ్మా. చెల్లెళ్ల కోసం అన్న ఈమాత్రం చెయ్యడం గొప్పేమిటి? నాన్న ఉండి ఉంటే ఆడపిల్లలని మీకు ఇంకా ఎంతో ముట్టచెప్పేవారు. అయినా చిన్నీ నువ్వు ఇంత లోతుగా ఆలోచించడం ఎప్పుడు నేర్చుకున్నావమ్మా. పెళ్ళి ఆడపిల్లకి పెద్దరికాన్ని ఇస్తుందంటారు. పెళ్ళయ్యి ఇంకా ఒక్క రోజు కూడా కాలేదు. ఇంతంత పెద్ద పెద్ద మాటలు మాట్లాడేస్తున్నావు. ఆస్తి ఇవ్వలేదని అలిగి పోట్లాడేవాళ్లని చూశానుగానీ, ఇదేమిటమ్మా" అంటూ అప్రయత్నంగా తలతిప్పి సావిత్రి, సుగుణ, సుశీలల వైపు చూశాడు.

"ఒరే భావా నేను ముందే చెప్పాను కదరా, చిన్ని అందరిలాంటి అమ్మాయి కాదని. ఇంక, తనని బాధపెట్టకు. ఆ డబ్బు తీసి పక్కన పెట్టేయ్" అన్నాడు మనోజ్.

"ఆ! అందరిలాంటిదాన్ని కాదు. స్పెషల్‌గా పైనించి దిగొచ్చాను. ఇదిగో బావా! ఏదో అన్నయ్య స్నేహితుడివి కదాని ఇంతకు ముందు నువ్వెలా మాట్లాడినా సహించాను. మా అక్కని పెళ్లాడి నా చేతికి చిక్కావు. ఇక చూస్కో నా తడాఖా!" తర్జనితో బెదిరించింది.

"హతోస్మి! ఉరుము ఉరిమి మంగలం మీద పడినట్లు నామీద ధ్వజం ఎత్తావేమిటి?" భయం నటించి ధీరజ్‌తో "ఇదిగో బ్రదరూ! మా మరదలు చీమ్మిరపకాయ ఎలా వేగుతావో ఏమిటో?" సానుభూతిగా అన్నాడు.

"ఆ సంగతి ఆయనకి తెలుసుగానీ, నీ సంగతి నువ్వాలోచించుకో. మా అక్క సీమటపాకాయ. ముందు కామ్‌గా ఊరుకుని ఒక్కసారి భగ్గుమంటుంది. పాపం! దానితో నువ్వెలా వేగుతావో ఏమిటో - ఆ దేముడికే తెలియాలి". అంది చేతులు జోడించి గాల్లో నమస్కరిస్తూ.

ప్రహ్లాద్ వైపు చూపిస్తూ "ఇదిగో ఈ చిచ్చుబుడ్డితో మా చెల్లాయి వేగడంలేదూ? మేమూ అంతే. కోరి కట్టుకున్నాక తప్పుతుందా? ఏం బ్రదరూ" సపోర్టు కోసం ధీరజ్‌ని ఆశ్రయించాడు.

"అంతేకదా! ఏమాట కామాటే చెప్పుకోవాలి. మీ మరదలు మాణిక్యం కంటే మా వదినగారు కాస్త బెటరేలెండి" అన్నాడు ధీరజ్ ఓదార్పుగా.

వత్సల నవ్వుతూ, "అన్నయ్యలూ! పెళ్లయి ఇంకా ఇరవై నాలుగు గంటలు కాలేదు. ఇప్పటి నుంచీ మా మరదళ్లని ఆడిపోసుకోవడం ఏం బాగాలేదు" అంది -

"హతోస్మి! నువ్వు అప్పుడే అపోజిషనులో చేరిపోయావా? అబ్బెబ్బె! మరీ రాజకీయ నాయకుల బుద్ధులు వచ్చేస్తున్నాయి నీకు. వెరి బేడ్ వెరీ బేడ్".

"ఒరేయ్ బావా! ఇప్పటికే డాక్టరై కొంతమంది ప్రాణాలు తీస్తోంది. ఇంక రాజకీయాల్లో కూడా అడుగు పెట్టిందంటే ఏ క్షణంలో ఎవరిని వెన్నుపోటు పొడుస్తుందో తెలియక మేందరం హడలి చావాలి" అన్నాడు ప్రహ్లాద్.

"అబ్బబ్బ అన్నయ్యా! రూటు మార్చండి. మీరు హాస్యాలాడుకుంటున్నారో దెప్పుకుంటున్నారో తెలియక విన్న వాళ్లందరూ హడలిపోయే ప్రమాదం ఉంది" హెచ్చరించింది ప్రత్యూష.

అందరూ చిరపరిచితులే కావడం వల్ల [illegible] నవ్వుకుంటూ [illegible] కబుర్లు చెప్పుకుంటూంటే పసిపిల్లలిద్దర్నీ చెరో పక్క పడుకోబెట్టుకుని ముచ్చటగా చూస్తూ కూర్చుంది మాలతీదేవి.

ఒక ప్రక్క చెప్పలేనంత సంతోషం మరో ప్రక్క భర్త, తండ్రి, మావగారు పదే పదే గుర్తు రావడంతో చెప్పలేనంత దుఃఖం కలుగుతున్నాయి.

శుభమాని కూతుళ్ల పెళ్ళిళ్ళు చేసి నిండింట్లో కంట తడిపెట్టుకోకూడదని మనసుకి కళ్లెం వేస్తోంది.

నునుసిగ్గు దొంతరలతో భర్తల వైపు ఓర చూపులు చూస్తూ, చిలిపి నవ్వులు విసురుతూ కబుర్లు చెప్పుకుంటూన్న కూతుళ్లనీ, కోడలినీ తృప్తిగా చూస్తూ కూర్చుంది మాలతీదేవి.

తాను భర్తతో దాంపత్య జీవితం గడిపింది కొద్దికాలమే అయినా అంతులేని అనురాగాన్ని చవిచూసింది. తనని తాను మరచిపోయి ఆ ప్రేమసాగరంలో ఓలలాడింది. పున్నమినాటి వెన్నెల వానలో తడుస్తున్నట్లు పరవశిస్తూ, అంతులేని ఆనందాన్ని అనుభవించింది. ఆ రోజుల్ని నెమరేసుకుంటూ తృప్తిగా కళ్ళు మూసుకుంది మాలతీదేవి.

ఇన్నాళ్ళు గుండెలో గుప్తంగా దాచుకున్న రహస్యాన్ని బయటికి వెలిబుచ్చేయడం వల్ల మనసంతా తేలిగ్గా హాయిగా ఉంది

మెల్లగా కళ్ళు తెరిచి భర్త, తండ్రి, అత్తగారి, మామగారి ఫొటోలకేసి చూసింది చమర్చిన కళ్లతో

(అయిపోయింది)

# మలుపు

## కె.వి.యస్.వర్మ

"అయిదివ్వండి బాబూ"

"ఏటీ, అయిదా? ఆశకంతుండాలి. మూడు తీసుకో"

"కిట్టదు సావీ. కోసుడు దూరవెళ్ళాల. మీకు తెల్దా బాబూ, మద్దినంతా ఆప్పే – లాక్కెల్లాల్సిందే" అన్నాడు ఏసురత్నం తువ్వాలుతో ముఖం తుడుచుకుంటూ.

"మూడున్నర యిస్తాను. నీకిష్టమైతేరా, లేపోతే లేదు" అని లాల్చీ జేబులోంచి రుమాలు తీసి నుదుటికి పట్టిన చెమట తుడుచుకుంటూ ముందుకు కదిలాడు అతను.

ఏమీ పాలుపోక ఏసురత్నం రెండు నిమిషాలలాగే నిలుచుండి పోయాడు.

అతను వెనక్కి చూడకుండా తాపీగా ముందుకే నడుస్తున్నాడు.

మరీ మూడున్నరకే బేరమొప్పు కోడమా? తిరుగు బేరం లేక పోతే ఈసురోమంటా రావాల. ఈ బేర మొదిలేసుకుంటే మూడున్నరా పోతాది – ఏసురత్నానికి బేర మొదులు కోడానికి మనసొప్పలేదు.

రిక్షా ఎక్కి గబగబా పోనిచ్చాడు.

"ఎక్కండి బాబూ"

"నేనెక్కను. ముందే ఈ మాటనొచ్చుగా, నన్ను కొంత దూరం నడిపించాక, నువ్వెక్కమంటే ఎక్కేస్తానను కున్నావా?" అన్నాడతను ముఖం చిట్లించుకుంటూ.

"కిట్టదని వెంటనే ఒప్పులేక పోయాను సావీ. కోపగించకండి"

"కిట్టక పోతే ఇప్పుడెందు కొచ్చావ్".

"తప్పక సావీ. బరిదద్దయినా సంపాయించాలికదా బాబూ" అన్నాడు ఏసురత్నం వినయంగా.

అతనేమనుకున్నాడో రిక్షా ఎక్కి కూచుని "పోనీ" అన్నాడు.

"అమ్మయ్య" అనుకుంటూ ఏసురత్నం పెడల్ మీద బరువుగా కాలేశాడు.

సూర్యుడు నడినెత్తి మీదున్నాడేమో ఎండ పేలి పోతోంది.

అంత ఎండలోనూ ఆ పట్నం మెయిన్ రోడ్డు హడావుడిగా వుంది. మెయిన్ రోడ్డు కటూ యిటూ వున్న షాపుల్లో చిన్నా, పెద్దా బేరాలు సాగిపోతున్నాయి.

రద్దీని తప్పించు కుంటూ ఏసురత్నం కొంచెం వేగం గానూ, ఎంతో మెళుకువగానూ రిక్షాను తొక్కుతున్నాడు.

ఓ ఆటో దాదాపు ఢీకొన బోయింది. ఏసురత్నం హేండిల్ పక్కకు తిప్పడంతో ఆటో, రిక్షాను రాసుకుంటూ వెళ్ళి పోయింది.

"ఎదవ నంజికొడుకు, ఎదవ గీర, ఆడికేం బండిలో బద్రంగా కూకుంటాడు" అని ఏసురత్నం సణుక్కున్నాడు.

రిక్షా మెయిన్ రోడ్డు దాటింది. మరో పావు గంటకు పట్నం పొలిమేర దాటింది.

ట్రాఫిక్ పలచ బడింది. అప్పుడో లారీ, అప్పుడో బస్సూ వెళుతున్నాయి.

రిక్షాలో కూర్చున్నతను కాలక్షేపానికి కాబోలు,

"ఏవోయ్" అన్నాడు.

"ఏం బాబూ" అని బదులిచ్చాడు ఏసురత్నం.

"నీదీవూరేనా"

"కాదు బాబూ ఎంకటాపురం"

"ఏటేటీ, వెంకటాపురమా! అంత దూరం నుంచి వచ్చావా? ఎన్నాళ్ళయిందేటీ ఇక్కడి కొచ్చి"

"ఏడాదవుద్ది బాబూ"

"పుట్టినూరు విడిచి పెట్టి ఇంత దూరం వచ్చావేటీ"

"పుట్టినూళ్ళో పొట్ట గడవక పోతే ఏం చేస్తాం సావీ. ఆకలికాగలేక శానా మందిమి ఇక్కడి కొచ్చేసేం".

"అయ్యో పాపం. ఎంతమందొచ్చేరేటి"

ఏసురత్నం మాటాడలేదు. అప్పొచ్చింది. రిక్షా దిగాడు రిక్షా కమ్మి ఓ చేత్తోనూ, హేండిల్ మరో చేత్తోనూ పట్టుకుని లాగుతున్నాడు

అతను మళ్ళీ ఏదో అడిగాడు.

ఏసురత్నం వినిపించుకోనట్టు రిక్షా లాగుతున్నాడు, చెమటలు కక్కుతూ. జోళ్ళు లేని కాళ్ళు మండి పోతున్నాయి. చెమటకు బనియను ఒంటికంటుకు పోయి చిరాకు చిరాకుగా వుంది.

అప్ ఎక్కడం పూర్తవడంతో ఏసురత్నం రిక్షా సీటు మీద కూర్చుని గస తీర్చుకుంటున్నాడు. డౌను కావడంతో తొక్కక్కర్లేకుండానే రిక్షా వెళ్తోంది.

తన దగ్గర రెండు రూపాయలున్నాయి. ఈ బేరం డబ్బులు కూడా కలిపితే అయిదున్నర అవుతాది. రిక్షా అద్దెపోను అర్ధరూపాయి మిగుల్తాది. మరో రెండు మూడు బేరాలన్నా తగిల్తేకానీ ఇంట్లో పొయ్యి ఎలగదు– అనుకున్నాడు ఏసురత్నం.

రిక్షా డౌన్‌లో రయ్యిమని వెళ్తోంది. వెనక నుంచి హారన్ వినిపించడంతో ఏసురత్నం రిక్షాను రోడ్డు పక్కకు పోనిచ్చాడు. ఇంతలో ఆయిల్ టాంకర్‌ను ఓవర్‌టేక్ చేస్తూ ఓ లారీ రిక్షా మీద కొచ్చేసింది. ఏసురత్నం అసంకల్పితంగా హేండిల్‌ను ఎడమ పక్కకు తిప్పేశాడు. రిక్షా రోడ్డు మించి పిల్లి మొగ్గలేస్తూ పంట పొలంలో పడి పోయింది.

"అమ్మా" అని మూలిగాడు ఏసురత్నం.

★ ★ ★ ★ ★

సత్తెమ్మ నీరసంగా అడుగు లేస్తోంది. ప్రాణాలు కళ్ళల్లో కొచ్చినట్టుగా వుంది. ఆమె తల ఉదతలు పీకిన తాటిపింకలా వుంది. అస్థిపంజరం గాలిలో ఈదుతున్నట్టుగా నడుస్తోంది. సత్తెమ్మ ఒంటి మీది మల్లు చీర అతుకులతో మాసిపోయి వుంది.

సాయంకాలపు చిరు ఎండను సత్తెమ్మ కళ్ళు చూడ లేక పోతున్నాయి ఒక చెయ్యి నడుం మీదా, మరో చెయ్యి కళ్ళకు ఎండ తగలకుండా కనుబొమలపైనా వేసి నడుస్తోంది.

"మళ్ళీ పోట్టావీసుకేనా"

ఔనక్కడికేనన్నట్టు తలూపింది సత్తెమ్మ.

"నీ చాదస్తం కాపోతే, మనేర్దరొత్తే ఆళ్ళే అట్టుకు రారేటి".

బుల్లి మాటకు జవాబివ్వకుండా సత్తెమ్మ ముందుకు నడిచింది

ఈ బుల్లికి అన్నీ ఆరాలే. నేనెక్కడికెళ్తే దీనికెందుకంట. అయినా, నా బాద దానికెట్టా తెలుత్తాది. తల్లీ, తండ్రీ ఏ పుర్రాకులో పడి తిండెడతన్నారు– అనుకుంది సత్తెమ్మ.

అప్పుడే మళ్ళీ ఆకలేస్తన్నాది. పొద్మున్న ఈ పరాయి గంజినీళ్ళు పోసినాది. ఆళ్ళకే తిండానికి నేదు. ఆళ్ళకన్న మాటేటో ఎవురికి మాత్రం వున్నాది.

సత్తెమ్మ భారంగా నడుస్తోంది.

దూరంగా ఏడుపులు వినిపిస్తున్నాయి. సత్తెమ్మ గుండె గిలరలాడి పోయింది. ఎక్కడేడుపు వినిపించినా ఆమె వజ వజ వణికి పోతుంది.

ఆమెకు కష్టాలు కొత్తకాదు. కన్నీళ్ళు కొత్తకాదు. అయినా ఆమె మనసు బండబారిపోలేదు. మరింత మెత్తబడింది.

సత్తెమ్మ వాళ్ళ దగ్గర కెళ్ళింది.

ఏడేళ్ళ పాప మీద పడి ఒకామె కడుపు తరుక్కుపోయేళా ఏడుస్తోంది. పక్కన మరికొంత మంది కన్నీళ్ళు కారుస్తున్నారు.

సత్తెమ్మ వాళ్ళను ఓదార్చడానికి ప్రయత్నించింది. ఆదుఃఖంలో వాళ్ళు ఆమె మాటలను పట్టించుకోలేదు.

అక్కడ నుంచి సత్తెమ్మ కదిలింది. ఆమెకు కన్నీళ్ళు ఆగడం లేదు

క్రిందటేడాది.....

అయిదేళ్ళ మనవడు పోయాడు.

'నాన్నమ్మా, నాన్నమ్మా' అంటూ తన కూడా కూడా తిరిగేవాడు. తన దగ్గరే పడుకునేవాడు. వాడికి జబ్బు

చేసింది. ఎన్ని రోజులకూ తగ్గలేదు. వూళ్లో ఆచారిగారిచ్చిన మందులు మింగించారు. తగ్గలేదు. పది రూపాయలు అప్పుచేసి పక్కూరికి తీసికెళ్ళి పెద్ద డాక్టరుకు చూపించారు. ఆయన పరీక్ష చేసి, ఏవో మందులు రాసిచ్చాడు.

"కుర్రాడికి మంచి తిండి పెట్టాలి. బలమైన తిండి పెట్టక పోతే ఈ మందులేం పనిచెయ్యవు" అని ఆయన గట్టిగా చెప్పాడు.

ఓపూట తిండికే యాతన పడుతుంటే బలమైన తిండి ఎక్కడ నుంచి తెస్తారు? అన్నిటికీ ఆదేవుడే వున్నాడనుకుని మళ్లీ ఆచారిగారి మందే వాడారు. ఓ రాత్రి మనవడికి కడుపులో నొప్పొచ్చింది. ఎగవూపిరి దిగవూపిరికి . దిగినాక ఆచారిగారిచ్చిన మందు తెచ్చారు. మందు తాగమని తల్లి అడిగినా, తండ్రి అడిగినా వాడు మింగలేదు. ఆఖరికి తను వాడి తల నిమురుతూ "ఇది తాగమ్మా. నీకు తగ్గి పోతాది! తాగయ్యా" అని మందిస్తే, కళ్ళు తెరిచి , తనొంక చూసి, మింగేశాడు. ఆతర్వాత మూసిన కన్ను మళ్లీ తెరవనేలేదు.

సత్తెమ్మకు నీటి పొర అడ్డొచ్చి దారి కనిపించలేదు ఆగి, చీర చెంగుతో కళ్ళు తుడుచుకుంది. చుట్టూ ఓసారి చూసింది

ఎక్కడా పచ్చని చెట్టు లేదు. పొలాలు ఎడారుల్లా వున్నాయి. నేలంతా పగుళ్ళు దేరి వుంది. రాళ్ళూ, రప్పలతో నిండి వుంది.

ఆ వూళ్లో పంటలు పండి రెండేళ్లయింది. వానల్లేక పంటల్లేవు పంటల్లేక పనుల్లేవు. పనుల్లేక తిండి లేదు. ఉన్నవల్లా ఆకలే ఆకలి. బాధలే బాధలు. చావులే చావులు.

సత్తెమ్మ గాఢంగా నిట్టూర్చింది.

నడుస్తూ, నడుస్తూ గొప్పు తగిలి తూలి పడిపోబోయింది. కుడికాలి బొటన వేలి గోరు పైకి లేచి రక్తం వచ్చింది.

సత్తెమ్మ ఒంగుని గుప్పెడు ఇసక తీసి, రక్తం వస్తున్న చోట వేసి నొక్కి పెట్టింది. కొద్దిసేపు అలా వుంచి, తర్వాత నిలబడింది. చెయ్యి దులుపుకుంది.

మళ్లీ నడక మొదలుపెట్టింది.

చిరు చీకట్లు కమ్ముతున్నాయి.

సత్తెమ్మ పోస్టాఫీసు దగ్గర కెళ్లింది.

"ఏవే, మళ్లీ వచ్చావ్" అన్నాడు పోస్టు మాస్టరు- అరుగుమీద కూర్చుని చుట్టలు చుట్టుకుంటూ.

"మనేర్డరొచ్చిందా బాబూ"

"ఏవిటే పిచ్చి ముండా. రోజూ ఒకటే నస. మనియార్డరొస్తే నేనే తెచ్చిస్తాగా. రోజూ అంత దూరం నడిచి రావద్దని నీకెన్ని సార్లు చెప్పాను. నా మాట నాది. నీనడక నీది" అన్నాడతను చిరాకుపడుతూ.

"ఎందుకయ్యా, అలా ఇసుక్కుంటావ్. సీకటడితే ఇయాళ మానేసి రేపు తెస్తావు కదా అని నేనొచ్చాను" అని సత్తెమ్మ ఉసూరు మంటూ వెనుతిరిగింది.

చీకట్లో కళ్ళు చిట్లించి చూస్తూ - అక్కడాడెన్ని యాతనలు పడుతున్నాడో అనుకుంది సత్తెమ్మ.

* * * * *

ఏసురత్నం గోడకు జేరబడి కళ్ళు మూసుకున్నాడు. ముఖం ఉబ్బిపోయింది. తొడ దగ్గరయిన గాయం ఇంకా సలుపుతూనే వుంది. ఒళ్లంతా పచ్చి పచ్చిగా వుంది.

ఆరోజున రిక్షా తిరగబడి పోయినప్పుడు ఏసురత్నం బోర్లా పడిపోయాడు. అతని మీద రిక్షా పడి పోయింది. కొంత సేపటి వరకూ ఏసురత్నానికి ఏం తెలీలేదు. మెదడు మొద్దుబారి పోయింది. నెమ్మదిగా లేచి చూసేసరికి రిక్షా ఎక్కిన ఆసామీ మరో పక్క పడిపోయున్నాడు.

ఏసురత్నం అతని దగ్గరికి వెళ్ళి చూశాడు. అతను మూలుగుతున్నాడు. ఏసురత్నం అతన్ని నెమ్మదిగా లేపి కూర్చో బెట్టాడు.

అంతలో కొందరు రిక్షావాళ్ళు అక్కడికి వచ్చి, గాయాలతో వున్న ఇద్దర్నీ రోడ్డు మీదకు తీసుకు వచ్చారు. తర్వాత, వాళ్లను ఆస్పత్రిలో చేర్చారు.

ఆస్పత్రిలో గాయాలకు మందులేసి, కట్లు కట్టి ఇద్దర్నీ పంపేశారు.

రిక్షా రిమ్ములు వంగి పోయాయి. రిక్షాను ఓనరుకు అప్పగించారు. బాగు చేయించి ఇస్తే కానీ రిక్షాను తీసుకోనన్నాడు ఓనరు.

రిక్షాను రిపేరు చేయించడానికి తన వద్ద డబ్బు లేదన్నాడు ఏసురత్నం.

"ముందు మీరు రిక్షాను బాగు చేయించండి. రిపేర్ కయిన డబ్బును రోజుకింత చొప్పున చెల్లగొట్టుకోండి" అని నలుగురూ నచ్చు జెప్పడంతో తగ్గాడు ఓనర్.

"ప్చ్" అనుకున్నాడు ఏసురత్నం.

రోపలాగయినా రిక్షా ఎక్కితేనే గానీ రోజు గడవదు. మామూలుగా ఇచ్చే అద్దెతో పాటు రిక్షా రిపేరు కయిన ఖర్చుకూడా కొంత కట్టాలి. అది తీరేదాకా ఓ పూట గడవడమే కష్టం

అమ్మ కింతవరకూ డబ్బు పంపలేదు. డబ్బు పంపి అప్పుడే ఇరవై రోజులకు పైగా అయింది. అప్పుడు పంపింది మాత్రం ఎంత? ముప్పయి రూపాయలు! అమ్మెలా వున్నదో?

తమతోపాటు తననీ రమ్మంటే రాలేదు. ఆపట్నాల్లో ఆపాయికానాలూ, ఆ గొడవా పడలేనంది. ఉన్న వూరు విడిచి రాలేనంది. తన బతుకూ, చావూ అక్కడే నంది.

తనకు మాత్రం పుట్టి పెరిగిన వూరు విడిచి పెట్టి రావడం ఇష్టమా?

తమ వూరి నుంచి నూటయాభై మంది ఇక్కడికొచ్చేశారు. పనుల్లేక వచ్చేశారు. పస్తులతో చావలేక వచ్చేశారు.

కాలిదగ్గర చురుక్కు మనడంతో ఏసురత్నం కళ్ళు తెరచి కింద చూశాడు. పక్కగా వేసుకున్న ఏరుగుల దుప్పటి మీద చీమలు పాకుతున్నాయి.



నెమ్మదిగా లేచి, దుప్పటి దులిపాడు పెళ్ళాన్ని పిల్చి, చీపురుతో చీమల్ని తుడిచేయమన్నాడు.

ఆమె ఆపని చేస్తుంటే ఏసురత్నం చూస్తూ నిలబడ్డాడు. తర్వాత, దుప్పటిని మరోసారి దులిపి, దానిమీద నడుం వాల్చాడు

ఏసురత్నం ఉబ్బిన ముఖాన్ని చేత్తో నెమ్మదిగా పట్టుకున్నాడు.

రెండేళ్ల పిల్లని చంకనేసుకుని, ఓ చేత్తో గిన్నె పట్టుకుని బయటికెళ్ళిన ఏసురత్నం భార్య సణుక్కుంటూ తిరిగొచ్చింది.

"బియ్యం ఎక్కడా అప్పు పుట్టనేదు. ఇయాళింక పస్తే" అంది.

ఆమె గొంతు మామూలుగా లేదు. అలాగని ఆ గొంతులో కోపంలేదు. విసుగులేదు.

ఏసురత్నం భార్య మాట విని వూరుకున్నాడు.

ఎవరు మాత్రం ఎన్నిరోజులు అప్పు పెడతారు? తమ పక్క గుడిసెల్లో తమ వూరి వాళ్ళు కొందరుండడం వల్ల నాలుగు రోజులుగా బియ్యం, కాసిన్ని డబ్బులూ అప్పు ఇచ్చారు. వాళ్ళదీ తన లాంటి బతుకే. ఒళ్ళు సలుపుతున్నా రేపు రిక్షా ఎక్కక తప్పదు.

ఇలా అనుకుంటూ ఏసురత్నం మరో వైపుకి ఒత్తిగిల్లాడు

మైదు కాలువల్లోంచి మురికి వాసన వస్తోంది. గుడిసెలో ఉక్క ఉక్కగా వుంది. బయట ఎండ బడబాగ్నిలా వుంది. ఓ కాకి కావుకావు మంటూ అరుస్తోంది




వలస

పక్క గుడిసెలోని సోమన్న వచ్చాడు. అతనితో పాటు మరొకడు వున్నాడు.

వాళ్ళ అడుగుల చప్పుడు విని ఏసురత్నం లేచాడు.

సోమన్న పక్కనున్న నాయుడ్ని చూసి.

"నువ్వెప్పుడు దిగొడ్డావురా" అన్నాడు ఏసురత్నం ఆశ్చర్యంగా.

"ఇక్కడేదైనా పని చూసుకుందావని ఇయేళ వచ్చేను. నీకోసం పొద్దుటి నుంచీ వెదుకుతూనే వున్నాను. ఇప్పటికి సోమన్న కన్పించాడు. నీదగ్గరకు తీసుకొచ్చాడు" అన్నాడు నాయుడు.

"అమ్మెలా వుందిరా. డబ్బు పంపలేక పోయాను. ఈ మధ్దిన యాక్సిడెంటయినాది."

ఏసురత్నం మాటకు నాయుడు వెంటనే సమాధాన మివ్వలేదు. కొన్ని క్షణాలు మౌనంగా వుండి, తలదించుకున్నాడు. అలా తల దించుకునే-

"ఇంకెక్కడి సత్తెమ్మ పిన్నిరా. నాలుగు రోజుల కిందటే చచ్చిపోయింది" అన్నాడు నెమ్మదిగా.

ఏసురత్నం బావురు మని ఏడవలేదు. ఎలా చనిపోయిందని అడగలేదు అతని కళ్ళు పొడిగా వున్నాయి.

"అమ్మకింక డబ్బు పంపక్కర్లేదు" అనుకోగానే ఏసురత్నం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

కన్నతల్లి చచ్చిపోతే, తిండి పెట్టే బాధ తప్పిందని అనుకుంటున్న తనూ ఓ కొడుకేనా?

ఇప్పుడతని శరీరమే కాదు, మనసు కూడా పచ్చి పచ్చిగా వుంది.

ఇలాంటి వలసలెన్ని జరిగినా ఈ బతుకు లింతే. ఈ వ్యవస్థ నుంచి మరో వ్యవస్థకు వలస పోతే తప్ప ఈ బతుకులు మారవు. ఆ సంగతి ఏసురత్నానికి తెలీదు. తెలియజెప్పే వాళ్ళ కంట్లో అతను రేపో, మాపో పడక మానడు. □

## వర్ధమాన నర్తకుడు

## మద్దిపట్ల వెంకటభాస్కర్ :—

మిత్రులు శ్రీ మద్దిపట్ల వెంకటరావు బహుముఖ ప్రజ్ఞాశాలులు ఆయన నాటకాలు రచించారు వివిధ పాత్రలు నటించారు, పెక్కు నాటకాలకు దర్శకత్వం వహించారు బాల సాహిత్యం పెంచారు వివిధ విషయాలపై జనరంజకంగా, విద్వద్రంజకంగా ప్రసంగించ గల వాక్చతురులు మీదు మిక్కిలి విద్యా వేత్తలు. వివేకవర్ధనీ బోధనాభ్యసన (ట్రెయినింగ్) కళాశాల ప్రిన్సిపాలు ఇలాటి తండ్రి అందదండలు గల పుత్రుడు గొప్ప నర్తకుడు కావడం సహజం



శ్రీ మద్దిపట్ల వెంకట భాస్కర్

కనుక ఆయన జ్యేష్ఠ పుత్రుడు శ్రీ మద్దిపట్ల వెంకటప్రభాకర్ కూచిపూడి నృత్య విశారదుడయ్యాడు వివేక వర్ధని కళాశాలలో బి ఎస్ సి. చివరి సంవత్సరంలో ఉన్నాడు" నాన్నగారు నాటక రచయితలు, నటులు, దర్శకులు కావడం వల్ల చిన్నప్పటి నుంచి నాటకాలు చూడడం, నాటకాలు వేయడం, ఏకపాత్రాభినయాలు చేయడం నాకు ఇష్టం. పాఠశాలలో చదివే రోజులతో ఆకాశవాణిలో మాధ్యమిక పాఠశాలా కార్యక్రమాలలోను, నాన్నగారు నిర్వహించిన పిల్లల సీరియల్ నాటకాల్లోను పాల్గొన్నాను హైదరాబాద్‌లో కొత్తగా దూరదర్శన్ కేంద్రం పెట్టినప్పుడు వివిధ నాటకాలలో పాల్గొన్నాను అలాగే రకరకాల నృత్య ప్రదర్శనలు చేసే వాడిని నృత్య నాటకాలలో నా ఆసక్తిని చూచి నాన్నగారు, అమ్మ శ్రీమతి వర్ధనమ్మగారు నన్ను నృత్యం నేర్చుకోడానికి ప్రోత్సహించారు కూచిపూడి ఆర్ట్స్ అకాడెమీలో చేరాను" అన్నాడు వెంకట భాస్కర్ కూచిపూడి ఆర్ట్స్ అకాడెమీ ప్రారంభంలో కళాప్రపూర్ణ డాక్టర్ వెంపటి చినసత్యంగారి యాజమాన్యంలోను ప్రస్తుతం నృత్య చూడామణి కుమారి కె శోభానాయుడు గారి ఆధ్వర్యం లోను ఉన్న ఉత్తమ నృత్య శిక్షణ సంస్థ వెంకటభాస్కర్ 1980జూన్ 19న చేరి శిక్షణ పొందుతున్నాడు నాలుగు సంవత్సరాల డిప్లొమా పూర్తి చేసి 'నాట్యవిశారద" బిరుదు పొందారు అటు కళాశాల చదువు పట్ల శ్రద్ధ

## హైదరాబాద్ నోట్‌బుక్

చూపడం మానలేదు 10వ తరగతి వరకు వివేక వర్ధనీ పాఠశాలలోను, ఇంటర్మీడియేట్ సెయింట్ జోసెఫ్ జూనియర్ కళాశాలలోను చదివి, వివేక వర్ధనీ డిగ్రీకళా శాలలో బియస్ సిలో చేరి ప్రస్తుతం చివరి సంవత్సరంలో ఉన్నాడు క్రీడలలోను వెంకటభాస్కర్‌కు చాల ఆసక్తి వుంది క్రికెట్ అన్నా, అథలెటిక్స్ అన్నా చాల ఇష్టం పదవ తరగతిలో హైస్కూలు ఆటలపోటీలో స్కూలు ఛాంపియన్ షిప్ గెలుచుకొన్నారు శాస్త్రీయ కర్నాటక సంగీతం అంటేనూ చాల ఇష్టం అభ్యసిస్తున్నాడు దాదాపు ఐదు సంవత్సరాలుగా నృత్య ప్రదర్శనలు ఇస్తున్నాడు ఎక్కువగా గురువులైన కుమారి శోభానాయుడు గారితో అనేక నృత్య నాటికలలో పాల్గొన్నాడు చండాలిక, విశ్వామిత్ర మేనక, విప్రనారాయణ నృత్య నాటికలలో పాల్గొన్నాడు విప్రనారాయణలో ఇతనికి నచ్చినది, ఇతనికి మంచిపేరు తెచ్చినది పాత్ర విప్రనారాయణుని శిష్యుడు శ్రీనివాస్ పాత్ర ఆంధ్రప్రదేశ్‌లోని సకల ముఖ్య పట్నణాలలోను, వివిధ ప్రాంతాలలోను వెంకటభాస్కర్ నృత్య ప్రదర్శనలు ఇచ్చారు కూచిపూడి నృత్యంలో డాక్టరేట్ పొంది, ఉత్తమ నర్తకుడుగా, ఉత్తమ నాట్యాచార్యుడుగా ఖ్యాతి గడించాలని వెంకటభాస్కర్ ఆశయం తన గురువులైన డాక్టర్ వెంపటి చినసత్యం, కుమారి శోభానాయుడు గార్ల ఆశయాలు ఆదర్శాలు దృష్టిలో పెట్టుకొని, వారి అడుగు జాడలలో కూచిపూడి నృత్యానికి సేవ చేయాలని ఇతని ఆశయం ఇటీవలే ఇతనికి అమెరికాలో కూచిపూడి నృత్య శిక్షణకు అవకాశం కలిగింది అక్కడి కొందరు కూచిపూడి నృత్యాభిమానులు తమ పిల్లలకు నృత్యం నేర్పడానికి ఇతనిని ఆహ్వానించారు ప్రస్తుతం మన దేశంలో ఏకళ అయినా స్వతంత్రంగా జీవిక కలిగించ జాలక పోతున్నది మరొక వృత్తిలో స్థిరపడో, ఆలంబనం చేసుకొనో కళాసేవ చేయడం ఉచితం వెంకటభాస్కర్ బి ఎస్ సి, ఎం ఎస్ సి ముగించి, ఒక వృత్తిలో స్థిరపడ తన ఆశయానికి అనుగుణంగా కూచిపూడిలోను డాక్టరేట్ పొంది నృత్య సేవకు నడుం కట్టాలి జనరల్ ఎడ్యుకేషన్‌తో పాటే ఏకళయినా విశేషంగా రాణిస్తుంది శ్రీ వెంకటభాస్కర్ తన ఆశయాలు నేర్చుకొనడంలో తగిన అర్హతలు సంపాదించు కొనడానికి నాట్యాధిదేవతలయిన కృష్ణ నటరాజాదులు అవకాశం కల్పింతురు గాక!

## ఆర్. టి. సి. మాండలికం :—

హైదరాబాద్ విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తిగారు ఆమధ్య విశాలాంధ్ర ప్రచురణాలయం వారి ఆంధ్రప్రదేశ్ దర్శినిని ఆవిష్కరిస్తూ, వృత్తి పదాలు, మాండలికాలు గురించి తెలుగులో జరిగినంత పరిశోధన ప్రపంచంలో మరెక్కడా జరుగలేదని, ఆ వివరాలు ఈ దర్శినిలో పొందుపరచడం అవసరమని సూచించారు కాని, డాక్టర్ కృష్ణమూర్తిగారు పరిశీలించని మరొక మాండలికం ఉంది అది ఆంధ్రప్రదేశ్ రోడ్ రవాణా సంస్థ వారి మాండలికం డాక్టర్ కృష్ణమూర్తిగారు ఆర్ టి. సి బస్సులలో

తెలుగు విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో జరిగిన మేజిక్ శిక్షణ శిబిరం ముగింపు సమావేశంలో ప్రసంగిస్తున్న ఉపాధ్యక్షుడు ఆచార్య దోణప్ప, శిక్షణ పొందిన మేజిషియన్లతో డైరెక్టర్ శ్రీ బి ఏ పట్టాభిరాం, హైదరాబాద్ కలెక్టర్ శ్రీమతి మినూ మాథ్యూస్, రచయిత్రి కుమారి వాసిరెడ్డి సీతాదేవి, శ్రీ సూరి బాబు, మేజిషియన్ నగేష్ చిత్రంలో ఉన్నారు ఈ శిక్షణ శిబిరాన్ని ఆంధ్రప్రదేశ్ మాజిక్ అకాడమీ, తెలుగు విశ్వవిద్యాలయం సంయుక్తంగా నిర్వహించాయి



పయనించివుంటే, ఆ మాండలికాన్ని కూడ పుక్కిట బట్టేవారేమో! ఆ మాండలికంలోని కొన్ని మాటలు భాషా శాస్త్ర వేత్తల పరిశీలనకోసం ఉదాహరిస్తున్నాను. మీరు ఏ ఆర్. టి. సి. బస్సులోనైనా ఎక్కండి, పొందే స్వాగత వచనాలు ఎక్కో జల్దీ. జరా ముందుక్కపో. అభిమన్యునిలా పద్మవ్యూహం ఛేదించుకొని ఎక్కి. రెండడుగులు ముందు వేసి హమ్మయ్య అనుకుంటాము. ఇంతలో కండక్టరు టికెట్ల ఫలకంతో మన భుజం పొడుస్తూ ఫీ ఫైసల్. ఎంతాసేప్. యాడ్కెళ్లి వచ్చేందవ్. ఇంతాలిస్యం చేస్తుండవ్– అంటాడు. ప్రయాణీకుడు కొంచెం ముసలివాడైతే ఇక ధోరణి మారుతుంది. ఏందే తాతా! మూట ఇప్పు జల్దీ. కీసకెళ్లి సెయ్యి పైకిరానియు. నీకాదే పదేటంద్కు నీ నౌకర్లమా?– ఇదీ వరస. టికెట్ల రుసుం పెంచినప్పటి నుంచి ఐదు, పది చిల్లర పైసలు వాపసు ఇవ్వడమనేది లేనేలేదు. చిల్లర అడుగుతామనుకోండి. ఏం!సిల్లర యాడుందది?ఖజానా ఖులాయించడమా? నీ సిల్లరతో బంగ్లా కడతమా? – అంటాడు. ఏ బీదవాడో ఐదు పైసలు తక్కువ ఇస్తాడనుకోండి. ఏంబే! చేత్ల పైసగిట్ల లేకండా ఎందుకెక్కినవ్?

# హైదరాబాద్ నోట్‌బుక్

జరాదిమాగ్ వుందొద్దా? నీ దాదాపర్దాదాల మొఖానా? ఇది సర్కార్ బస్సు –– అని బెదిరింపులు. చిల్లర గట్టిగా అడిగామనుకోండి. రా. బస్ డిపూ కాడికి. రాసిస్తా. జర్నల్ మేనేజర్‌కు షికాయత్ చెస్కో. పదిపైసల్కాడ సస్తుండడు. ఒకసారి నేను ఏమయ్యా, నా నెరిసిన తలన్నా చూచి నెమ్మదిగా మాట్లాడవయ్యా – అన్నా. ఏం! కాళ్లల్ల బడవంటవా? అంత గొప్పోడివి బస్సెందుకెక్కినవ్?– అన్నాడు. పల్లెటూర్లలో ఇంకా ఘోరం!పసిపాపలు జనసమ్మర్దానికి ఏడ్వడం సహజం. ఏందమ్మో! పిల్లలా బలబలాడడం వినబడ్తంల్యా?నోట్ల తిత్తి తురుకు– అన్నాడు ఒక కండక్టర్. నేను నిర్ఘాంత పోయి ఏమిటండీ ఈ భాష? – అన్నాను. ఔనయ్యా! పాలతిత్తే కదా అది నేనేం తప్పు చెప్పాను? – అని సమాధానం. అది నిజమే. ఆడవాళ్ళతో కొంచెం సభ్యత పాటించవద్దూ! – అనడిగాను. ఉన్న సంగతి చెబితే తప్పేముందండీ సబ్బెత గిబ్బెత మాకేం తెలుసు– అన్నాడు. పక్కనవున్న పెద్దమనిషి (పండితుడు కాబోలు) స్తనౌ మాంసగ్రంథీ అని అన్నాడండీ భర్తృహరి అని ఉదాహరించాడు. ఈ పరిశోధన ఎంతవరకు పోతుందో అని భయపడి నోరు మూసుకున్నాను. మీర్ ఆలం మండీలో పళ్ళు, కూరగాయలు కొని గంపలతో ఎక్కుతుంటారు ఆడవాళ్ళు. వారితో కండక్టర్ల సంభాషణ, ప్రాచీన భాణ ప్రహసనాల భాషను మించి పోతుంది. ఆర్. టి. సి. అధికారులు ట్రెయినింగ్‌లో తమ సిబ్బందికి సదాచారం నేర్పాలని అభ్యర్థన. సిబ్బంది అని ఎందుకన్నానంటే డిపోలకు వెళ్లినా ఇదే మాండలికమే. ఆర్. టి. సి. వారికి ఇతరుల విషయంలో బహువచనమనేదే లేదనిపిస్తుంది.

**ఉపశ్రుతి :–**

డెబ్బయ్యేండ్లు నిండుతాయి త్వరలో నాకు– అన్నారు నామిత్రులొకరు. సప్తతిపూర్తి శాంతి చేసుకోండి– అన్నాను. ఏం ఘనకార్యం చేశామని శాంతి?– అని ఎదురు ప్రశ్న వేశారు. అనుదిన హత్యలకు ఆకరమైన భారతదేశంలో 70 ఏళ్ళు బతకడమే విశేషం– అన్నారు పక్కన వున్నవారు.

–తిరుమల రామచంద్ర

## కథలు

"జబ్బు మనుషులు" కథ నేటి సమాజంలోని అధికసంఖ్యాకుల 'కృతఘ్నత'కు అద్దంపట్టింది. తేరగా వస్తే తమకు కావాల్సిన పనులు చేయించుకుని పబ్బం గడుపుకునే ప్రబుద్ధులే ఎక్కువ నేటికాలంలో. ఉపకారం, కృతజ్ఞత, సానుభూతి, మానవత ఇవన్నీ కేవలం పుస్తకాలలో చదువుకోటానికి వ్రాసుకునే మాటలు. శ్రమకు తగ్గ ఫలితాన్ని వెంటనే వసూలు చేసుకోవటం నేటి సామాజిక న్యాయం! సాటి మనిషి సాయం చేస్తే కనీసం ఆ సహాయానికి కృతజ్ఞత కూడా చూపక పోవటమనే జబ్బు ఇంతట్లో అంతరించేది కాదు. ఈ జబ్బు ఎంతభయానక మైనదో తెలియ చెప్పిన రచయిత శ్రీ కె. కె. రఘునందనకు వందలాది అభినందనలు!

–వక్కలంకరామారావు, మానేపల్లి

★ ★ ★

ఇల్లిందల సరస్వతీదేవి గారి కథ 'ఇదీ అదేనా' అన్నది చాలా బాగుంది. మనం వింటున్న అన్ని ఆకస్మిక చావులు "కట్నం" కోసమే కానక్కర్లేదని ఈ కథ చెప్పక చెబుతోంది. సామాజిక స్పృహగల కథ.

–జోశ్యుల కనకదుర్గ, భువనేశ్వర్.

★ ★ ★

శ్రీమతి ఇల్లిందల సరస్వతీ దేవిగారి కథ "ఇదీ అదేనా?" చాల బాగున్నది.... వుద్యోగాల్లో, రాజకీయాల్లో ... సమాజంలో ప్రతీచోటా, చివరకు అన్ని అలవాట్లలో స్త్రీకి సమాన హక్కులు వుండాలని కోరే ప్రతీ వ్యక్తికి – కావల్సిన గుణపాఠం చెప్పి వివరించిన రచయిత్రికి మా హృదయ పూర్వక అభివందనలు!!

–సి. హెచ్. స్వరాజ్య మోహన్‌రావు, జగ్గంపేట

★ ★ ★

'గురువింద' కథ మాకెంతో నచ్చింది రచయితకు అభినందనలు. –దామెర్ల గీత, నెల్లూరు

## ఉత్తరాలు

( 4 వ పేజీ తరువాయి)

## వ్యాసాలు

వెంకటేష్, ఫరాముఖచిత్రంతో వెలువడిన సంచిక అత్యంతాకర్షణీయంగా వుంది. "తపఃస్థలి వేదాద్రి" వ్యాసం అక్కడి దృశ్యాలను కళ్ళకు కట్టినట్లు చిత్రించింది. వ్యాస రచయితకు అభినందనలు.

–మోదేకుర్తి సత్యనారాయణ, అన్నవరం □



Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667



# దూరదర్శనం

లత

## వార్తలు

వెంకట్రామన్ నామినేషన్ దాఖలు చేశారు వారి పేరు రాజీవ్‌గాంధీ ప్రతిపాదించగా పి వి నరసింహారావుగారు బలపరిచారు రఘోత్తమరెడ్డి చాలా భూమి దేశానికి ఇచ్చారు కార్మిక సంఘాల బంద్ శాంతియుతంగా జరిగింది ఈ వార్తల్లో ఎనౌన్సరు ఏడెనిమిది తప్పులు చదివి దిద్దుకుంది గాని వినయంగా క్షమించాలి అనలేదు. అది గొప్ప మాడెస్టీ అన్న విషయం ఈ ఎనౌన్సరుకి తెలియదు లాగుంది. ఎవరూ చెప్పి ఉండరు

## బుస్ – భగ్

రచన అభిషిక్త వర్మ – నాటిక ఒక ముసలాడు ...రుతిండి తింటూ ఉంటాడు. గాస్ అయిపోతుంది ...బు ఏడుస్తుంది తాతయ్య పోయాడు ...నని మనవడు ఏడుస్తాడు అలా కాసేవు తరువాత పోయింది గాస్ గాని తాతయ్య ... తెలుస్తుంది ఇంతలో బుస్ భగ్ అంటూ ...లో గాస్ సిలెండరు అమ్మే వాడొస్తాడు మళ్ళీ ... బుస భగ్ అంటూ సోఫాలో పవళించినా ...రు ఎవరూ ఏమిటో ఖర్మ ఇలాటి చెత్తకార్య...లు ప్రసారమవుతున్నాయి. వీటి నుంచి శ్రోతకి విముక్తి లేదు ఇది కూడా నాటికే ...ంతనోవు

★ ★ ★ ★

బ్రిజ్ మహరాజ్ నృత్యమైనా హైదరాబాద్ కేంద్రం కథక్ నృత్యంతో తెలుగు వారిని ఏడిపించడం భావ్యం కాదనుకుంటాను

ఆ వెంటనే బాలభవన్ చిరుత అఖండుల పాము నెమలి నృత్యం చూపిస్తే సోదర ప్రేక్షకులారా! ఆనందించండి నాకు మాత్రం ఆనందం కలగటం లేదు ఈ నృత్యానికి సందేశం ఏమిటంటే సహజ శత్రువులయిన పామునీ నెమలినీ కలిసి ఉండమని ప్రబోధిస్తూ జాతిమతం వద్దనీ స్నేహంగా ఉండమంటున్నారు ఇందులో ఔచిత్యం లేదు టి వి వారు పాటలు పాడినా పాముని నెమలి చంపుతుంది – చిట్టి చీమలు స్నేహంగా ఉండాలట. ఇలాటి అవకతవక కార్యక్రమాలకి టి వి పెట్టిన్నది పేరు ఏదైనా ఆ పాము నెమళ్ళ మధ్య నిశ్చింతగా నృత్యం చేసింది. అదీ కథ ఇప్పుడు లంబాడీ నృత్యం. భరత నాట్యం ఒకటి బ్రిజ్ మహరాజ్ సుదీర్ఘ నృత్యం రెండు పాము నెమళ్ళ నృత్యం మూడు కోయ నృత్యం నాలుగు లంబాడీ నృత్యం అయిదు అయ్యా ప్రేక్షకుల మెదళ్ళు ఆ విధంగా తిని వారిని ఏడిపించటం అధర్మం – ఆఖరికి జాతీయ కార్యక్రమంలో భరతనాట్యం హేమా గోపాలనో ఎవరిదో? ఇది అన్యాయం

## చహరా

స్త్రీ యొక్క బహుముఖాలు – వనపూల్ రచన మీద ఆధారపడిన తిలోత్తమ అవిద్యావతి అయిన తిలోత్తమని కాదని తల్లి సలహాతో మరో పెళ్ళి ప్రధానంకి తయారవుతాడు అతను శంఖం ఊదటం బెంగాలీల ఆచారం – అది కూడా తిలోత్తమనే ఊదాల్సి వస్తుంది. శంఖ ధ్వనితో పరివర్తన కలిగి తిలోత్తమతో గదిలోకి వెళ్ళి తలుపేసుకుంటాడు. ఇదో చహరా

## కాలాజల్

రచన ఉగని పాపం భర్త చనిపోయి భార్యలిద్దరూ వితంతువులవుతారు చిన్న భార్యవెళ్ళిపోతుంది పెద్దభార్య తనలో ఉన్న చాపల్యం వల్లనో ఆసరా కావాలనో చనిపోయిన భర్తతో తన విషయంలో తగూ పెట్టుకున్న అతనితో సంబంధం పెట్టుకుంటుంది ముస్లిముల్లో స్త్రీకి పునర్వివాహం ఏ నాడూ తప్పుకాదు చూద్దాం గొప్ప ఇంట్రెస్టింగా ఉంది ఈ నాటిక – స్త్రీ ఎప్పుడూ తన స్త్రీత్వానికే ప్రాధాన్యత ఇస్తుంది ప్రేమకు కాదు అన్నది రచయిత అభిప్రాయం అయి ఉండాలి.

## స్వరరాగసుధ

ఈ కార్యక్రమం చాలా మందికి నచ్చుతోంది – ఒక శాస్త్రీయ గానం దాని ననుసరించిన రెండు సినిమా పాటలు వింటాం ఓహో ఈ రాగస్వరూపం ఇది అని తెలుస్తున్నది. అందుకే ఇది చాలా చక్కని ప్రోగ్రాంగా చాలా మంది భావిస్తున్నారు నాకు నచ్చటం అలా ఉంచి సంగీతం తెలిసిన వారికి ఇది ప్రతిరోజూ మాట్లాడుకొనే విషయం అయింది ఆభేరిలో పురందరదాసు కీర్తన ఆభేరి రాగమేనా? ఈ వారం ఫరుగెత్తుకొచ్చిన పిల్లవాడిలో గాయకుడు భగవంతుడిని చూడటం బాగుంది సినిమా పాటలుకి ఈ రోజు కాలం లేదు అందుకని వెయ్యలేదు

## అమృత

ఫిరాఖ్ గోరఖ్‌పురీ కవితామృత ఆధారంగా జయాబాధురి నిర్వహిస్తున్న చక్కని కార్యక్రమం ఒకోవారం ఒకో మహాకవి కవిత నాధారంగా చేసుకొన్న కార్యక్రమం– గోరఖ్‌పురీ అయిఏయస్ ప్యాసయి కూడా నేను కవిగానే బ్రతుకుతానన్న కవితా గౌరవం గల మహాకవి – ఆశాభోన్స్లే ఈతడవ సంగీత నిర్వహణ

అవును ప్రేమ చెరుకురసం కన్న తీపి – మత్తు యవ్వనం అది మరింతమత్తు.

హృదయంలో మంట చల్లారాలంటే ఇష్క్ – ఇక్కడ మధువు కురవాలి ప్రియురాలు రావాలి – రాత్రి కరగ కూడదు

ఇంకా కొద్దిగా రాత్రి ఉంది – ప్రియురాలు మెల్లని అడుగులతో వస్తున్నది దృశ్యం బాగుంది. ఇష్క్ అంటే ప్రేమకూడా తెలుగులో స్వరరాగసుధా – హిందీలో అమృతా బాగుంటున్నాయి జ్ఞానపీఠ ఎవార్డు పొందిన మహాకవుల గీతాలూ కవితలూ దృశ్య సహితంగా వినిపించటం గొప్ప విషయం. □

'కాలాజల్'లో అలోక్‌నాథ్, అరుణాఇరానీ



# బెంగుళూరులో క్రీడా, యువత జాగృతి పథక సమావేశము

జూన్ 9, 10 తేదీలలో బెంగళూరులో అఖిలభారత క్రీడా శాఖమాత్యుల సమావేశము జరిగినది. సుదీర్ఘ ఉపన్యాసములు, చర్చల తర్వాత జాతీయ యువత పథకము రూపొందించుటకు తీర్మానించబడినది. వివిధ రాష్ట్రముల నుండి క్రీడాశాఖా మాత్యులు, అధినేతలు, క్రీడారంగబుద్ధి జీవులను బెంగళూరు వచ్చుటకు సమావేశము మన దేశములో క్రీడాకారులను రూపొందించు 'కోచ్' లను తయారు చేయు పాటియాల ఎన్. ఐ. ఎస్. (నేతాజీ సుభాస్ నేషనల్ యినిస్టిట్యూట్ ఆఫ్ స్పోర్ట్సు) సంచాలకుడు డా. సి. ఎం. ముత్తయ్య ఆధ్వర్యమున ఏర్పాటుచేయ బడినది.

ఈ సమావేశమును ప్రారంభించుచు కేంద్ర మానవ వనరుల అభివృద్ధి శాఖమాత్యులు పి. వి. నరసింహరావు వ్యాయమ విద్య, క్రీడలను విద్యాబోధనలో నిర్బంధ భాగముగా ప్రవేశ పెట్టుటకు మార్గములు తెలుప వలసినదిగా కోరారు. ఆర్థిక వనరులను యిందుకై సమకూర్చుట గురించి కూడా ఆలోచించ వలసినదిగా కోరారు. కేంద్ర క్రీడల మంత్రి మార్గరేట్ అల్వా మాట్లాడుచూ కేంద్రము ప్రవేశపెట్టు క్రీడలు, వ్యాయమము వివిధ పథకములను అమలు చేయుటలో కేంద్ర, రాష్ట్రముల సంబంధము, అమలు 'పరుచు విధానము గురించి సలహాలను యివ్వవలసినదిగా సమావేశమును కోరారు. క్రీడాంగణములు నిర్మించుట, ఆధునిక క్రీడాసామగ్రి అమర్చు కొను పద్ధతి అమలు చేయుట గురించి ఆలోచించ వలసినదిగా కోరారు.

మొదటి రోజు సమావేశములో 1. నేషనల్ సర్వీస్ స్కీమ్ వాలంటీర్‌లను యువత కొరకై రూపొం దించు వివిధ జాతీయ కార్య క్రమముల అమలులో వినియోగించుట. 2. గ్రామీణ యువతను వివిధ అభివృద్ధి కార్యక్రమములలో పాల్గొనుట. 3. విద్యాలయములలో క్రీడలు, యువజన కార్య క్రమములు. 4. క్రీడల అభివృద్ధికి సామూహిక పథకము. 5. క్రీడల పోటీలు నిర్వహించుట, ఔత్సాహిక క్రీడాకారులను కనుగొనుట గురించి 'పర్కింగు గ్రూపులు'గా ఏర్పడి చర్చించారు.

సమావేశములో జాతీయ యువత కార్యక్రమము రూపొందించుటకు నిర్ణయము తీసుకోబడినది. కేంద్రం క్రీడలు, యువజన కార్యక్రమములు చేపట్టుట గురించి చేసిన సలహాలను హర్షించి, యువతకు శిక్షణ, ఉద్యోగ అవకాశములు ఎక్కువ అవశ్యకత కలదని తెల్పారు.

రెండవ రోజు సమావేశములో 8వ ప్రణాళిక కాలము ముగియు నాటికి అన్ని ఉన్నత విద్యా



బెంగుళూరు సమావేశం అధ్యక్షురాలు
శ్రీమతి మార్గరెట్ అల్వా

లయములలో ఆటస్థలములు అమర్చుట గురించి నిర్ణయము చేయబడినది. దేశములో పదివేల హయ్యర్ సెకండరీ స్కూలుల వరకు క్రీడాస్థల ములు లేకుండా యున్నవని యువజన, క్రీడల కేంద్ర కార్యదర్శి ఆర్. గోపాలస్వామి తెలిపారు. ఎనిమిదవ పంచవర్ష ప్రణాళిక ముగియునాటికి దేశములో గల బ్లాకు ఒక్కింటికి లక్షరూపాయలు కేంద్రం అందించ కలదని దానితో క్రీడా స్థలములు సమకూర్చుకొను టకు ప్రయత్నము జరుగునని తెల్పబడినది. ఇండోర్ స్టేడియం నిర్మాణమునకు 20 లక్షల వరకు, గ్రామీణ ప్రాంతములో అయిదు లక్షల వరకు ఆర్థిక సహాయము కేంద్రం అందించి సహకరించును. ప్రాథమిక విద్యనుండి క్రీడలు, వ్యాయామమునకు పాఠశాల సమయములోనే ప్రత్యేక సమయములు కేటాయించుటకు నిర్ణయము చేయబడినది. గత ఏడు ఢిల్లీలో జరిగిన రాష్ట్ర క్రీడా, యువజన సమాఖ్య మంత్రుల సమావేశము తర్వాత బెంగుళూరు సమావేశము తదుపరి నిర్ణయముల గురించి చర్చించుటకు ఏర్పాటు చేయబడినది.

కేంద్రం అమలు చేయనున్న వివిధ క్రీడాభివృద్ధి కార్యక్రమములలో బెంగళూరులో 10.5 కోట్ల వ్యయముతో చేపట్టు బహుళార్థక ఉపయోగ నిర్మాణము జరుగును ఇది ఇండో-సోవియట్ సంయుక్త కార్యక్రమము. ఇందునిమిత్తం రెండు దేశముల మధ్య 'ప్రోటోకాలు' సంతకాలు త్వరలో జరుగును. ఈకార్యక్రమము క్రింద ఎంపిక చేయబడిన అయిదు క్రీడలు అనగా ఎథలిటిక్స్, బాక్సింగ్, వెయిట్‌లిఫ్టింగ్, వాలీబాల్‌లో దక్షిణాది వారికై ప్రత్యేక శిక్షణ నిర్వహించబడును. ఇందులో 12–16, 16–20, 20 ఏళ్ళ పైబడిన వారుగా మూడు గ్రూపులలో సమర్థులు అయినవారిని ఆరు వారాల శిక్షణ శిబిరాలు నిర్వహించ బడును. ఆ తర్వాత పర్యవేక్షణలో వారు సాధించిన పురోభివృద్ధి సమీక్షించబడును.

ఈ సందర్భమును పురస్కరించుకొని సోవియట్ దేశం మనదేశంలో క్రీడాకారుల ఉపయోగ నిమిత్తము ఎన్. ఐ. ఎస్. నకు రెండు కోట్ల విలువైన క్రీడా సామగ్రి బహుకరించెను. ఈ కార్యక్రమము జూన్ 11వ బెంగళూరులో జరిగినది.

కలకత్తా (సిన్థటిక్ 90), గాంధీనగర్ (సూపర్ గ్ర బెంగళూరు (పోలీగ్రాస్) హాకీ క్రీడాస్థలం త్వరలో ఏర్పాటు చేయబడును. బెంగళూ దక్షిణదేశ ఎన్. ఐ. ఎస్. శిక్షణ కళాశాలలో 'సి ఎథలిటిక్ ట్రాక్' త్వరలో ఏర్పరుచుట జరుగుచున్నదని ముత్తయ్య తెల్పారు.

క్రీడా మంత్రుల సమావేశ సందర్భము ఎత్తున క్రీడా ప్రదర్శన ఏర్పాటు చేయబడిన

గత ఏడు ఢిల్లీ సమావేశములో యిటువంటి నిర్ణయాలు అనేకము చేం కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు రూపొందించు అందించు ఆర్థిక సహాయాలు గ్రామీణ ప్ర లకు మాత్రము చేరుటలేదనుట యదార్థ గ్రామీణ ప్రాంతములలో మొన్నటికి, నిన్నటి ఎటువంటి మార్పు క్రీడావిషయములలో కనిపించ లేదు. గ్రామీణ ప్రాంతములలో గల ఔత్సాహిక క్రీడాకారులను వెతికి వెలుగులోనికి తెచ్చుటయే తమ దృక్పథము అని క్రీడాధినేతలు అను మాటలు చేతలలో కనిపించుటలేదు. ఒక పైసా క్రీడల నిమిత్తము అందుట లేదు. గ్రామీణ క్రీడా కేంద్రాలు నెలకొల్ప బడినప్పటి నుండి వారికి ఆర్థిక సహాయము సరిగా అందక అవి పనిచేయుట కుంటుపడినది.

ప్రభుత్వము సదుద్దేశముతో చేపట్టిన కార్య క్రమములు విఫలమగుటకు నగర ప్రాంతములలో స్థిరముగా క్రీడాధినేతలుగా మకుటంలేని మహరాజులు పెత్తనము చెలాయించుచున్న వారు అనవచ్చు. వనరులు ఉద్దేశించ బడిన వారికి అందకుండా నగర ప్రాంతములలో వినియోగించు నట్లు వీరు అడ్డుపడుచున్నారు. ప్రభుత్వము యీ స్వార్థపరులను దూరముగా యుంచాలి.

—ముకరమ్